# కాసులదండ

[నవల]



రచన:

శ్రీ గుంటి సుబ్రహ్మణ్యశర్మ

పబ్లిషర్సు:

నవ్య రచనా

# పరిచయం

అధికార దాహానికి తృప్తిలేదు. వడతగిలినప్పటి దాహంవంటిదది. శక్తినికూడా చూసుకోనివ్వనివి దాహం.

ఆ అధికారదాహం గ్రామాలలో కుటుంబాలలో తెస్తున్న చిచ్చును, స్వార్థపరుల కుట్రలకు కలిగిస్తున్న అవకాశాలను శ్రీ గుంటి సుబ్రహ్మణ్యశర్మగారు తమ యీ నవలలో చక్కగా చిత్రించేరు.

శ్రీ శర్మగారు తెలుగు పాఠకులకు అపరిచితులేమీకాదు. తమ నవలను తెలుగు పాఠకుల కందివ్వగల అవకాశం కలిగించినందుకు వారికి నమస్కృతాలు.

—ప్రకాశకులు.

ఎలెక్షన్ రోజులు సమీపిరచే కొలది నారాయణరావుకు మనసునం దారాటము అధికము కాజొచ్చింది.

రెండు టెర్మ్‌ల నుండి అప్రతిహతంగా రంగపురం మునిసిపల్ ఎన్నికల్లో నెగ్గి, ఛైర్మన్‌గా పనిచేసిన అతనికీసారి విషమ పరీక్ష యేర్పడింది. స్వార్థపరుడగు వాడు అధికారములో వున్నంతకాలము దానిని ఎంతవరకు దుర్వినియోగ పరచుకోవచ్చో అంతవరకు కన్నూ మిన్నూ చూడకుండ చరించినాడతడు. ప్రజా విశ్వాసము తనకు దూరమైపోయిన, పిల్లి కండ్లు మూసుకొని పాలు త్రాగినట్టు, తన్నెవరు గమనించ లేదులే యని లంచ గొండియై, దురాశా పరుడై, పక్షపాతియై చరిస్తున్నాడు.

ఆకారణంచేతనే యీసారి అతని వార్డులోనే నిరంజనరెడ్డి పోటీగా నిలబెట్ట బడ్డాడు. వారిరువురికి అంతస్తుల్లో హస్తిమశకాంతరమైన, ప్రజల మద్దత్తుతో నిరంజనరెడ్డి తగిన ప్రతిద్వంది అనిపించుకొన్నాడు, నారాయణరావుకు. 'ఈనాటికి యీ వూళ్ళో నా యెదుట నిలిచి మీసం దువ్వే మగాడు కలిగాడుగా!' అని అతని ఆశ్చర్యము — అసహ్యము! దాన్ని మరింత రెచ్చగొట్టటానికి వరదరాజు లాంటి అవకాశవాదులు గంటు పడ్డా రతనికి.

శ్యామసుందరి కేమాత్ర మిష్టములేదు ఈసారి మగడు ఎలెక్షన్స్‌లో దిగడం. అయితే నారాయణరావామె మాటను లక్ష్య పెడ్తేగా? స్త్రీ అయినా మె పరిస్థితుల మార్పు నెట్లో గ్రహించి ఒకటి రెండు మార్లు భర్త గ్రాసంగా ఉన్నప్పుడు సమయం గుర్తించి, "ఏమండీ యీ ఎలెక్షన్స్‌తో ంధం లేకపోతే మనకు గడవదంటారా?" అని ప్రశ్నించింది.

అతడామె అభిప్రాయాన్ని గ్రహించలేక "నీతలంపేమి? అన్నట్టు ైపు చూచాడు.

o

# కాసులదండ

"ఏదో యిప్పటికి పదేండ్లుగా మునిసిపల్ ఛైర్మెన్ పని చేశారు. ఇంక దాన్ని వదలి జీవితంలో కొంత విశ్రాంతి తీసికోవడం మంచిదేమో."

"ఇప్పుడు దాన్నంత తేలిగ్గా వదలుకోవలసిన అవసర మేమొచ్చింది?"

"ఈ ఉద్యోగం ప్రజల కిష్టమున్నంతకాలం చేస్తేనే బాగుంటుంది. లేకపోతే...."

"లేకపోతే వదిలెయ్య మంటావా?" ఆడదానివి నీకేం తెలుసు, శ్యామా? ఇలాంటి పనుల్లో ఎన్నికలకు నిలిచి గెలవడమే ఘనత."

"ఈసారి గెలవడం కష్టమేమో!"

"ఎవరు చెప్పారు నీకా సంగతి?"

"ఏమో నా కలా తోస్తుంది."

"అదంతా నీ పిరికితనం. వరదరాజులు చెప్పడం వినలేదా ఓటర్లు ఎక్కువమంది మనవైపే ఉన్నారని?"

"ఇది ఎవరి మాటను నమ్మేకాలం కాదు. ఇంతకు డబ్బిచ్చికొన్న ఓట్లు ఎంతవరకు స్థిరమో ఎవరు చెప్పగలరు?"

భార్య తనతో ఈ విషయమై ఎక్కువగా వాదించడ మాతనికి సరి పడలేదు. "ఆడదానివి నీ కెందుకీ గొడవ?" అని దబాయించి ఆమె నోరు మూయించాడు.

ఆమె హృదయ గ్రహించింది. అతడెట్టు తన మంకుపట్టు మానడని! ఈసారి కొన్ని వేలు ఖర్చుకాక మానదని, అయినా, జయం సంశయాస్పదంగానే ఉంది.

ఆదివారం మధ్యాహ్నం భోజనానంతరం మగని వద్ద కూర్చొ తమలపాకులందిస్తూ ఏదో చిరునవ్వుతో చెప్పదలచుకొన్న శ్యామసుందరి

చూచి నారాయణరావు ఉల్లాసంగా "ఏమో ఉంది, శ్యామా నీ మనస్సులో? చెప్పు చూద్దాం" అని అడిగాడు.

"తీరా విన్నాక కొట్టిపారెయ్యరు కదా?"

"ఎలెక్షన్ల సంగతేగా? ఓస్ — దాంతో నీకేమి పని?"

"అదికాదులెండి."

"మరేమి?"

"మీకెప్పుడు బయటి గొడవలే కాని యింట్లో సంగతు లేవి కాబట్టవు. ప్రసన్న పెండ్లి సంగ తేమాలోచించారు?"

నారాయణరావు నిండుగా నవ్వాడు.

"అదా సంగతి? అన్నట్టు ప్రసన్న కిప్పుడు వయసెంత?"

"చూడండి మీకుండే ఆలోచనల్లో ఆమె వయస్సే గ్రహించ లేకున్నారు."

"గ్రహించకేం? ఈ మాఘానికి పద్దెనిమిది నిండుతుంది. అవునా?"

"అవును. మరి యింకా ఎన్నాళ్ళని యింట్లో వుంచుకొంటారు?"

"ఏం అంత భారంగా ఉందా అమ్మాయి?" అని చిరునవ్వుతో అడిగాడు.

"మగవాళ్లు మీకేమి తెలుసులెండి? వయసొచ్చి, పెండ్లికాని పిల్ల లిదంద్రులకు భారం కాకుంటుందా?"

"సరే, చూద్దాం. . ఈ ఎలెక్షన్ల గొడవ ముగిసిపోని."

"దానికి దీనికి సంబంధమేమిటి? ఏమైనా సరే, యీ వైశాఖంలో మ్మాయి పెండ్లి జరగాల్సిందే...."

"అట్లని రాణీగారి ఆజ్ఞ. అవునంటావా?"

"ఏమైన అనుకోండి. ఆలస్యం వద్దు. మనమీద బావగారుంచి పోయిన బాధ్యతను సక్రమంగా నిర్వర్తించుకోక తప్పదు."

"బావగార" నే మాట విని నారాయణరావు మెత్తపడి మౌనంగా నిట్టూర్చాడు. అతని ఊహలన్ని పదిహేనేళ్ళు వెనక్కు పరుగెత్తాయి.

ప్రసన్న ఆతని అన్న కూతురు. అన్న సోమసుందరం యిల్లు వదలిపోయి పదిహేనేండ్లయింది. అప్పుడామె వయస్సు రెండేళ్ళు మాత్రమే. అపర రంభలాంటి భార్య సులోచన యొక్క ఆకస్మిక మరణంతో సోమ సుందరం బుద్ధి స్థిమితంలేక ముద్దులు కులికే ఒక్కగాని ఒక్క కూతురు రెండేళ్ళ బిడ్డ ప్రసన్నను, సుమారు యిరవై లక్షల ఆస్తిని, అంతా తమ్ముని వశంచేసి, ఏదో మనశ్శాంతికని తీర్థయాత్రలు చేసి వస్తానని చెప్పి పోయిన వాడింత వరకు తిరిగి రాలేదు. అప్పటికీ అన్నదమ్ములిద్దరు విభాగాలై ఎవరి ఆస్తి వాటాను వారనుభవించుకొంటూ ఉండినా, వదిన పోయాక అన్న మన స్థితిని గుర్తించి నారాయణరావు ఆతని వ్యవహారాలను కూడ తానే చూచుకొంటూ వచ్చాడు. తీరా అతడు కూడ ఒక రాత్రి ఎవ్వరికి తెలుపకుండ, తమ్మునిపేర ఒక జాబు వ్రాసివుంచి, అదృశ్యుడై పోయాడు. అందులో కట్టకడకు 'నేను మరల తిరిగి వస్తానో లేదో నాకే తెలియదు. రామమోహనునితో బాటు ప్రసన్నను మీ బిడ్డగానే భావించి, ఆమెకు తగిన విద్యాబుద్ధులు చెప్పి, సకాలములో వివాహము చేసి, నా ఆస్తి సర్వస్వం నాబిడ్డకు స్వాధీనం చేసేది" అని వ్రాసి వుంచాడు.

సరే.... పద్దెనిమిదేండ్లు దాటినా అతడు తిరిగి రాకపోవడమేకాక ఎక్కడున్నాడో, ఏమయ్యాడో ఎవ్వరికి తెలియదు. అసలతడు ప్రాణాలతో వున్నాడో, లేక యేసన్యాసుల్లో కలసి పోయాడో అని నారాయణరా[వు] అనుమానం.

ఏమయినా ప్రసన్న, తల్లిదండ్రుల జ్ఞాపకమే లేక శ్యామసుంద[ర్] నారాయణరావును తల్లిదండ్రుల కంటె ఎక్కువగ ప్రేమిస్తూంది. ఆ

అంటె వారికి కూడ ఎంతో ప్రేమ అభిమానం కలవు. ఆమె కంటె మూడేండ్లు పెద్దవాడైన రామమోహన్‌కు చెల్లెలంటే యీ లోకంలో ఆమెను మించిన ప్రేమాస్పదమైన ప్రాణి లేదు.

నిరుడు ప్రసన్న పి. యు. సి. లో ప్రధమ శ్రేణిలో ఉత్తీర్ణురాలైంది. రామమోహను బి. ఏ ముగించుకొని మద్రాసు కాలేజీలో చేరి ఎనిమిది నెలలయింది. అన్న యింట్లో లేంది ప్రసన్న కెట్లో ఉంది. ఎప్పుడూ ఏదో చదువుకొంటూ యింట్లోనే వుండిపోయింది కాలేజీ చదువు మానేసి.

"మరి ఏమాలోచించారు?" అని శ్యామసుందరి అడిగిన ప్రశ్నతో నారాయణరావు ఊహాలోకం నుండి ఊడిపడిన వాడిలాగా ఎగాదిగా ఆమె వైపే చూస్తూ "ఇప్పుడేమి చేయమంటావు?" అని అడిగాడు ఎదురు ప్రశ్నే జవాబైనట్టు.

"మీ అన్నగారు మీమీద ఉంచిపోయిన బాధ్యతను నిర్వర్తించుకోండి ఇప్పటికే ఎంతో ఆలస్యమైంది."

"ఏమి లేదులే, అంతా పిచ్చికాని ప్రసన్న పెండ్లి కిది సకాలం."

"సరే, అలాగే కానివ్వండి. ముందు ఆలోచన?"

"చెప్పానుగా, ఎలెక్షను ముగియనీ అని?"

"అదేమీ కుదరదు. ఈలోగా తగిన వరాన్వేషణ జరగాల్సిందే. పెండ్లి కావలిస్తే ఎలెక్షన్లు ముగిశాక చేసుకోవచ్చు."

నారాయణరావు భార్య వాదనలోని సమంజసత్వం అర్థమయింది కాని మారు చెప్పకుండా మరల ఆలోచనలో పడ్డాడు. ఐదు నిముషాలు దాటాక యిట్లన్నాడతడు "చూడు. శ్యామా, నేను ఎవరెంత చెప్పినా యీసారి ఎలెక్షన్‌లో పోటీ చేయక తప్పదు."

"సరి, మీ యిష్టం. మీకు ఎదురెవ్వరు చెప్పగలరు?"

"ఇదే సమయంలో వరాన్వేషణ అంటే అది నాకు సాధ్యం కాదు"

"మరెవ్వరి కప్పగిస్తారా పని?"

"మన పౌరోహితుడు పరంధామయ్య యీ పనికి తగినవాడు కాదంటావా?"

శ్యామసుందరి కూడ ఆలోచించి "సరే! అలాగే. అతనిని పిలిపించి యీ బాధ్యత నప్పగించండి" అనింది. వెంటనే నారాయణరావు పౌరోహితుడు పరంధామయ్యను పిలుచుకొని రావడానికి నౌకరును పంపాడు.

# 2

"మంగా వంటేమి చేశావు ఈ వేళ?"

"ఉల్లిపాయల పులుసు, గోంగూర పచ్చడి."

"ఉల్లిపాయల పులుసేమిటే? పాడువంట — ఏకాదశినాడు."

"అయితేనా కేం? అది నా కిష్టం. నీ కిష్టమైతే తిను. లేకుంటే పస్తు పడుకో."

"అంతేనంటావా?"

"అంత కాకపోతే. నాకు కాసుల దండ తెచ్చేవరకు నీ యిష్టా, యిష్టాలతో నాకు పనిలేదు."

ఇది మంగమ్మ వరుస ప్రతి దినం మగడు పరంధామయ్యతో.

ఆడవానికి మొదట్లోనే కళ్ళెం తగిలించక పోతే మగవానికి కడకు తన గతి తప్పదని పరంధామయ్యకు చాల ఆలస్యంగా తెలియ వచ్చింది.

ఈ పాతాన్ని వివాహమై భార్య కాపురానికి వచ్చిన మొదట్లో

గ్రహించాల్సిందతడు. అప్పట్లో కామ వివశుడై, జీవితాంతం ఉండే తమ సంబంధాన్ని మరచి, కామినీ వాంఛా నిబద్ధుడైన పరంధామయ్య యిప్పుడు మంగమ్మ చేతిలో కుక్కినపేనై పోయాడు.

అతడు అమాయకుడే కాని, ప్రారంభంలోనే పొరబడ్డాడు భార్య హావభావాలకు, అందచందాలకు దాసుడై, క్రమంగా మగని అశక్తతను గమనించి నెత్తికెక్కి కూచుంది పెండ్లాము.

ఆమె కోరుకే తడవుగా మహాప్రసాదమని వెనుకాడకుండ పులి జున్నునైనా సరే తెచ్చిపెట్టి, మొదటనుండి ఆమె స్వేచ్ఛా ప్రవృత్తికి దోహదమిచ్చి, యిప్పుడు కాదదంటే మాత్రం మంగమ్మ వినుతుందా తన మంకుపట్టు?

కోరిన వెంటనే ఆమె కన్నీ సమకూరాల్సిందే. లేకుంటే పరంధామయ్య కింట్లో శాంతిలేదు. ఎప్పుడు అగ్నిపర్వతము నుంచి ఎగజిమ్ముకొని వచ్చే 'లావా' వలె, భార్య నోటినుండి వచ్చే నిష్ఠురోక్తులొక్కొక్కమారు అతి నిష్ఠూరంగా ఉంటాయి. ఆమె వాగ్బాణాహుతికెంత అలవాటు పడిన వాడైన, పాప మొక్కొక్కమారు, "హా పరమేశ్వరా! ఈ గయ్యాళి గంటుపడ దానికెంత పాపం చేశానో పూర్వజన్మలో!" అని విచారించాడు పరంధామయ్య.

రెన్నెల్ల క్రిందట పొరుగింట పొన్నమ్మ మగడు కొత్తగా చేయించి యిచ్చిన కాసులదండను ధరించి, కొడుకు పుట్టిన రోజని పౌరోహితుని భార్యను పేరంటానికి పిలువ వచ్చింది.

"ఎప్పుడు చేయించావమ్మా, యీ దండ?" అని అడిగింది మంగమ్మ.

"రెండు రోజులైంది మావారు చేయించితెచ్చారు."

"చాలా బాగుంది. ఎంత ఖర్చయిందో?"

"రెండు వేలని మావారన్నారమ్మా!"

"అబ్బో! రెండు వేలే!"

ఆ కాసులదండను చూచాక తనకు అలాంటి దొకటుంటే బాగుండుం దనిపించింది పరంధామయ్య పత్నీ శిరోమణికి. అంతే! ఆమె కింక నిద్దుర పట్టలేదు—

పొన్నమ్మ మగడు పెద్ద పి. డబ్ల్యు. డి. కంట్రాక్టరు. తలచుకొంటే అతనికి రెండు వేలేమి లెక్క?

తన మగడో—పౌరోహితమంత్ర జీవనుడు. ఊళ్ళోఇల్లు, అడవిలో చేనులేనివాడు. అనుకున్నపాళంగా అంత పెద్దనగను చేయించిపెట్టే తాహతు ఆయనకేది? కాసులదండ అంటే తనకూ కనీసం రెండు వేలు కావాలి.... ఎక్కడినుండి తేగలడు?

మంగమ్మకీ వివరాలన్ని కాబట్టవు. తనకూ ఒకకాసులదండ చేయించి పెట్టమనీ ప్రాధేయపడసాగింది. రోజులు గడిచేకొలది ప్రార్థన సతాయింపు క్రిందికి దిగింది.

అయితే పొట్టివానికి పుట్టెడు బుద్ధులంటారు. గిడ్డగా, బూరగా పెరిగిన పరంధామయ్య మస్తిష్కతూనీరంలో భార్య ప్రయోగించే నిశిత వాగ్బాణజాలాన్ని ఎదుర్కొనేందుకు తగిన సమ్మోహనాస్త్రాలు లేకపోలేదు. అతడు వానిని సమయోచితంగా ఉపయోగించు చుండబట్టే యిన్నాళ్ళుగా యింట్లో నిలువగలిగాడు. లేకుంటే, యీ పాటికి ఏ సన్యాసులమఠంలో ప్రవేశించవలసి వచ్చుండేదో అతనికి!

భార్య కోరిన కాసులదండను చేయించి యివ్వకపోతే తనకు గత్యంతరంలేద నిగ్రహించి, పరంధామయ్య పగలు రాత్రి ఆ విషయాన్ని గురించే తదేకంగా విచారిస్తున్నాడు. రోజులు గడిచేకొలది ఆమె పోరు దుర్భరమై పోతూంది. కాపురానికొచ్చి పదేండ్లయినా ఆమె కింకా నగా నట్రామీద మోజుపోలేదు. పైపెచ్చు, వయసుతోబాటు అదికూడ పెరుగుతోంది.

ఇన్నేండ్లయినా పిల్లజెల్లా కలక్కపోవడ మామె కింకొక చింత. అన్నిటికి మగని అశక్తతే కారణమని అతన్ని మితిమీరి సతాయిస్తూవుంది.

ఆ దినం ఏకాదశి. భార్య వండిపెట్టిన పుల్లిపాయల పులుసు తినక తప్పలేదాతనికి. మధ్యాహ్నం, యజ్ఞోపవీతములు ఒడుకుతూ కూర్చుని వుంటే నారాయణరావు యింటి నౌకరు వెంకన్నవచ్చి "అయ్యగారు మిమ్మల్ని అర్జంటుగా ఒక్కమారు రమ్మన్నారండి" అని చెప్పి వెళ్ళిపోయాడు. ఎందుకంటే, ఏమీ చెప్పలేకపోయాడు వెంకన్న. "సరే — వెళ్ళివస్తా" వంటూ పరంధామయ్య భార్యకు చెప్పి బయలుదేరాడు నారాయణ రావు యింటికి.

పరంధామయ్య వచ్చేవేళ కింకా నారాయణరావు, శ్యామసుందరి మాట్లాడుకుంటు హాలులో సోఫాలమీద కూర్చుని ఉన్నారు. పౌరోహితుని ఆహ్వానిస్తూ నారాయణరావు "రండి, పరంధామయ్యగారు" అని ఆసనం చూపాడు.

అప్పుడే ఎండలు తీవ్రముకాజొచ్చాయి. పరంధామయ్య పై పంచతో చెమట నొత్తుకుంటూ వుండడంచూచి, శ్యామసుందరి ఫ్యాను వేసింది.

"ఇంకా భోజనం కాలేదా?" అని అడిగాడు గృహమేధి.

"అయిందండి"

"మరి మొగాన బొట్టేది?"

"చెమటకు చెరిగిపోయిందేమో. ఇంతకు యీ దినం ఏకాదశి కదండి?"

"అయితేమాత్రం. భోంజేశావుకదూ? బొట్టుంటే తప్పేమి?"

"ఎంత భోంచేసినా ప్రత్యక్షంగా బొట్టుపెట్టుకొని లోకానికి చాటడ మెందుకండి?"

"అయితే ఒకటి ఆత్మవంచన, రెండవది లోకవంచన."

ఆ మాటకు పరంధామయ్య బదులు చెప్పలేక నీళ్ళు నమలసాగాడు. అతని దుస్థితిని గమనించి శ్యామసుందరి "పోనిద్దురూ, ఇప్పుడా ప్రశంస ఎందుకు? అయ్యగారిని ఎందుకు పిలిపించారో చెప్పరాదూ?" అన్నది భర్తతో. నారాయణరావు తెప్పరించుకుంటూ "అలాగే, అలాగే. చూడండి పరంధామయ్యగారూ. ఎప్పుడేది అనుకుంటే దాన్ని తక్షణం చేసెయ్యడం నా ప్రకృతి."

"అది మంచిదేలెండి. అదంతా గొప్పవారి లక్షణం."

"సరేకాని, నేను ఎలెక్షన్ గొడవల్లో ఉండిపోయానా? ప్రసన్నకు తగిన వరుణ్ణి వెంటనే చూచి యీ వైశాఖంలో పెండ్లిచేసి తీరాలని మా శ్యామ పట్టుపట్టింది."

ఆడవాళ్ళు పట్టుపడితే ఎట్లుంటుందో తన ఇంటిలోని అనుభవాన్ని తలచుకొని పరంధామయ్య లీలగానవ్వి "ఇందులో పట్టుపట్టడ మేముందిలెండి? అమ్మగారు అవసరాన్ని బాగా గుర్తించారన్నమాట" అన్నాడు.

"అయితే, మీరు యీమెతో ఏకీభవిస్తున్నారా? సరే. కానివ్వండి. ఇప్పుడు తగిన వరుడెక్కడున్నాడు. అంత త్వరగా వివాహం చేయడానికి?"

"అమ్మాయికి తగిన వరుడంటే మాటలా, నారాయణరావుగారూ? అప్సరసలాంటిది ప్రసన్న. కులగుణరూప వయోచితుడుకావాలి. కష్టపడి వెతకాలి."

ఎవరు వెతకాలి?"

"ఇంక మీరే."

"నాకు విరామమేది? ఎన్నికలు కూడ వైశాఖంలోనే వచ్చిపడ్డాయి. అటుతరువాత అసెంబ్లీ మీటింగులు. ఎం. ఎల్. ఏ. అయ్యాక మీటింగులకు పోకతప్పుతుందా?"

"ఎట్లు తప్పుతుంది? పోవల్సిందే."

"నా పని కావాల్సిందే. ప్రసన్న పెండ్లి కావల్సిందే. ఇప్పుడు చెప్పవచ్చిందేమంటే ప్రసన్నకు తగిన వరుని చూసేభారం మీ మీద పెడదామనుకొన్నాను."

"అబ్బో—నా మీదే? చాలా తూకం! మోయగలనా?"

ఆ మాటకు శ్యామసుందరి కలుగజేసుకొని "మీరు కాక మా కింకా ఆప్తులెవ్వరున్నారండీ! తిరిగ్గా నాలుగుచోట్ల కెళ్లి విచారించగలిగినవారు మీ రొక్కరే" అనేసింది. పరంధామయ్య బుర్ర గోక్కుంటూ ఆమె ప్రశంసకు లోలోన ఉబ్బిపోయారు.

కడకు అతని కాపని తప్పలేదు. నారాయణరావు మరల యిలాగన్నారు. "మీరు తప్ప మాకీవిషయములో సహాయపడేవాళ్లెవరు లేరంటి. అమ్మాయి సంగతంతా మీకు తెలుసు. ఈఅపరంజి బొమ్మకు తగిన జోడును బ్రహ్మదేవు డెక్కడ సృష్టించాడో కనుక్కొనే బాధ్యత మీది. ఒక నెల వాయిదా. సంబంధం సరిపొయ్యిందా ఒక లక్ష కట్నం. రెండు ఖర్చులు నేనే భరిస్తాను. ఏమంటారు?"

"అనుటకేముందండి? అంతా మీ దర్జాకు తగినట్లే చెప్పారు."

"శ్యామా, అయ్యగారి ప్రయాణపు ఖర్చులక్రింద మూడు వందలు తెచ్చీయ్"

అనుటే తడవుగా శ్యామసుందరి బిరబిర వెళ్ళి మూడువందలు తెచ్చి భర్త చేతిలో పెట్టింది? "ఖర్చులుకేమి లెండి. ఇప్పుడెందుకింత డబ్బు?" అని పరంధామయ్య నసిగాడినా వదలకుండ నారాయణరావు పైకి మొతని చేతిలో పెట్టి, అతడు నిర్వర్తించవలసిన బాధ్యతను గురించి మరల మరల విపులంగా చెప్పారు. శ్యామసుందరి కూడా అవేమాటలు సమర్థించింది.

"సరేలేండి. భగవంతునిమీద భారముంచి నా ప్రయత్నం రేపే ప్రారంభిస్తా." నంటూ పరంధామయ్య వారివద్ద సెలవుతీసుకొని వెళ్ళి పోయాడు.

# 3

ఇంటినుండి బయలుదేరేముందు తన్నీ మాత్రం అదృష్టమేనాడు వరిస్తుందని పరంధామయ్య ఏమాత్ర మూహించలేదు.

నిర్నిరక్షితంగా మూడుపందల రూపాయలు చేతిలో పడ్డాయి. "ఈ సంగతివింటే మంగ ఎంత సంతోషిస్తుంది!" అని అతడు లోలోన అమితా నందం పొందిపోయాడు.

నారాయణరావు దంపతులుకోరినట్టు కొన్నాళ్ళు ఆవూరికి, యీవూరికి వరాన్వేషణకని పోయివస్తే తీరింది, తన ఖర్చంతా పాతికకంటె హెచ్చుం డదు. మిగిలినది కాసులదండకని మంగమ్మ చేతిలో పడేయాలని అతని కప్పుడే ఆలోచనతోచింది.

ఈ ఎదురుచూడని లాభసాటి బేరంసంగతి ఆలోచిస్తూ, కొంత పర ధ్యానతో నడచి యింటికి వస్తూవుండే పరంథామయ్యకు ప్రక్కనే ఒక కారాగి, హారన్ శబ్దమయ్యింది. ఉలికిపడి చూచాడతడు. కారులోకూర్చున్న శంభుదాసు అతని ఉలికిపాటును చూచి నవ్వాపుకోలేక "ఏమండీ, చాలా పరధ్యానంగా నడుస్తున్నారే? రండి, ఇంటి కెళ్ళుదాము." అని కారులోకి ఆహ్వానించాడు.

పరంధామయ్యకుకూడ తన స్థితికి కొంత నవ్వు వచ్చింది. వెంటనే

కారులోకి ఎక్కి శంభుదాసు ప్రక్కన కూర్చున్నాడు. కారు దాసు ఇంటివైపు వెళ్ళిపోయింది.

రంగపురములో నారాయణ తరువాత అంతటి ధనవంతుడు శంభుదాసొక్కడే. అతని తండ్రి తాతలు అవూరు వారేకాని శంభుదాసుమాత్రము వయసు వచ్చాక రైల్వే కంట్రాక్టుపని చేస్తూ చాలయేండ్లు బొంబాయిలో ఉండి విశేషంగా విత్త మార్జించినాడు. రంగపురములో పెద్దలు సంపాదించిన భూస్థితికూడ అపారంగా వుంది. ఏదో తనకు వీలైనప్పు డప్పుడప్పు డాతడు స్వగ్రామానికి వచ్చి పోయేవాడు. బొంబాయిలో వుండగానే అతనికి, భార్య పార్వతికి ఒక్క కూతురు కలిగింది. ఆమె పేరు అరుంధతి. వయసు యిరవైయేండ్లుండవచ్చును. చాల అందమైనదేకాక బలే హుషారైన చతురమతి. అరుంధతి బొంబాయిలో ఉన్నప్పుడే మెట్రిక్ పరీక్ష ప్యాసై, తరువాత సంగీతం చాల బాగ అభ్యసించింది. ఆమెకు పదేండ్ల వయసులో పార్వతి గతించిపోగా, శంభుదాసు బిడ్డకు తానే తల్లి, తండ్రి అయి చాల గారాబంగా పెంచాడామెను. భార్య పోయాక ఐదారేండ్లు బొంబాయిలోనే కాలం గడిపాడు శంభుదాసు. కాని, క్రమక్రమంగా అతనికి 'సిటీలైఫ్' తోదాటు సంపాదనమీదకూడ విరక్తిపుట్టి బిడ్డతో నాలుగేండ్లక్రితం రంగపురానికివచ్చి పెద్దలుకట్టించిన పాతమేడ నొక రమ్య సౌధవంగా మార్చి హాయిగా కాలం గడపసాగాడు.

సుమారు పది లక్షలు బ్యాంకులో పుంచుకొన్నాడు శంభుదాసని ప్రతీతి. భూములమీద కనీసము రెండు లక్షలు ఖర్చుపెట్టి, తగిన నీటి వసరులు కల్పించి, నమ్మకస్థులగు రైతులను చేతబట్టుకొని బంగారు పండిస్తున్నాడు. అతని యిల్లేచేసు ఒక లక్ష. ఇంటిలో ఉండేది తాను, బిడ్డా మాత్రమే. వంటవాడు, పనిమనుషులు కలిసి ఏడెనిమిదిమంది కలరు. అతనిదంతా రాజభోగం.

ఇంత వున్నా శంభుదాసు మనసులో పుత్రసంతతి లేకపోవడ మొక చింతగానే ఉండేది యిటీవలదాక. కాని, అరుంధతి పెద్దదై తన విద్యా వైదుష్యాలతో అతనికా చింత లేకుండ చేసింది. ఆమెయే అతని పాలిటి కొడుకైన, కూతురైన. ఆమెను తగినవానికిచ్చి, యిల్లరిక ముంచుకోవా లని దాసు కుతూహలము. తండ్రి వయసు నలభై యాభై మధ్యలో వుంగడంచూచి, బిడ్డ అప్పుడప్పు డాతనిని ద్వితీయ వివాహానికి ప్రోత్స హిస్తూ వుంది. "వద్దమ్మా వద్దు. నీకు సవతి తల్లిని తెచ్చిపెట్టడమెందుకు?" అని అతడు సమ్మతించకున్నాడు.

శంభుదాసులాంటి బంగారు పిచ్చుక రంగపురములో చేరిందిమొదలు పరంధామయ్యా ఆతని నాశ్రయించి, ఇంటి పౌరోహితుడై, చాల విశ్వాస పాత్రు డయ్యా డాతనికి. నారాయణరావు దగ్గరకంటె శంభుదాసువద్ద పరంధామయ్యకు చనువెక్కువ. కారణం— దాసు చాల సరసుడైనవాడు. నారాయణరావువలె స్వాతిశయపరుడు కాదు. నారాయణరావెంత రాజస మూర్తో, శంభుదాసంత సాత్వికమూర్తి. వారి యింటి వాతావరణ మెంత గంభీరమైందో, వీరి ఇంటి వాతావరణ మంత స్నేహపూరితమైంది. ఈ రెండు బంగారు పిచ్చుకల ఆశ్రయములో పరంధామయ్య జీవిత రథం సాఫీగా సాగిపోతూంది.

కారువచ్చి పోర్టికోలో నిలిచింది. దాసు పరంధామయ్యతో ఇంటిలో ప్రవేశించాడు. అంతలో అరుంధతీ ఎదురై నవ్వు మొగముతో "అయ్యా గారు రెండు రోజులనుండి ఇంటివైపు రాలేదెందు?" కని ప్రశ్నించింది. అతని కామె అంటే చాల సంతోషం. తండ్రి, పరంధామయ్య అచ్చటి సోఫాలో కూర్చున్నాక అరుంధతి యిద్దరికి కాఫీ తెప్పించిపెట్టింది.

పనివుండనీ లేకపోనీ, దినాని కొక్కమారైన పౌరోహితుడు ఇంటికివచ్చి పోతూవుండాలని ఆ తండ్రి, బిడ్డల కోరిక. ఎప్పుడైన బద్ధ

కముతో పరంధామయ్య అలా రాకపోయ్యాడా, అరుంధతి వెంటనే ప్రశ్నిస్తుంది ఎందుకు రాలేదని. అప్పు డాత దేదో సంజాయిషీ చెప్పుకోక తప్పదు.

అరుంధతికూడ తండ్రిప్రక్కన సోఫాలో కూర్చానుంది. "ఏమండీ పరంధామయ్యగారూ, యీవేళ మీతో ఒక క్రొత్త ప్రస్తాపన చేయవలచాను ?" అని ప్రారంభించాడు శంభుదాసు.

"ఏమిటబ్బా!" అన్నట్టు కన్నులింత చేసుకొని పరంధామయ్య అతనివైపు చూడసాగాడు. అరుంధతి ఎందుకో తలవాల్చి ముసి ముసి నవ్వు నవ్వుకొంటూంది.

"అమ్మాయి పెండ్లివిషయం" అన్నాడు దాసు.

"ఓస్, ఇంతేగా!" అన్నట్టు పరంధామయ్య నిట్టూర్చి "ఊ బాగుంది" అన్నాడు—అటు నారాయణరావు మోపిన భారాన్ని తలచుకొని, అలాంటిదే దాసుకూడా మోపినాడని సంతోషించాడు.

"చూడండి, అరుంధతికి ఇరువైలో పడింది. ఇంకా నే నెంత కాల మూరకుండేది? వాళ్ళ అమ్మే బ్రతికివుంటే నన్నింతకాలం నిద్రపోనిచ్చేదా ?"

"నిజమే. మీ కోరిక సమంజసంగానే వున్నది. మరి, యీ బంగారుబొమ్మకు తగినవరు డెందున్నాడు ?"

"అదేనండి నిశ్చయం కావలసి ఉంది."

"మీ గమనంలో ఎవరైనా వున్నారా ?"

"మా బంధువర్గములోనే యిద్దరు ముగ్గు రున్నారనుకోండి. కాని, నాకు వారు సరిపడకున్నారు. ఉన్న ఒక్క బిడ్డను ఒక అయ్యచేతిలోపెట్టి పంపివేస్తే నా గతి ఏమికాను ? నన్ను విచారించేవాళ్లెవరు ? ఈ కంచెంత కాపుర మెవరికోసరం ?

"అవునవును. ఆమాట నిజమే. మరేమిటి మీ ఆలోచన?"

"అణుకువకలిగి, అరుంధతి కిష్టుడై, యిల్లరికముండే అల్లుడు కావాలి."

ఇదేదో భస్మాసుర వరంగా తోచికాబోలు పరంధామయ్య ఆలోచింప సాగాడు. మగసంతతిలేక, ఒక్కగానొక్క బిడ్డ కలిగి, ఇరవై లక్షలకు పైబడ్డ ఆస్తివంతుడైన శంభుదాసు కల్లుడై ఆ ఇంట్లోనే వుండవలెనంటే ఎవడైన యిష్టపడగలడు కాని, దాసు కోరినట్టు 'అణకువకలిగి, అమ్మాయి కిష్టుడై ఉండాలి.'

అరుంధతిలో అసామాన్యమైన అందం — అందాన్ని మించిన తెలివితేటలున్నాయి. ఆమె యిష్టాయిష్టా లేలాటివో తెలుసుకోవడం మంచిదని తలచాడు పరంధామయ్య.

"ఇల్లరికపుటల్లుడు దొరకకపోడు కాని, మీరన్నట్టు అణకువకల వాడై వుండడం ఎంతైన అవసరం."

"కాకపోతే మా యిరువురిగతి యేలాగుంటుందో చెప్పండి?"

"చెప్పడమెందుకు? తెలిసినట్టేవుంది. మరి అమ్మాయి కేలాటి మగడు కావాలో —"

అని పరంధామయ్య లీలగాచూసి అరుంధతివైపు చూచాడు. నును సిగ్గు దొంతర లామె కన్నులలో దోబూచ లాడసాగాయి.

"ఇప్పటికి నాలుగేండ్లనుండి అరుంధతిని మీ రెఱుగుదురు? ఆమె గుణమునకు, సంస్కారానికి తగినవాడై, అనుకూలంగా ఉండగలిగినవాడు కావాలని వేరుగా చెప్పాలా, పరంధామయ్యా?"

"లేదనుకోండి. ఎందుకైనా మంచిదని అడిగా నా ప్రశ్న. తరువాత?"

"తరువాత ఏమిటి? యీ కార్యభారాన్ని మీమీదనే పెడుతున్నాను."

పరంధామయ్య అనుకొన్నంత పని అయింది. అయితే అతడప్పుడు నారాయణరావు సంగతేమి చెప్పలేదు.

"ప్రయత్నిద్దాం లెండి."

"అంత తేలిగ్గా చెప్పడం కాదండి, పరంధామయ్యా! మీరు వెంటనే పనికి పూనుకొని, యిందుకు వలయు భోగట్టా ప్రారంభించాలి. ఈ పని మీరుతప్ప ఇతరులకు వీలులేదు. మీ సామర్థ్యం నాకు తెలుసు—"

అని తన్నంతగా పొగడే శంభుదాసుయొక్క అభిప్రాయ మర్మమె పరంధామయ్య "మీరు నాపై ఉంచిన విశ్వాసానికి కృతజ్ఞుడను. నా పనిగా నెరవేర్ప యత్నిస్తాను" అని నచ్చచెప్పాడు.

# 4

"మీ రెక్కడెక్కడికి పోదలచుకొంటారో అక్కడి కంతా వెళ్ళిరండి. మీకు నచ్చిన యువకుల వివరాలతోబాటు ఫోటోలనుకూడ తేవాలిసుమా."

"సరేలెండి. నా కర్థమయింది. మీకు ఉపయోగడపకపోతే నా బ్రతుకెందుకు? మీరు హాయిగా, సంతోషంగా వుండడమే నాకు కావాల్సింది."

"అదిగదీమాట. మీకు హెచ్చుగా చెప్పాలా?" అని శంభుదాసు బిడ్డనుచూచి "చూడు, అరుంధతి, అయ్యాగారి ఖర్చులకు డబ్బుతెచ్చి యియ్యమ్మా!" అని పురమాయించాడు. "ఎంత?" అన్నట్టామె తనవైపు చూచేటప్పటికి శంభుదాసు నాల్గువ్రేళ్ళు చూపాడు.

నాల్గు పదులేమో అని పరంధామయ్య ఊహిస్తూవుంటే నాల్గు వందలు అరుంధతి చేతినుండి శంభుదాసు చేతిలోకి. అతని చేతినుండి తన చేతికి చక్కా వచ్చేటప్పటికి క్షణమాత్రం పరంధామయ్య తన కన్నులను తానే నమ్మకుండ అత్యంత విస్మయచకితుడై పోయాడు లోలోన.

"పనిలోపని. అయ్యగారు మరియొక కార్యభారాన్ని కూడ మోసుకోవాలి" అనింది ఆ వెంటనే అరుంధతి.

"ఏమిటమ్మా అది?"—పరంధామయ్య ప్రశ్నించిందింకా ఏముందో భుదాసు ప్రశ్నార్థకంగా చూచాడు బిడ్డవైపు.

"నాకు తగిన పిన్నినికూడ వెతకాలి మీరు."

ఆ మాటకు శంభుదాసు పకపక నవ్వి "పిచ్చితల్లీ, నాకెందుకమ్మా పెండ్లి? నీకొక్కదానికైతే నా కదే పదివేలు" అని పరంధామయ్యతో "అప్పుడప్పుడు అమ్మాయి యీలాగా యీ కోరికను వెలిబుచ్చుతూ వుంది. దానికేంలెండి. అంతగా పట్టించుకోదగిన సంగతి కాదు. ఇంతకు నాకెవ్వరండి పిల్లనిస్తారు?"

"అయితే, యిచ్చేవారుంటే మీరూ పెండ్లికి సిద్ధమేకదూ?" అని అడిగాడు పరంధామయ్య నవ్వుతూ. ఒక వింత నవ్వుతో తన సమ్మతిని వెల్లడించాడు శంభుదాసు.

"చూడండి శంభుదాసుగారూ, అమ్మాయి మీ సుఖమెంచి చెప్పే యీ మాట కెంతో అర్థముంది. ఇంతకు మీరేమి అంత ముసలవారన్యూరా విరక్తి చెందడానికి? ఇంకా అంత వయసు మీరిపోలేదేమేకు? మీ జగిబిగిచూస్తే నలభైకి లోపలవారే అనిపిస్తుంది. దేవుడిచ్చిన మహదైశ్వర్యానికితోడు ఇంట్లో మహాలక్ష్మిలాంటి మీ మొదటిభార్య వుండివుంటే మీ రెంతో పుణ్యాత్ములై యుండేవారు. కాని, దైవ మన్యథా తలంచినాడు.

ఋణానుబంధ మాలాగుంది? ఎవరేమి చేయగలరు? ఇదివరకప్పుడే మీరు ద్వితీయ వివాహం చేసుకోవాల్సింది. ఇప్పటికైన మీరిందేమిలేదు. నేను తప్పక అమ్మాయి కోర్కెను నెరవేరుస్తాను."

ప్రథమకళత్రాన్ని తలచుకొని శంభుదాసు, తల్లి జ్ఞాపకానికివచ్చి అరుంధతి కొంత మొగాలు చిన్నబుచ్చుకొన్నారు. కాని, పరంధామయ్య మాటలతో వారి మనసులు వెంటనే చేరికపడేట్టు చేయగలిగాడు.

ఎదురుచూడనిరీతిగా ఇప్పుడు పరంధామయ్య తలమీద నిజముగా మోయలేనంత భార ముంచబడింది. అటు నారాయణరావువలన - ఇటు శంభుదాసువలన! అయినా యీ అవకాశాన్నిబట్టి భార్య కోరిన కాసుల దండ కయ్యే ఖర్చేకాకేమిటి — అంతకు రెండింతలు పడంబడిరాగల అవకాశ మేర్పడడమేకాక, దానికి సూచనగా అప్పుడే చేతిలోకి ఏడు వందలు వచ్చాయి. పరంధామయ్య మనసొకవంక మహదానందముతో చిందులు త్రొక్కుతూ, ఎప్పుడెప్పు డింటికివెళ్ళి మంగమ్మ చెవిలో యీ సంతోషవార్తను వేద్దామా అని ఆతురతపడసాగింది.

బిడ్డకు కావలసిన వరునిగురించి శంభుదాసు. తనకు కావలసిన పిల్లనిగురించి అరుంధతి వివరంగా మాట్లాడారు పరంధామయ్యతో. వ్రేలు చూపితేవాలు హస్తం దిగమ్రింగగల పరంధామయ్య కంతా బోధ పడింది.

నారాయణరావుకూడ తనమీద మోపిన భారాన్నిగురించి చెబుదామా అని అత డొకటిరెండుసార్లు ప్రయత్నించాడు. కాని, అంతలో "ఎందుకైనమంచిది. ఆ సంగతిని వీరి కెఱుకపరచకుండుటే బాగనిపించి ఊరకైనాడు పౌరోహితుడు.

అరుంధతి నౌకరునుపంపి ద్రాక్ష, బత్తాయీలు, యాపిల్సు, రోజాలు, మల్లెలు తెప్పించి, అందులో కొన్ని ఒక చేసంచిలో ఉంచి

పరంధామయ్యా కందిస్తూ "ఇంటికి తీసికెళ్ళండి అమ్మగారి"కనింది. ఈ సంబరమంతాచూచి భార్య ఇంక అనాటినుండి తనమాట కెదురాడదనే ధైర్యంతో పరంధామయ్య లోలోన ఉబ్బిపోయ్యాడు.

మాటల సందర్భములో లైట్లువెలిగించే వేళైంది. "దుర్గయ్యా. చీకటిపడింది. అయ్యగారిని కారులో తీసికెళ్ళి వారి యింటివద్ద దిగ బెట్టిరా" అని శంభుదాసు డ్రైవరుకు చెప్పడంతో అనాటి తన వైభవం తారాస్థాయినందినట్లుభావించాడు పరంధామయ్యా. అరుంధతి వంటవాణ్ణిపిలిచి "శంకరయ్యా, మొన్న బెంగుళూరునుంచి తెచ్చిన కాయగూరల్లో రెండు కోసుగడ్డలు, బీన్సు, ఉర్లగడ్డలు తెచ్చి అయ్యగారికివ్వు"మని చెప్పేసరికి శంభుదాసు "అవునవును. మరచేపోయ్యాను. ఇవ్వమ్మా" అని ఆమాటను సమర్థించాడు. ఏదోవిధంగా పరంధామయ్యను సంతృప్తిపరచి తమ కార్యం పట్ల అత్యంత శ్రద్ధాళువును చెయ్యాలని వారి ఆతురత.

"ఎందుకండీ యివన్నీ, చాలా భారం మోపారు నామీద. అయినా, అన్నిటికీ భగవంతుడున్నాడు." అని ఉపచారవాక్యాలాడుతు కారెక్కాడు పరంధామయ్యా.

"మరి మీరెప్పుడు ప్రారంభిస్తారు మీ ప్రయత్నాన్ని?" అని మరి ఒకమారు ప్రశ్నించింది అరుంధతి.

"ఎల్లుండి త్రయోదశి గురువారం. ప్రయాణానికి మంచిదినం. అందులో 'బుధౌ గురౌ పశ్చిమ కార్యసిద్ధిః' అన్నాడు పడమటికి వెళ్తా నమ్మా, మరి ఒక వారంలోగా 'పునర్దర్శనంచేస్తా'నంటు పరంధామయ్య తండ్రి, బిడ్డలవద్ద సెలవుతీసికొని వెళ్ళిపోయాడు.

"మధ్యాహ్నం పండ్రెండు గంటలప్పుడు వెళ్ళినవా రింతసేపయినా ఎందుకు రాలేదా భర్త?" అని ఆలోచిస్తూ కూర్చున్న మంగమ్మ అత్యంత విస్మితురాలైంది. కారులోనుండి దిగే మగణ్ణిచూచి విజయసూచక మంద

హాసము వెలిసింది పరంధామయ్య ముఖంలో. వెంటనే డ్రైవరు తెచ్చి పెట్టిన పండ్లు, పూలు, కాయగూరలు చూచి మంగమ్మ "ఎక్కడివండీ యివన్నీ? కారెవరిది?" అని ప్రశ్నల్లో తన సంతోషాన్ని, ఆతురతను వెల్లడించింది శంభుదాసుగారిది సరే, లోపలకెళ్ళు. అంతా చెబుతా?" అని డ్రైవరు దుర్గయ్యను పంపివేసి, పరంధామయ్య లోపలి కెళ్ళాను.

అతను మొట్టమొదట భార్య చేతిలో ఏడువందల రూపాయల నోట్లు వుంచి "ఇదో, నీ కాసులదండ కిది దాసుకో"మనేటప్పటి కంత పైకాన్ని చూచి మంగమ్మ తన కన్నులను తానే నమ్మలేకపోయ్యింది.

## 5

మగ డిప్పటి కింత ప్రయోజకు డయ్యాడుకదా అని మంగమ్మ సంతోషముతో ఉక్కిరి బిక్కిరి అయిపొయ్యింది. తనకు కావలసిన కాసుల దండకు ఏడువందలు తెచ్చాడు.

మగణ్ణి అడిగింది రాత్రి వివరమంతా – అతడు చెప్పాడా దినం జరిగిన సంగతంతా. ఇచ్చిన మాటను దక్కించుకొనే దెట్లని లత డొక వంక ఆలోచిస్తూవుంటే, ఆమెకా సంగతేమి కొబట్టలేదు, తన సంబరమే సంబరము. రెండు నెలలుగా లేని ఉత్సాహ మామెలో ఉబికిపొయ్యింది. మొగడిమీద ఎన్నడికి లేని ప్రేమాభిమానాలు పుట్టుకొచ్చాయి. పరంధామయ్య కదే పదివేలు అన్నట్టుంది.

రాత్రి ఒంటిగంట కొట్టినా అతనికి నిద్దుర పట్టలేదు. మంగమ్మ ఆగను నవి నిద్రపోయింది ఆమె సంతోషాన్ని. విచిత్ర ప్రకృతిని తలచి ఒక్కసారి నవ్వుకొన్నాడతడు. తన విచారమేమి కొబట్టలేదామెకు.

ఒక వైపు నారాయణరావు కోర్కె - రెండవ వైపు శంభుదాసు కోర్కె - ఇంకొకవైపు అరుంధతి కోర్కె— మూడు ఆకారాలుదాల్చి ఎదుట నిలచినట్టుంది పరంధామయ్యకు. ఏదో మాటల సందర్భంలో ముగ్గురివద్ద కార్యం నెలవేరుస్తానంటూ ప్రగల్భాలు పలికివచ్చాడు కాని. ఆ పనులను నెరవేర్చడమెట్లో తోచలేదు. చుట్టూ తన్నెవరో ఎగతాళి చేసినట్టుంది. ఆలోచనలలో ఒకటి బాగుంటే మరొకటి బాగుండడంలేదు. ఏమీ పాలుపోకుంది. పెద్దయింటివారి వ్యవహారాలు. వారికన్నివిధాల సంతృప్తి కరంగా ఉండాలి. అతని మానసవిహంగం తనకు తెలిసిన చోట్లకల్లా ఎగిరిపోతూంది తగిన సంబంధాలు వెదకడానికి....భూమ్యాకాశాలంతా తిరిగి వస్తూంది.....కాని, ఏదీ సరిపడలేదు.

ఒకవేళ ఉదయమే వెళ్ళి తనకీ పనిచేతకాదని చెప్పితే! చెప్పవచ్చు కాని, ఇప్పుడేలాటి ప్రయత్నముచేయక - ఏవూరికి పోక .... తీసుకొన్న ఏాను వందలకు తగిన ప్రతిఫలమైనా చూపకుండ, తన అశక్తతను చాటు కోవడం చాలా చిన్నతనమే కాక, తన కింక వారినుండి పైసాకూడా రాదను కొన్నాడంతలో. అప్పుడింక కాసులదండగతి ఏమి? తనగతి యేమి?

అంతటితో అతనిలోని నిరుత్సాహము అడుగంటిపోయింది. ఎట్లో సాధించాలని దృఢసంకల్పం చేసుకున్నాడు. ఆలోచనలతో బుర్ర వేడెక్కి నిద్రపట్టే అవకాశం కనిపించలేదు. రెండు మూడు మార్లు చల్లగాలికొరకు పెరట్లోకి వెళ్ళివచ్చాడు.

ఇంక తెల్లవారేందు కెంతో ప్రొద్దులేదు. ఉన్నదున్నట్టు పరంధామయ్య మస్తిష్కంలో ఒక విచిత్రమైన ఆలోచన మెరుపువలె మెరసింది.... బోధి వృక్షంక్రింద సిద్ధార్థుడు బుద్ధుడైనట్టుంది అతనిస్థితి.

శంభుదాసుకు ఒక భార్య కావాలి.... నారాయణరావును ఒప్పించి ప్రసన్న నాతనికిప్పిస్తే!....

నారాయణరావు కొడుకు రామమోహనునికి అరుంధతిని చేసుకొంటే!

బలే ఆలోచనలు తోచినాయి పరంధామయ్యకు. ఇవే నెరవేరాయంటే ఒక్క మాటతో మూడు పనులు నెరవేరుతాయి. ఒక్క దెబ్బకు మూడు పండ్లు రాలినట్టు! ఊహించేకొలది తన ఆలోచనలు చాలా సమంజసంగాను, ఆచరణసాధ్యంగాను తోచసాగాయి అతనికి. నారాయణరావు ప్రసన్నను శంభుదాసున కిచ్చేందుకు సమ్మతించినట్టయితే అంతా జయప్రదంగా నెరవేరినట్టే! అరుందతిని రామమోహనునకు చేసికొనుటలో నారాయణరావున కెట్టి అభ్యంతరము ఉండదనే చెప్పవచ్చు.... ఇక అంతకంటె అనుకూలమైన జంట వుండదు.

శంభుదాసు కరుంధతి ఒక్కటే కూతురు. రామమోహను డామెను చేసికొంటె, ఆమెతోబాటు ఆస్తి కూడ చేజిక్కగలదు. ఇక ప్రసన్నను శంభుదాసు చేసుకొంటే వారిద్దరికి మిగిలిన సగం ఆస్తి వుంటుంది. అప్పుడు నారాయణరావు ఆమెకు పిత్రార్జితంలో ఏ కొంతో యిచ్చి మిగిలినది తానే వుంచుకోవచ్చు. అతని ఆస్తి త్రివేణీసంగమంవలె అపారమై పోగలదు. నారాయణరావుకీ ఆలోచన చక్కగా తలకెక్కించ గలిగితే తన అదృష్టం పండినట్లే అని తలంచాడు పరంధామయ్య. నారాయణరావు నైజము అతనికి బాగా తెలుసు. అతి దురాశాపరుడుగా నారాయణరావు ఉన్నది చాలక యింకా ఎంతవచ్చినా వద్దనేవాడు కాడతడు. పైగా డబ్బొస్తుందంటే ఎంతలేసి పనికైన సిద్ధపడతాడు. అతడు పట్టుబట్టితే అతని నా మార్గంనుండి తప్పించడం పుట్టించిన బ్రహ్మతరంకాదు.

అసలే దురాశాపరుడైన నారాయణరావు కిప్పుడు తన పథకంలోని అంతరార్థం తలకెక్కేట్టు పరంధామయ్య చేయగలిగాడా ఇంక అతని ఆలోచనకు తిరుగుండదు, సమయంచూచి ఎలాగైనా నారాయణరావు ప్రసన్నా శంభుదాసుల వివాహానికి అంగీకరించేటట్టు చేయాలని అతడు కృతనిశ్చయుడయ్యాడు. అందువల్ల తన కెంతో ప్రాయిదావుంది.

ఈలాటి ఆలోచనా పరంపరలతో సతమతమయ్యే పరంధామయ్యకు కన్ను పొడుచుకున్నా నిద్రపట్టిందికాదు. ఒక ప్రక్క సమస్యాపరిష్కార మార్గం గోచరించిందనే సంతోషం.... ఇంకొక్క ప్రక్క సంశయపరంపర-రెండుచేరి అతని తలను ఆలోచనలతో నింపివేశాయి

తన కూతురుని రామమోహనునకిచ్చి, ఆతని చెల్లెలిని తాను చేసుకొనే విషయంలో శంభుదాసు పరమానందభరితుడౌతాడని పరంధామయ్య ఊహించాడు. అల్లుడు ఇల్లరికముండకపోయినా ఉన్నవూరిలోనే ఉంటాడు కాబట్టి శంభుదాసు కిందులో అభ్యంతరమేమి ఉండదు. ఇక ప్రసన్న ఆతనిని చేసుకొనేట్టుచేయాలి. అక్కడే వుండేది చిక్కంతా. నవయౌవ్వనారంభములో ఉండే రంభలాంటి ప్రసన్న వయసుమళ్లిన శంభుదాసుని వివాహమాడటానికి సమ్మతించదని పరంధామయ్యకు మాత్రం తెలియదనా? అయినా, నారాయణరావుకు తన ఉపాయం నచ్చిందా, నిర్బంధగానైన ఆమెను శంభుదాసు కంటగడతాడని అతని ధైర్యం.

నారాయణరావైనా ప్రారంభంలో కొంత తటపటాయిస్తాడని పరంధామయ్యకు తెలుసు. ఆతనిని లోగొనేందుకు తగిన సమ్మోహనాస్త్రాలను వెదకుతున్నా డప్పుడే. తన రొట్టె నేతిలోపడ్డట్టే ఆనందింపసాగా డతడు. వెంటనే భార్యను లేపి "మంగా, నీకు ఒక కాసుల దండేమిటి? నిలువాభరణాలను ధరించే అవకాశం లభించింది. చూడు నా తడాకా" అని చెబుదామని ఉత్సాహపడ్డాడు కాని, అంతలో ఆతురపడరాదు. అందులో ఆడవాని దగ్గర రహస్యం దాగదు. ఇప్పుడప్పుడే నా ఆలోచనలను బహిరంగపరచానంటే అంతా చెడిపోవచ్చును. ఈ సంగతి నారాయణరావుకంటె ముందుగా ఎవ్వరికీ తెలియకూడదు" అని తన్ను తాను హెచ్చరించుకొన్నాడు.

తెల్లవారింది. భర్త సంగతి తనకేమీ పటనట్లు మంగమ్మ హాయిగా నిద్రపోయి లేచింది. రాత్రంతా కాసులదండ ధరించి యిరుగుపొరుగువారి

యెదుట సగర్వంగా సంచరించినట్లు మధుర స్వప్నాలు చూసింది కాబోలు ముఖముమీద చిరునవ్వు తాండవిస్తూవుంది. ఆమె సంతోష మామెది.... పరంధామయ్య సంతోషించాడు భార్య ప్రశాంతవదనాన్ని చూచి.

ఆవేళ ఏదో స్పెషల్ అయిటం తయారుచేస్తానన్నది మంగమ్మ తానైతను. "సరే, మంచిది" అని పరంధామయ్య "చూడు, భోజనాలయ్యాక నేను బళ్ళారికి వెళ్ళవలసివుంది. బహుశ రేపు యింటికి రానేమో. త్వరగా వంటకావాలి సుమా" అని పురమాయించా డామెను.

బళ్ళారిలో పరంధామయ్యకు పనేమిలేదు. తనకు తోచిన ఆలోచన లను గూర్చి ప్రశాంతమైన ఒకచోట ఒక దినమంతా హాయిని చక్కగా ఆలోచించి, తన కది నచ్చితే తరువాత నారాయణరావు బుర్రలో దానిని ప్రవేశపెట్టాలని అతని నిశ్చయము. అందుకని అతడు బళ్ళారికిపొయ్యే నెపముతో దగ్గరగా వుండే మంత్రాలయ మహాస్థలానికి వెళ్ళాలని తలంచాడు.

మగడు కోరినట్లే మంగమ్మ త్వరత్వరగా వంటచేసింది. సుష్టుగా ఆ పూట భోంచేసి పరంధామయ్య ఇంటివద్ద భద్రమని భార్యను హెచ్చరించి బస్సుకు ప్రయాణమై వెడుతూ "మంగా, ఒకవేళ నారాయణరావుగారు కాని, శంభుదాసుకాని నాకై కబురంపితే బళ్ళారికి వెళ్ళానని చెప్పు" అని చెప్పా డతడు.

# 6

ఇప్పటికి సుమారు మూడు వందల ఏండ్ల క్రిందట మహానుభావుడైన శ్రీ రాఘవేంద్రస్వామి సజీవసమాధియైన పుణ్యస్థలం మంత్రాలయము.

అది ఆదోని పట్టణానికి ముప్పైమైళ్ళ దూరాన తుంగభద్రానదిగట్టున కలదు. భక్తాదుల పరామర్శచే, చక్కని విశాలమైన భవనాలు, సత్రాలు

తపూరమ్యాయి అచ్చట. మధుర జలోపూరితమైన తుంగభద్ర ఆ స్థలము యొక్క ప్రకృతి రమణీయకానికి వన్నెలెత్తుతూవుంది. యాత్రికుల సౌకర్యార్థమై అనుకూలమైన సత్రపుగదులున్నాయి. వచ్చిన వారందరికీ ఒక పూట తృప్తిగా స్వామివారి ప్రసాదం లభిస్తుంది.

ప్రహ్లాదుని యపరావతారమని ప్రసిద్ధిచెందిన శ్రీ రాఘవేంద్రుని కృపాకటాక్షమునుకోరి భక్తులు వందలకొలది ప్రతి దినము అచ్చటికివచ్చి స్వామివారి సమాధిని దర్శించి (బృందావనము) ధన్యులగుచుందురు. వెనుక మన్రో ప్రభువునకు శ్రీ రాఘవేంద్రుడు ప్రత్యక్ష దర్శన మిచ్చాడని వార్త.

పరంధామయ్య మంత్రాలయానికి వెళ్ళడమిది నాల్గువసారి. ఎప్పుడే మానసి కాందోళన కలిగినా అత డక్కడికి వెళ్ళి ఒకటి, రెండు దినము లుండి వస్తుంటాడు. ఆ రీతిగానే ఇప్పుడు కూడ వెళ్ళాడతడు. ఉదయం సాయంకాలం తుంగభద్రాతీరంలో కూర్చుని, ఆ నదిపై నుండి వచ్చే చల్లని గాలితో తలలోని వేడిమిని తగ్గించుకొంటూ, తన ఆలోచనలకు తుది రూప మియ్యాలని తలంచాడు.

భర్త ఊరికి వెళ్ళాక మంగమ్మకు పొద్దుగడవడం కష్టమనిపించింది. భోజనాలయ్యాక కొంతసేపు బాగా గుర్రుపెట్టి నిద్రించిలేచి, కాఫీ కాచుకొని తాగింది. అప్పటి కింకా రెండు గంటలు దాటలేదు. సాయంకాల మవ్వేందు కింకా చాలాసేపుంది. పొరుగింట్లకైన ఉబుసుపోకకు వెడదా మని తలంచి, వెళ్ళేలోగా, వీధిగుమ్మం దగ్గర ఒక వ్యాపారి ఒక చిన్న అద్దాలపెట్టెలో అందమైన అనేక రకాల సొమ్ముల నమర్చుకొని వచ్చి నిల బడి "సొమ్ములండీ సొమ్ములు — బలే చౌకైన సొమ్ములు" అని కేక వేశాడు.

సొమ్ముల పేరు వింటేచాలు మంగమ్మకు పిచ్చెత్తిపోతుంది వాటి మీద ఆమె కంత మోజు.

ఆమె వెంటనే "అబ్బీ - యీలారా" అని వాణ్ణి లోపలికి పిలిచింది. పెట్టెతీసి అతడు ఒక్కొక్క సొమ్ముతీసి చూపుతూవుంటే మంగమ్మ కండ్లు జిగేలుమన్నాయి. అందులో రవల నెక్లెసులు, రవల గాజులు, దుద్దులు, దండలు అనేక రకాలున్నాయి. ఎంతో ముచ్చటగ ఉంది పనితనమంతా. ఆడువారు సామాన్యంగా కోరే నగల రకాలన్నీ ఉన్నాయి అతనివద్ద.

అన్నిటికంటె ఎక్కువగ మంగమ్మ దృష్టి నాకర్షించింది ఒక కాసులదండ. బలేఅందంగా కనబడిం దామెకంటికది. అలాంటి నగ కొరకే తానిన్నాళ్ళు తహతహలాడిపోతూంది. పొన్నమ్మ కాసులదండ కంటే దీని పనితనము చాలా నాజూకనిపించిం దామెకు.

ఉన్నదున్నట్టు మంగమ్మ కొక చిత్రమైన ఆలోచన తోచింది. తానా నగను కొంటే!.... కొనాలని నిశ్చయించుకొంది.

మనసులో ఒకమారు తెలిసినవారి నెవరినైన పిలచి నగయొక్క నాణ్యాన్ని గురించి విచారిద్దా మనిపించింది. కాని, అంతలోనే, ఇతరు లెవ రైన తనతో పోటీపడి వారే కొనేస్తారేమో అని జంకి, ఎవరిని పిలువదలచు కోకుండా తానే కాసులదండను కొనదలచి "దీని వెల ఎంత?" అని అడిగింది.

ఏ కాసుల దండకయితే తా నిన్నాళ్ళు కలవరించి, కళవళించి, మగ నిని కలతపరచినదో ఆ కాసులదండ యీ దినం కన్నులబడేటప్పటికి మంగమ్మ బొత్తిగా వివేక శూన్య అయిపోయింది. ఎవ్వరికి చెప్పకుండ, దాన్ని తానే కొనేసి, మెడలో ధరించి అందరి యెదుట - ముఖ్యంగా రేపు భర్త యింటికి రాగానే – ప్రత్యక్షమైతే ఎంత బాగుంటుందనిపించిందా అమాయకురాలికి.

వ్యాపారి సూక్ష్మగ్రాహి.... కనిపెట్టాడామె సంబరాన్ని ఆలాంటి

అమాయకులైనవారే కావలసిం దట్టినగలు కొనడానికి. "దీని వెల మూడు వందలమ్మా" అన్నాడు.

మంగమ్మ తన చెవులను తానే నమ్మలేకపోయింది. కాసులదండ అంటే ఏ రెండువేలో అవుతుందని భర్త అంటూవుంటే, ఇప్పుడది మూడు వందలకే లభించేట్టుంది!

విపరీతమైన ఆశ్చర్య సంతోషాలమధ్య ఆమెకణుమాత్రమైన లోక జ్ఞానము లేకపోయింది. రేపు భర్త వచ్చేవేళకు దండను ధరించి "చూడండి, మీరు రెండువేలు కావాలని పలవరిస్తూవుంటే కాసులదండను నేను మూడు వందలకే కొనేశాను" అని తన ప్రాగల్భ్యాన్ని ప్రకటించాలని మనసు పరవళ్ళు త్రొక్కింది.

ఆమె మనస్తత్వాన్ని బాగా గ్రహించిన వ్యాపారి దండను పొగ డుతూ ఒక దండకం చదివేశాడు. మంగమ్మ నిశ్చయించుకొంది దాన్ని కొనేయాలని.

తనవద్ద భర్త యిచ్చిన ఏడువందల రూపాయలున్నాయి. సమయా నికి డబ్బునిచ్చి భగవంతుడు నగను తనకొరకే పంపాడనుకొని మురిసి పోయ్యింది. తన అదృష్టాన్ని లోలోన మెచ్చుకుంటూ, మూడు వందల రూపాయల నోట్లుతెచ్చి వానిచేతిలోపెట్టి, కాసులదండను తీసికొంది మంగమ్మ.

తాను చెప్పిన బేరానికే నగ అమ్ముడుపోయే సరికి వ్యాపారి తన అదృష్టాన్ని పొగడుకొంటూ వీధిలోపడి క్షణములో ఏ సందులోనోదూరి అదృశ్యుడైపోయాడు.

మంగమ్మ కాసులదండను ధరించి, అద్దము ముందొకసారి నిలబడి చూచుకొని బ్రహ్మానందపరవశురాలైంది.

* * *

రాఘవేంద్రస్వామి తన ఆలోచనలను సమర్థించాడో లేదో కాని అంతా సవ్యంగానేతోచింది పరంధామయ్యకు మంత్రాలయంలో. సంతృప్తితో యింటికి తిరిగి వచ్చాడతడా మరుదినం సాయంకాలము. అద్భుతంగా తోచిన తన ఆలోచనల కతడు తన్ను తానే అభినందించుకొన్నాడు. తనకు కాక పోతే మరెవ్వరికైనా ఆలాంటి అమోఘమైన ఆలోచనతోచి ఉండేదా అని అతని ధీమా....

ఏమైతేనేమి, విజయసూచక మందహాసముతో రిక్షాదిగి యింటిలోకి వస్తుండే మగని కెదురుగ క్రొత్త కాసులదండ ధరించి, అంతకంటె విజయం సాధించిన దానివలె, హర్షప్రఫుల్ల ముఖియై మంగమ్మ ఎదురొచ్చింది భర్త నాహ్వానించడానికి.

ఆమె మెడలో స్పష్టంగా కనపడుతూనేవుంది కాసులదండ. కాని, ఆలోచనా నిమగ్నుడై చిందులుతొక్కుతూవుండే పరంధామయ్య దృష్టినది ఆకర్షించలేదు. ఒక వేళ ఆకర్షించినా అతడు "ఎక్కడిది?" అని ప్రశ్నించ లేదు. తప్పకుండా చూచీచూడడంతోటే కాసులదండను మెచ్చుకొని, దానితోబాటు తన తెలివితేటలను కూడ మగడు మెచ్చుకుంటాడని తలంచిన మంగమ్మకు కొంత నిరాశకలిగింది మొదట,

కాని, ఆమె ఆతనినంత తేలిగ్గా వదల్లేదు. "ఏమండీ, యిలా ఒక మారు చూడండి నావైపు" అని అతని దృష్టి నాకర్షించింది మంగమ్మ అదో మాదిరి పోజుపెట్టి మగణ్ణిచూస్తూ. పరంధామయ్య చూచాడు దండను. ఆశ్చర్యంతో "అదెవరిదే దండ?" అని ప్రశ్నించాడు,

"ఎవరిదేమిటి కర్మ. మనదే."

"కాదులే – పొన్నమ్మ యిచ్చివుంటుంది కొన్నాళ్ళు పెట్టుకోమని"

"కాదండీ – అక్షరాల మందేనండి."

"అంటే!"

"చెప్పనా?"

"చెప్పు చూద్దాం."

"నా కాసుల దండ కెంతవుతుందన్నారిందాక?"

"సుమారు రెండు వేలు."

"ఏడిచినట్టుంది మీ మగాళ్ళ తెలివి. ఒక వేళ నే సంతకంటె తక్కువ వెలకు దండ తెచ్చుకొని ఉంటే మిగతా డబ్బుకు వేరే నగలు తెచ్చిపెడతారా?"

"ఏమో, నీ మాట అయోమయంగా వుంది! చెప్పరామా, ఇదెక్కడిదో"

"చెప్తానుగా, ఎందుకంత ఆతురత?"

"సరే, చెప్పు."

"మొదట నా ప్రశ్నకు బదులు చెప్పండి. క్రొత్త నగలు చేయిస్తారా?"

"ఇదివరకే చెప్పానుగా నీ నగలకు రెండు వేలు ఖర్చు చేస్తానని"

"మంచిది. దీన్ని నిన్న కొన్నాను."

"ఎవరిదగ్గర?"

"ఎవడో నగల వ్యాపారి ఎన్ని నగలు తెచ్చాడనుకొన్నారు! ఎంత బాగుండేవన్ని! అందులో కాసుల దండ నాకు నచ్చింది."

అంటూవుండగానే పరంధామయ్య కెందుకో గుండె దడదడలాడింది. ఎవడైన దొంగ వెధవ దొంగ సొత్తు నమ్మిపొయ్యాడనో లేక ఎవడో గిల్టు నగనిచ్చి మోసం చేసి పొయ్యాడనో, అతనికి అనుమానం కలిగి "డబ్బెంత యిచ్చావ్?" అని అడిగాడు.

లీలగా నవ్వుతూ మంగమ్మ "మూడు వందలు" అనేసింది.

పరంధామయ్య నిలువున నీరై పోయ్యాడామాట విని. అతని కెందుకో రెండవ అనుమానం స్థిరపడిపోయినట్టయింది.

"ఏదీ, యిలాతే చూద్దాం."

మంగమ్మ దండను తీసి అతని చేతిలో పెట్టింది. ఇంకేముంది? ... అది బెండువలె తేలిగ్గా వుండడం గమనించి పరంధామయ్య నెత్తి బాదుకొని "అయ్యో, మంగ! నీ పాడు బుద్ధి పోనిచ్చావు కాదుకదే? కొంప ముంచావు ఎవడో దొంగ వెధవ నీకు బాగా టోపీ వేసి పోయాడు" అని పెదవి విరిచాడు.

మంగమ్మకు మిన్ను విరిగి మీద పడ్డట్టయింది. "ఏమండీ, నేనేమి చేశానండీ?" అని కన్నులింత చేసుకొని ప్రశ్నించింది.

"ఇంకేముంది.... ఇది గిల్టుసొమ్ము, బంగారు కాదు గింగారు కాదు ముప్పై రూపాయలయినా చేయని ఈ పాడు వస్తువుకు మూడు వందలు తగలేశావు. ఇదేమి వంకాయల బేరమనుకొన్నావా యింత బుద్ధిహీనంగా పనిచేశావు? నేనూళ్ళో లేనప్పుడే ఆ శని నీకు దాపరించాడా? లేకలేక చేతికొచ్చిన డబ్బు నింత తేలిగ్గా పారవేశావే నిన్నేమనాలి. మరి ఎక్కడ నుండి తెమ్మన్నావు మూడు వందలు? కాసులదండ అడిగావు కదా, ఏదో ఒక రీతిగా మంచి నగను తెచ్చిద్దామని నేను విశ్వప్రయత్నం చేస్తుంటే కడకు నీవీ పిచ్చిపనిచేసి డబ్బంతా పాడుచేస్తే నే నింకేమి తెచ్చేది.... నా తల" అని పరంధామయ్య చేతిలోని దండ నావలికి విసరివేసి తల పట్టుకొని కూచున్నాడు.

ఇదంతా విన్నాక మంగమ్మ తన తెలివి తక్కువకు ఏడుస్తూ ఒక మూల్లో కూచొని తల బాదుకోసాగింది.

పరంధామయ్య అన్నట్టు అదొక గిల్టు నగ. పట్టుమని పది రూపా

యలైన వెల చేసునో లేదో. అతడన్నట్టు మంగమ్మ తెలివితక్కువ తనాన్ని ఎవడో దొంగ వెధవ బాగా గుర్తించి టోపి వేసి పారిపోయాడు.

నగను కొని యిరువదినాల్గు గంటలు దాటిపోయింది. ఆ వ్యాపారి ఎవడో ఎక్కడుంటాడో వెతకడం వృధాయని, అంత దగా చేసి ఒక గిల్టు సొమ్ముకు మూడొందలు కొట్టేసిన వెధవ యింకా వూళ్ళో ఉండటం అసంభవమని, ఎవరితో చెప్పుకున్నా సిగ్గు చేటని, పరంధామయ్య యింకేమి చేయడానికి తోచక తన దురదృష్టాన్ని నిందించుకొంటూ అప్పటికి తన ఊహాలోకము నుండి వాస్తవిక లోకానికి జారిపడ్డాడు.

అప్పటి నుండి నగల సంగతి ఎత్తడానికే భయపడసాగింది మంగమ్మ.

# 7

సోమవారం సాయంత్రం నారాయణరావు టౌన్‌హాలులోజరిగేఎలెక్షన్ మీటింగుకు వెళ్ళిపోయాడు, వెంట వరదరాజు. నౌకరు ఒకడు వెళ్ళాడు. ఇంటిలోఉన్న ముగ్గురిలో ఒకడైన సుబ్బన్న తోటమాలి తోటపనిలో ఉండగా, తక్కిన యిద్దరు శ్యామసుందరిచేత బజారుకు పంపబడ్డారు.

ఛేర్మెన్‌గారి మేడ చాల గొప్పదే కాక కేవలం ఆధునికి పద్ధతిలో బహు రమ్యంగా కట్టబడింది. లోపలికెళ్ళి చూస్తే రాజ సౌధాల్లో యేలాంటి వస్తు సామగ్రి, అలంకరణాలుంటాయో ఆలాంటి వన్నీ గోచరిస్తాయి కన్నుల పండువుగ. విశాలమైన వరండాలు, గాలి వెలుతురు ధారాళముగ వచ్చు గదులు, మనోహరమైన కృతిమాలంకారాలు, దేనికవి యెంతో ముచ్చటగా ఉంటాయి చూడ్డానికి.

ఇంటి నొక్కమారు చూస్తే చాలును ఇంటివారి దర్జా బోధపడు తుంది. వారి అభిరుచులు వైభవాలు అట్టే అర్థమై పోతాయి ఏ వస్తువు నెక్కడుంచాలో, ఎట్లుంచాలో, అలా ఉంచుతూ, ఎక్కడ నే విధమైన కళ్మలం లేకుండ చేసి, తోటను, యింటిని సర్వకాల సర్వావస్థల్లో పరిశుభ్రమైన అద్దం వలె ఉంచడానికని ప్రత్యేకంగా ఒక ఉద్యోగి వున్నా డాయింట్లో. అతని పేరు రాంబాబు.

ఇంటికి రెండు కాంపౌండ్లున్నాయి. మొదటి గేటు వద్ద ఇద్దరు ఘూర్కాలుంటారు, మొదటి కాంపౌండులో నౌకర్ల యిండ్లు, కారు షెడ్డు పశువుల షెడ్లు వున్నాయి. రెండవ గేటు వద్ద మరల యిద్దరు ఘూర్కాలు ఆ గేటులోనికి క్రొత్తవారిని వారు సాధారణంగా పోనియ్యరు. తెలిసినవారు తప్ప యితరులెవ్వరైన వెళ్ళాలంటే యింటివారి వుత్తరువు కావాలి. లోదేళ్ళవంటి రెండు టైగర్ జాతి కుక్కలెప్పుడు అప్రమత్తతతో లోపల తిరుగాడు తుంటాయి. షుమారు నాలుగెకరాలుండే ఆ ప్రహరీ గోడల మధ్య చంద్ర బింబము వలె మెరసిపోతూ వుంటుందా చక్కని మేడ.

మసక చీకటి వ్యాపిస్తూ వుంటే రాంబాబు లైట్లన్ని వెలిగించి, యజమానురాలు నడిగి యింటికి వెళ్ళిపోయాడు.

తూర్పువైపు వరాండాలో సోఫాలో జానకీరాణి శ్యామసుందరి ప్రసన్న ఏదో మాట్లాడు కొంటున్నారు. దగ్గర బల్లమీద అప్పుడే వంట మనిషి మాణిక్యం తెచ్చిపెట్టిన కప్పులోని కాఫీ పొగ చిమ్ముతూ సువాసన గుభాళిస్తోంది. అమ్మగారిద్దరు కాఫీ త్రాగుతుంటే తోటమాలి సుబ్బన్న అప్పుడే వికసించిన రెండు తెల్ల గులాబీలు తెచ్చి ముందుంచాడు. ఒకదాన్ని తన కొప్పులో నుంచుకొని ప్రసన్న రెండవ దాన్ని తల్లి జడలో తురిమింది. 'రాబిన్' వారి కల్లంత దూరంలో పడుకొని, తన సహజమైన జాగ్రత్తతో చుట్టు చూస్తూ వుంది.

అంతలో శ్యామసుందరి ఎందుకో లోపలికెళ్ళిపోతే, ప్రసన్న దగ్గర వున్న ఆ వారం 'ఆంధ్రప్రభ' పుటలు తిరగవేస్తూ కుర్చోంది. పది నిమిషాలు గడచిందో లేదో.... అంతలోనే లోపలి నుండి శ్యామసుందరి "అయ్యో-తేలు కుట్టిందర్రా" అని గావుకేక వేసింది. గాభరాతో ప్రసన్న "ఏమిటమ్మా" అంటూలోపలికి పరిగెత్తిపోయింది. మాణిక్యం వంటింట్లోంచి, తోటలో నుంచి సుబ్బన్న యజమానురాలి అరపు విని వచ్చారు.

శ్యామసుందరి "అమ్మా-తేలు కుట్టిందే" అని కుడికాలు పట్టుకొని ఏడుస్తూంది. సుబ్బన్న అంతా వెదకి, తేలును కనిపెట్టి దాన్ని చంపివేశాడు. అది నల్లజాతి గ్రుడ్డ తేలు. దాని కథ అంతటితో ముగిసింది.

"అబ్బా! ఏనాడూ లేని తేలు నాడెక్కడినుంచి వచ్చిందమ్మా యీ యింట్లోకి!" అని మాణిక్యం తనకు తెలిసిన తాత్కాలిక చికిత్సలు కొన్ని చేయసాగింది. ప్రసన్న కేమీ చేయడానికి తోచింది కాదు. తల్లి దుఃఖాన్ని చూచి తాను ఏడుపు మొదలెట్టింది.

శ్యామసుందరి నెప్పుడు తేలు కుట్టిందికాదు. ఆ బాధ ననుభవించలేక పసిబిడ్డవలె బావురు మంటూంది. మాణిక్యం చికిత్సలేవీ పనిచేయ లేదు. ప్రసన్న తల్లి బాధను చూచి ఓర్వలేక "అయ్యో, సమయానికి నాన్నగారు కూడా యింటో లేరే!" అని కన్నీరు కారుస్తూ "ఒరే, సుబ్బన్నా, నీవైన శీఘ్రంగా సైకిల్ మీద వెళ్ళి మన డాక్టర్ రంగనాథాన్ని పిలుచుకొని రా బాబ్బు" ని పంపింది. మాణిక్యం కూడా సుబ్బన్నను వేగిర పరచింది. సుబ్బన్న సైకిల్ మీద వెళ్ళిపోయాడు.

ఎన్ని ఉపచారాలు చేసిన శ్యామసుందరి బాధ తగ్గలేదు. అది నడుము వరకు వ్యాపించి, కుడి తొడను పగుల గొట్టినట్లుంది. ఆమె పాపము నానా అవస్థలు పడుతూంది.

వరండాలో నుండి హాలులోకి వచ్చేటప్పుడే గడప దగ్గర కుట్టిందా తేలు. అది అంత శుభ్రమైన యింటిలో కెలా గొచ్చిందో పైవానికెరుక. ఆ బాధ పడాల్సిన వంతుండ బట్టి ఆమె కొరకే బ్రహ్మదేవుడు దాని నా క్షణంలో సృష్టించి అక్కడ పారేశాడేమో అనిపించింది వారికి.

మాణిక్యం తనకేదో మూలిక తెలుసునని, దాని పసరు పిండితే తేలు కుట్టిన నొప్పి తక్షణం హరింపబడుతుందని, దాని కొరకు తోటలోకి వెళ్ళి అంతా వెదకింది. ఆమెకు కావలసిన ఆ మూలిక దొరకలేదు. "ఏమి ప్రయోజనం యింత తోట వుండి? ఈలాంటప్పుడు పనికి వచ్చే చెట్టులేదు దాన్ని ఎక్కడున్నా రేపే తెప్పించి తోటలో నాటించాలమ్మా" అంటూ తిరిగి వచ్చి భవిష్యద్రక్షణోపాయాన్ని సూచించింది.

"ముందు సంగతి దేవు డెరుగు. ఎప్పుడైనా యీ యింట్లో తేళ్ల పాములు కాన్పించాయా? దప్పికైనప్పుడు బావిని త్రవ్వలేదే అని ఏప్పి నట్లుంది నీ సలహా. ఇప్పుడేమి చేయాలో ఆలోచించరాదా?" అని ప్రసన్న తల్లి దురవస్థను చూచి, అస్తవ్యస్తమైన బుద్ధితో కసిరింది మాణిక్యాన్ని "సుబ్బన్న డాక్టర్ కొరకు వెళ్ళాడు కదమ్మా. ఇప్పుడే వస్తాడు. మనమేం చేయగలం చెప్పండి? అమ్మగారీవేళ ప్రొద్దున్నే ఎవరి మొగం చూచారో". అని మాణిక్యం ఊరడిస్తూంటే, సుబ్బన్న హడావుడిగా వచ్చాడు....

"డాక్టరేడీ, సుబ్బన్నా?" అని ఆతురంగా అడిగింది ప్రసన్న.

"మన డాక్టర్ బాబు యింటో లేరండి. మీటింగుకు వెళ్ళారంట." అని చేతులు పిసుక్కో సాగాడు సుబ్బన్న.

"ఏడిశావులే, మరొక డాక్టర్నయినా తెచ్చావా?" అని కసిరింది శ్యామసుందరి అంత బాధలో కోపం చూపుతూ.

"తెచ్చానండమ్మా. బయట వున్నారు"

"బయట ఎందుకుంచావు? ఇంకా పర్మిషన్ కావాలా? తక్షణం పిలుచుకొని రా పో" అన్నది ప్రసన్న.

సుబ్బన్న చర చర వెళ్ళి తాను పిలుచుకొని వచ్చిన డాక్టరీతో తిరిగి వచ్చాడు రెండు నిమిషాల్లో.

"రండి బాబూ, అమ్మగారిని తేలు కుట్టింది. ఆమె కెప్పుడు యీ లాంటి దురవస్థ కలిగింది కాదు. ఈ వేళ పెద్ద గ్రహచారం వచ్చిపడిందండీ అని మాణిక్యం డాక్టర్ విజయ కుమారుని ఆహ్వానించింది."

తానెప్పుడు వారింటికి రానందువల్ల, ఇంటిలో మగవా రెవ్వరు లేనందుచేత (సుబ్బన్న మగవాడైనా నౌకరుకదా), డాక్టర్ సంకోచిస్తూ అడుగువేయడంచూచి, మాణిక్యం పరవాలేదు, రండిబాబు. చూడండి" అని శ్యామసుందరి కుడిపాదంమీద తేలుకుట్టిన భాగం చూపింది.

"ఎంతసేపైనదండీ తేలుకుట్టి?" అని అడిగాడతడు.

"ఇరవై నిమిషాలై వుంటుంది, బాబూ" అన్నది మాణిక్యం.

శ్యామసుందరి బాధతో కుంచించుకొనిపోతూ ఏమి మాట్లాడలేని స్థితిలో వుంది. ప్రసన్న తల్లి నానుకొని నిలబడింది. డాక్టరును ఎగా దిగ చూస్తూ అతడేమిచేస్తాడో చూడాలను కుతూహలంతో మాణిక్యం తేలు కుట్టిన స్థలాన్ని వ్రేలితో చూపింది. వాచి, ఎర్రగా ఉన్న ఆస్థలాన్ని పరీక్షించాడు డాక్టర్. వెంటనే తన 'కిట్టులోనుండి ఒక మందుసీసా తీసి ఇన్‌జెక్షన్ ట్యూబు కెక్కించాడు.

తన్నింక సూదితో గ్రుచ్చుతాడని శ్యామసుందరి, ఎన్నడు సూది పోటు సుఖ మెరుగనిది కాబట్టి, "ఉండే బాధకాక యిదొక బాధా" అని మూలిగింది. ఆ మాటకు డాక్టర్ మందహాసంచేసి "దీనివల్ల మీ కేమి బాధ వుండదమ్మా: ఇప్పుడే అంతా మేలౌతుంది" అని తేలుకుట్టినచోట ఇన్‌జెక్షన్ యిచ్చాడు.

ఒక్క నిమిష మూరకుండి అతడు "ఇప్పు డెట్లున్నదమ్మా ?" అని అడిగాడు శ్యామసుందరిని.

"ఏదో కొద్దిగా తగ్గుతూన్నట్లుంది."

మరియొక నిమిషం తరువాత "ఇప్పుడు ?" అన్నా డతడు.

"తగ్గిపోతూంది. అబ్బా, కాలప్పుడే ఎంత తేలికైందే, మాణిక్యం."

శ్యామసుందరి ముఖంమీది శోకచిహ్నాలుపోయి, సంతోషచిహ్నాలు కనబడుతూవుంటే ప్రసన్నముఖంకూడ హర్షప్రపుల్లమైంది. మాణిక్యం చేతులెత్తి డాక్టరుకుమ్రొక్కి "దేవుడిలా వచ్చారండి, డాక్టరుబాబూ" అని తానూ కొంత ఊపిరి పీల్చుకొంది.

డాక్టర్ సమాధానమిస్తూ "ఇంకేమి భయములేదులెండి. ఇంక పది నిమిషాల్లో బాధ పూర్తిగా పోతుంది." అని వెళ్లిపోవడానికి 'కిటు'ను సవరించడం చూచి శ్యామసుందరి "కూర్చోండి, డాక్టర్. కాఫీ తీసుకొని మరి వెళ్ళుదురుగాని" అని మాణిక్యంవైపు చూచింది.

"అక్కర్లేదండి. క్షమించాలి, మీ కిప్పుడు నెమ్మదిగా ఉందికదా! అంతేచాలు కాఫీకి మరల ఎప్పుడైన వస్తానులెండి అయ్యగారు వచ్చాక. సెలవు" అని ఆమెకు నమస్కరించి, ఒక్కమారు ఆ యింటి వైభవాన్ని అట నిలబడివున్న ప్రసన్న ముఖాన్నిచూచి, వచ్చినవాడు వచ్చినట్టే వెళ్ళిపోయాడు. అతను రావడం - వెళ్ళడం - అంతా పదిహేను నిమిషాల్లో జరిగిపొయ్యింది.

# 8

"డాక్టర్ ఫీజుకూడ ఇవ్వడం మరచిపోయాము" అంది శ్యామ సుందరి.

"అత డొక్క నిమిషమైనా నిలిచాడా అమ్మా? కాఫీ తీసుకొని వెళ్ళమన్నారు కాని. విన్నాడా? ఇంక ఫీజెప్పుడిస్తారు చెప్పండి?" అని మాణిక్యం మూతి తిప్పింది.

"చాల సభ్యత తెలిసినవాడిలా గున్నాడు, మాణిక్యం. అంతా ఆడు వార మున్నామని సంకోచించినట్లుంది."

"అవునమ్మగారు, మీ మాట నిజం" అని సుబ్బన్న సమర్థించాడు యజమానురాలి మాటను.

"ఇత డెక్కడున్నాడు సుబ్బన్నా?" అని అడిగింది శ్యామసుందరి.

"మారిస్ వీధిలో ఆస్పత్రి వుంచాడమ్మా. మన రంగనాధం డాక్టర్‌బాబు దొరక్కపొయ్యేటప్పటికి యీతన్ని పిలుచుకొని వచ్చానండి. ఎవరైతేనేం? బలేమం దిచ్చాడమ్మా. మీ నొప్పి చేత్తో తీసేసినట్టు పొయ్యింది."

"అవునవును. మంచి సమర్థుడల్లే వున్నాడు డాక్టర్" అన్నది శ్యామసుందరి.

"ఇతనిపేరేమో!"అని తాను ప్రశ్నించినట్టు కాకుండ మాట్లాడింది. ప్రసన్న.

"నాకేమి తెల్సు, తల్లీ."

"ఆస్పత్రిలో బోర్డు చూడలేదా?"

"నాకేమి చదువా, సంధ్యా, చూడ్డానికి ?"

ఆ మాట కందరు నవ్వారు.

"సరే, కాని, మీ అయ్యగారు వచ్చాక, డాక్టర్ని పిలుచుకొని రమ్మంటే పిలుచుకొని వస్తావుకదూ ?" అని అడిగింది శ్యామసుందరి.

"ఓ అంతా గుర్తుంచుకొన్నానమ్మా."

"అంతమాత్రం తెలిసుంటే చాల్లే."

అంతలో మాణిక్యం ఏదో జ్ఞాపకమొచ్చి "అరెరె - ఎంత పొరబాటైంది. అమ్మగా రిప్పుడు స్నానం చెయ్యొచ్చో, వొద్దో - తిండి తినవచ్చో - వద్దో - అడగడం మరచాం" అన్నది.

"అవునవును ముఖ్యమైన సంగతే నమ్మగారూ ఇప్పుడే వెళ్ళి అన్నీ కనుక్కొనివస్తా"నని సుబ్బన్న గబగబా వెళ్ళబోతూంటే శ్యామసుందరి దానినాపి "డాక్టరుకు ఫీజు యివ్వడానికి వారే రావలెనా ? ప్రసన్నా ! సుబ్బన్నవెంట పాతిక రూపాయలిచ్చి పంపమ్మా" అన్నది.

ప్రసన్న డబ్బుతెచ్చి వాని చేతిలో పెట్టింది. పైక మందుకొని సుబ్బన్న వెళ్లిపోయాడు.

డాక్టర్ విజయకుమార్ వయస్సు ఇరువదిమూడు, ఇరువదినాలుగుంటుంది. అంత పొట్టికాదు - పొడుగరికాదు. ఎఱ్ఱటి దబ్బపండుచాయ. చక్కని ఆకర్షణీయమైన నిండు విగ్రహం, తళ తళ మెరిసే రోల్డ్‌గోల్డు సులోచనా లడ్డమున్నా కండ్లలోని సహజమైన ఆ తీక్ష్ణత ఆ సుందర ముఖాని కెంతో అందాన్ని కలిగించడమేకాక, అతని సునిశిత మేధాశక్తికి సూచికంగా ఉంది. తల్లిపడే బాధలో ప్రసన్న అతడు లోపలికి వచ్చినప్పుడంతగా గమనించలేదుగాని అతడు చికిత్స ముగించి వెళ్ళిపోయేటప్పుడు మాత్రము ఆమె హృదయఫలకంమీద కెమెరాలోని నీడవలె బాగా హత్తుకుపోయాడు.

విజయకుమార్ స్థితికూడ అంతే ఇంట్లో కాలుపెట్టిన ప్రథమంలో శ్యామసుందరికి మేలు చేయాలనే తలంపులో మునిగి దేనిని అంతగా గమనించలేదతడు. తీరా వెళ్లిపోయేటప్పుడు ప్రసన్నను లక్షించిచూచాడు. అది యాదృచ్ఛికమే అయినా ఒక్క క్షణంపాటు ఇరువురి చూపులు పరస్పరం మేళగించిపోయి, ఇద్దరి దేహాలు ఎలెక్ట్రిక్‌షాక్ తిన్నట్లు జలదరించిపోయాయి. ఆ చూపుల్లోనే యేదో అనూహ్యమైన భాష, శక్తి యిమిడి ఉన్నాయి. కాని, దానినెవ్వరు గ్రహించినట్టులేదు. విజయకుమార్ సభ్యతకల యువకుడు. చక్కని సంస్కారి. తానువచ్చి ఉండేపనియేమి-ఉండే దెచ్చట- తాను చేసిందేమి- అనే విషయాలు అతని తలలో మెఱుపువలె మెఱసిపోవుటచేత, తటాలున తన చూపును మరల్చుకొని వెళ్ళిపోయాడు. అయినా, ఆ ఒక్క క్షణములో అతని మనసులో ప్రసన్న సుందర విగ్రహం శాశ్వతస్థాన మేర్పఱచుకొంది. ఈ తెప్పపాటు కాలములో జరిగిన యీ హటాత్సంఘటన ఫలితము వారి భవిష్యజ్జీవిత సౌధాలకు పునాది కావడం దైవికము.

అచ్చట ఉన్నవారెవ్వరు దీన్ని అంతగా పట్టించుకోకపోయినా దాని పర్యవసానము వారిద్దరి భవిష్యత్తునకు మూలబీజమైంది.

నిజం చెప్పాల్సొస్తే శ్యామసుందరికికూడ ఎందుకో ఆ యువకుని చూచిన క్షణములోనే ఏదో ఒక విధమైన ప్రేమాభిమానా లుదయించాయి. ఉన్న దున్నట్టు మద్రాసులో చదువుతూ వుండే కొడుకు ఎదుటికొచ్చినట్టయ్యిం దామెకు. అదంతా ఋణానుబంధము. అజ్ఞాతమైన విధి లీలలకు కారణ మెవ్వరు చెప్పగలరు?

ప్రసన్న అమ్మతో యిట్లన్నది "అమ్మా! రేపు అన్నయ్యకు వ్రాస్తానే యీ సంగతంతా?"

"ఎందుకు? వాడింత గాభరాపడి మద్రాసునుండి రావాలా?"

"ఎందుకొస్తాడు? నీకు బాగుందని వ్రాస్తానుగా?"

"వ్రాయనియ్యండమ్మా. ఏసంగతి అన్నకు తెలుపకపోతే చెల్లాయికి నిద్ర పట్టదు" అని మాణిక్యం నవ్వుతూ సమాధానం చెప్పింది.

డాక్టరు చెప్పినట్టు శ్యామసుందరికి పూర్తిగ మేలైంది. ఉన్న ముగ్గురు ఆనాటి సంఘటనను గురించి, డాక్టర్ శక్తినిగురించి మాట్లాడుకొంటూ ఉండగానే ఇంటివద్ద కారాగిన శబ్దమైంది. "అదిగో, అయ్యగారొచ్చారండి" అన్నది మాణిక్యం. అత డింకా గదిలోకివెళ్ళి దుస్తులు విప్పీ విప్పకముందే ప్రసన్న పరుగెత్తిపోయి "నాన్నా, నాన్నా. అమ్మను తేలు కుట్టింది" అని చెప్పివేసింది.

నారాయణరావు అదరిపడ్డాడు. ఉన్నపాళంగా "ఏదీ, ఎక్కడ? ఎక్కడ?" అని లోపలికి పోబోతుంటే, ప్రసన్న ఆపి "కంగారుపడకు నాన్నా, అంతా మేలైంది. డాక్టర్ వచ్చి బలే మంచిమం దిచ్చాడులే." అని అతని గాభరాను తగ్గించేవేళకు శ్యామసుందరికూడ వచ్చిందక్కడికి. ఆమెను చూచి నారాయణరావు "శ్యామా, నిన్ను తేలుకుట్టిందా? అని ప్రేమపూర్వకంగా ప్రశ్నిస్తే. అందు కామె నవ్వుతు "నేనేమి దానికి ప్రియబంధువా నన్ను వదలేందుకు?" అంది.

"అదికాదు. నీ వెప్పుడు ఆ పాడుబాధ పడినదానవుకావుకదా?"

"నిజమే. గ్రహచారం ఉన్నప్పుడు తప్పుతుంతా?"

"సరే, యిప్పుదేలాగుంది?

"బాగుంది. డాక్టర్ వచ్చి యింజెక్షన్ యిచ్చాడు. ఐదు నిమిషాల్లో బాధ పూర్తిగా నివారణ చెందింది." అని బిడ్డను చూచి "అమ్మాయి, నీవు వెళ్ళి నాన్నగారికి కాఫీపట్టుకరామ్మా" అని ప్రసన్నను పంపి తానచటనే సోఫాలో కూర్చున్నది.

అంతలో సుబ్బన్నవచ్చి ఇరవైఅయిదు రూపాయలు ముందుంచి

"అమ్మగారు డాక్టరుబాబు వద్దన్నాడండీ. ఎంత చెప్పినా తీసుకోలేదు." అని చెప్పాడు.

"ఎందుకు తీసికోలేదు?" అని అడిగాడు నారాయణరావు.

"ఈ మాత్రానికి ఫీజెందు కన్నారండీ."

"ఏమాత్రమైతేనేమి? డాక్టర్లు ఋణమెందుకుంచు కొంటాము? పో, నే చెప్పానని మళ్ళీవెళ్ళి యిచ్చిరా" అని భార్యవైపు తిరిగి "ఎంత పంపావు శ్యామా? అని అడిగాడు.

"పాతిక రూపాయలు."

"ఉదారంగానే యిచ్చావు. బహుశా, తృప్తిలేకపోయిందేమో! అయితే అతడెప్పుడు అలాగనేవాడు కాడే?"

"మన రంగనాథం డాక్టర్ కాదండి. ఎవరో క్రొత్తవాడు. ఇంకా చిన్నవయసే."

"ఈ కుర్రకుంకలకు మితిమీరిన ఆశ. సరే, ఇంకొక పాతిక యిచ్చి పంపు" అని అంతలో ఏమాలోచించాడో "వద్దులే. నేనే పిలిపించి యిస్తా. ఉదయం ఆపని చూచుకోవచ్చు." అని సుబ్బన్ననుపంపి, అప్పుడే ప్రసన్న తెచ్చియిచ్చిన కాఫీకప్పు నందుకొన్నాడు,

మగడన్నట్టు తాను పంపిన ఫీజుతో డాక్టర్ అసంతృప్తిపడివుంటాడని శ్యామసుందరి కూడా మొదట తలంచింది. కాని, అది తరువాత సమంజసమైన కారణంగా ఆమెకు తోచలేదు. "ఒక ఇన్‌జెక్షన్‌కు యింత దబ్బెందుకు పంపా"రని ఉదారభావముతో వద్దన్నట్టు ఆమెకు స్ఫురించింది. అతనిని మొట్టమొదట చూచిన క్షణములో ఏర్పడిన సదభిప్రాయంవల్ల కలిగిన ఫలితమది. ఉదయం డాక్టర్ని పిలువనంపుతానని తండ్రి చెప్పిన మాటను ప్రసన్న విని, ఆతనిని మరియొకమారు చూడవచ్చుననే ఆశతో ఆరాత్రంతా ఎందుకో సరిగా నిద్దరకూడ పోయిందికాదు.

తెల్లవారేసరికి అందరికంటెముందు ఆమె తండ్రిని చూచి, నాన్నా, డాక్టరుకు చెప్పి పంపుతామన్నారే?" అని జ్ఞాపకపరచింది.

ముందు దినం సాయంకాలము విజయకుమార్‌ను చూచినప్పటి నుండి ఆమె మనసు అదొ౯కమాదిరిగా ఉంది. అప్పటి హడావుడిలో అతను చాల సేపు నిలువలేదు. బహుశ, తల్లిచెప్పినట్టు క్రొత్తచోటు – అంతా ఆడువారున్నప్పుడు....తా నంతకంటె హెచ్చుకాలం నిలవడంకాని, హెచ్చుగా మాట్లాడంకాని సభ్యత కాదనిపించిందేమో అని సమాధానపడింది. అయినా, అతన్ని మరల చూడాలని ఆమె ఉబలాటం. ఇప్పుడు తండ్రి అతనిని పిలిపించబోతున్నాడు. ఏదోవిధంగా విజయకుమార్‌ను బాగా లక్షించి చూడాలనిపించింది ప్రసన్నకు.

"ఇప్పుడే పిలువనంపుతానమ్మ" అని నారాయణరావు సుబ్బన్నను పిలిచి" నీవు వెళ్ళి నిన్నటి దినం వచ్చిన డాక్టర్నీ నేను పిలుస్తున్నానని మన కారులో పిలుచుకొనిరా" అని తెలిపాడు.

# 9

ఉదయం ఎనిమిది గంటలకు ఒక ప్రత్యేకమైన గదిలో కూర్చుని భార్య, బిడ్డ, తాను టిఫిన్ పుచ్చుకోవడం నారాయణరావుకు అలవాటు.

ఇంతలో బయటకారొచ్చి ఆగిన శబ్దం విని ప్రసన్న కొంత ఉద్విగ్నత చెంది, లేచి వెలుపలకి పోయివచ్చి "నాన్నా, డాక్టరుగారు వచ్చి వరండాలో నిలుచున్నారు" అని చెప్పింది. "సరే" అని నారాయణరావు కాఫీ త్రాగి, తువ్వాలుతో చేతులు తుడుచుకొంటూ రండి, డాక్టర్, లోపలికి" అని విజయకుమార్‌ను ఆహ్వానించాడు.

"నమస్కారమండి."

"నమస్కారం. కూర్చోండి" అని తన ఆఫీసుగదిలో అతన్ని కూర్చోబెట్టి నారాయణరావు భార్యను పిలచి "డాక్టర్‌గారికి కాఫీపంపు" మని చెప్పాడు.

ప్రసన్న వెంటనే తన గదిలోకి వెళ్ళింది. అది తండ్రి ఆఫీసుగది కానుకునేవుంది. అక్కడ వారేమి మాట్లాడుకున్నా ఆమె గదిలోకి స్పష్టంగా వినబడుతుంది. పైగా అద్దాల కిటికీలగుండా ఆఫీసులో జరిగేదంతా కనబడు తుంది. అది రంగుటద్దాలగుటచేత బయటివారు కనబడతారేకాని లోపలివారు కనబడరు. ప్రసన్న కుతూహలానికి కర్థముతెలిసినట్టే వుంది.

మాణిక్యం టిఫిన్, కాఫీలు తెచ్చి తనముందు బల్లమీద పెట్టాడు. చూచి విజయకుమార్ "ఇవెందుకండి, సార్? ఇప్పుడే టిఫిన్ ముగించుకొని వచ్చాను." అన్నాడు.

"దానికేం తీసికోండి. యువకు లెంతైనా జీర్ణించుకోగలరు" అని నారాయణరావు బలవంతపరచాడు. శరించడం మర్యాదకాదని విజయ కుమార్ ప్లేటులోని ఉపహారాన్ని కాజేశాడు.

"మీరు నిన్నటిదినం సమయానికివచ్చి చాల సహాయం చేశారు. పంపిన ఫీజు తీసుకోలేదెందుకు ?"

"నేనిచ్చింది ఒక్క ఇన్‌జెక్షన్ మాత్రమే. దానికి పాతిక రూపా యల ఫీజా? ఎందుకండి అంత పైకం ?"

"అదా సంగతి? అలాగైతే మీకు న్యాయమైనదని తోచింది గ్రహించండి. వైద్యరుణంతీర్చుకోవాలికదా మేము."

"క్షమించండి. ఒక చిన్న ఇన్‌జెక్షన్ అది. నా ఖర్చంతా ఒక్క రూపాయ మాత్రమే."

"అయితేమాత్రం. డాక్టర్లు ఫీజులేంది ఒకరింటికి వస్తారా?"

"రాకూడదని మా వైద్యశాస్త్రంలో ఎక్కడ లేదండి. ఇష్టమైన చోట్లకు ఎంతైన తామే ఖర్చుపెట్టుకొని వస్తారు."

"థ్యాంక్సు, డాక్టర్. మీది చాల ఉదార హృదయం. అయితే, మీరీలాగు ఎంతమందికని వృధా మందు లిస్తారు?"

"అందరిసంగతి వేరు, మీసంగతి వేరు, సార్! మేమే మీకెంతో ఋణపడి వున్నాము."

"ఏరీతిగా?" అని నారాయణరావు విస్మితుడై చూచాడు డాక్టర్వైపు.

"ఐదేండ్లు మా తండ్రిగారు మీ పిల్లలకు ట్యూషన్ చెప్పారు. ఆ కాలములో మీరు మహోదారంగా యిచ్చిన ట్యూషన్ఫీజు కృషికి మించిన ఫలితం, మా తండ్రిగా రెప్పుడు అదేమాట అనుకొంటూవుంటారు.

నారాయణరావుయొక్క ఆశ్చర్య మధికమైంది. అతడు ఎగాదిగా విజయకుమారునుచూచి అయితే మీరు లక్కవరం మాధవరావుగారి అబ్బాయిగారన్నమాట!" అని అడిగాడు.

"చిత్తం. నా పేరు విజయకుమార్."

నారాయణరావు ముఖం సంతోషంతో విప్పారింది. సంతోషం, కోపం, విచారం — ఏది కలిగినా అతనిదొకరీతి అతి, ప్రకృతి, లేచి విజయకుమార్ వీపుపై తట్టుతూ "కన్గ్రాచ్యులేషన్స్, విజయకుమార్, చాల సంతోషమైంది." అని "శ్యామా, శ్యామా" అని భార్యను కేకవేసి పిలిచాడు. ఆమె ఏమిటో అని బిరబిర రాగానే డాక్టర్ లేచి నమస్కరించా డామెకు. ఆమెకూడ నమస్కరించింది.

"ఎవరనుకున్నావు యీ అబ్బాయ్?" అని అడిగాడు భార్యను. శ్యామసుందరి 'తనకు తెలియదన్నట్టు' వింతగా చూచింది యిద్దరివైపు.

"మన రామమోహన్‌కు, ప్రసన్నకు ట్యూషన్ చెప్పిన మాధవ రావుగారి కుమారుడే!" ఆ మాట కామెకూడ అపరిమితానందం పొందింది.

"చాల సంతోషం, బాబూ. ఎవరో కొత్తవా రనుకొన్నాం. మీ తండ్రిగారు కులాసాగా వున్నారా ?"

"కులాసాగా వున్నారమ్మా. మొన్ననే షష్ఠిపూర్తి చేశాము."

"ఇతనిపేరు విజయకుమార్, శ్యామా !"

"అవును, అన్నట్టు మరచాను. మాధవరావుగారు చెప్పేవారు తన కొక్క కుమారుడు కూతురని. నీవు విశాఖపట్నములో మెడికల్‌కోర్సు చదువుతున్నావనికూడ చెప్పుతూ వుండేవారు. మీ చెల్లెలు రాధ మా ప్రసన్న క్లాస్‌మేటట. మా అమ్మాయి చెప్పింది ఒకమారు. చాలా సంతోషం, నాయనా ? అమ్మాయికి పెండ్లయిందా ?"

"లేదండీ యిక. ఈ కాలాల్లో పెండ్లంటే మాటలా ?"

"కాదామరి. మేము మా ప్రసన్న విషయంలో పడుతూవుండే బాధలాంటిదే అందఱు అనుభవిస్తూవుంటారు." అని అన్నాడు నారాయణరావు.

"మీకు తగిన సంబంధం కావాలనే దొక్కటేబాధ. డబ్బు విష యంలో మీకు యిబ్బందిలేదు. మాలాంటివాళ్ళకు రెంతు యిబ్బందులే కదండీ ? మధ్యరకం వారి పిల్లలకు మొగుళ్ళను తెచ్చుకోవడమనేది సంత పసువుల బేరంలాగుంది.",

ఆమాటకు భార్యాభర్త లిద్దఱు మనసార నవ్వారు.

"మీరు ప్రాక్టీసు ప్రారంభించి ఎంతకాలమైంది ?"

"రెండుమాసాలుమాత్ర మైంది సార్ !"

"అలాగా, ప్రాక్టీసు బాగానేఉందా?"

"ఏదో కొద్దిగా, అంతా అదృష్టంకదండీ?"

"అవునవును. ఈ ప్రపంచంలో యోగ్యతా యోగ్యతలకు మించింది అదృష్టం. అదృష్టవంతుడైన అవివేకి బుద్ధిమంతుడు. అది లేని బుద్ధిమంతు డవివేకి."

విజయకుమార్ నవ్వకుండ వుండలేకపొయ్యాడు.

"బంగారులాంటి మాటన్నారు, సార్."

"ఇదంతా లోకానుభవమేకదా? సరేకాని, మీ నాన్నగారు మా పిల్లలకి చదువులో మంచి పునాదు లేశారోయ్."

"రామమోహన్ లా కాలేజీలో చేరాడని విన్నాను."

"అవును మద్రాసులో వున్నాడు. ప్రసన్న చదువు చాలించింది" అని నారాయణరావు భార్యనుచూచి "ప్రసన్న నొకమారు పిలు. తమ గురువుగారి అబ్బాయిని చూడమను" అన్నాడు.

శ్యామసుందరి పిలుపువిని ప్రసన్నవచ్చి డాక్టరుకు నమస్కరించి, తండ్రి కుర్చీవెనుక నిలబడింది సిగ్గుపడుతూ. విజయకుమారును మరియొక మారు చూడాలని కుతూహలపడింది. కాని, అలాంటి సన్నివేశం తటస్థపడుతుందని ఆమె తలంచలేదు. దైవికంగా కలిగిన ఆ యవకాశాన్ని వృధా పోనిచ్చేంతటి తెలివిమాలింది కాదు ప్రసన్న. ఇరువురు పరస్పరం తృప్తిగా చూచుకొన్నారు.

తానొకటి తలచిన దైవమొకటి తలంచునన్నట్లు, నారాయణరావు ప్రసన్నను పిలిచిన ఉద్దేశం వేరు - ఆ సమావేశంయొక్క ఫలితంవేరు. ఏక కాలములో ఆ యువతీయువకుల హృదయాల వాలాల్లో ప్రేమబీజాలు నాటుకొన్నాయి. శ్యామసుందరి ఏమనుకొనిందో కాని హసన్ముఖియై యిద్దరివంక తృప్తిగా చూచింది.

నారాయణరావు కిదేమి కొబట్టలేదు. "మీకు ట్యూషనుచెప్పిన మాస్టారుగారి అబ్బాయమ్మా" అని ఆప్యాయతగా డాక్టర్‌వైపు చూపాడు.

ప్రసన్న చాలసేపు అచ్చట నిలబడలేదు. ఓరచూపులతో ముసిముసి నవ్వులతో విజయకుమార్ హృదయాన్ని గిలిగింతలు పెట్టివేసి పోయింది. క్రిందటిదినం చూపుల్లో కలిగిన కొఱత నిప్పుడు ఇద్దరు తనివితీర తీర్చుకొన్నారు. ప్రసన్న లావణ్య సౌందర్యాలు ఆలౌకమనిపించాయి విజయకుమారుకు.

కడకు పాతికరూపాయలు ఫీజు తీసుకొనేవరకు విజయకుమారును శ్యామసుందరి, నారాయణరావు వదలలేదు.

వారి ఔదర్యాని కెంతో సంతోషించి, కృతజ్ఞత తెలుపుతూ అతడు వారివద్ద సెలవుతీసికొని వెళ్ళిపోయాడు.

# 10

విజయకుమార్ మొదట గేటుదగ్గరికి వచ్చేటప్పటికి వరదరాజెదురయ్యాడు. ఒకరి నొకరు పలుకరించుకోలేదు. ఒకరు బయటికి వెళ్ళిపోతే యింకొకరు లోపలికి ప్రవేశించారు.

"రండి, వరదరాజులు" అని నారాయణరా వతనిని ఆహ్వానించి, కాఫీ తెప్పించి యిచ్చాడు. వరదరాజు వచ్చీరాకనే చుట్టుచూచి తగ్గు ధ్వనితో "ఈ వాక్ట రెందు కొచ్చారండి యీవేళ మీదగ్గరకు ?" అని ప్రశ్నించాడు.

"ఎవరు, విజయకుమారా ?"

"అవును. అతని సంగతే అడిగేది.

"నిన్న మనము సాయంకాలము మీటింగు కెళ్ళాము కదూ? అప్పు డింట్లో మా ఆవిడను తేలు కుట్టింది. సమయానికి మా ఫ్యామిలీ డాక్టరు దొరక్క పోయేటప్పటికి మా నౌకరు సుబ్బన్న యితన్ని పిలుచుకొని వచ్చాడు. డాక్టర్ ఇన్‌జెక్షన్ యిచ్చాడట. ఇంటికి వస్తూనే మా ప్రసన్న సంగతంతా చెప్పింది. ఫీజు పంపితే వద్దన్నాడట. యిప్పుడు నేనే పిలి పించి యిచ్చాను. ఇతడెవడో క్రొత్తవాడనుకొన్నాను. మా పిల్లలకు ట్యూషన్ జెప్పిన లక్కవరం మాధవరావు కుమారుడంట."

నారాయణరావు సమాధానం వింటూ వరదరాజులు తల ఊపి "అమ్మగారికి మేలైందాండీ?" అన్నాడు.

"అప్పుడే అయిదు నిమిషాల్లో బాధ చేత్తో తీసేసినట్టు పోయిందట. మంచి సమర్థుడలే కనబడుతూంది. రాజూ!"

"సరే అయినదేదో అయింది. ఇక ముందెప్పుడు యితన్ని పిలి పించకండి సార్."

వరదరాజులు మాట విని ఆశ్చర్యపోయాడు నారాయణరావు.

"ఎందుకు?"

"ఇతడు నిరంజన రెడ్డికి యీ ఎలెక్షన్లలో కుడి భుజమండీ"

నారాయణరావు వీపుపై చరిచి నట్టయింది ఆ మాట వింటూనే. "అలాగా! మాధవరావు నా కెంతో కావలసినవాడు కదా?" అని అసూయ కంగా ప్రశ్నించాడు.

"అవును, సార్, అవి మీ పిల్లలకు ట్యూషన్ చెప్తూ వున్న ? మాట. రోజులు మారాయి లెండి. కొడుకు చాలా ప్రబుద్ధు డయ్యాడు. ాంటి వారి మద్దత్తు లేకపోతే నిరంజనరెడ్డికి మీ వార్డులో మిమ్మెదిరించ ి కెన్ని గుండెలు కావలెనండి?"

ప్రక్కగదిలో వున్న శ్యామసుందరి, ప్రసన్న వీరి సంభాషణ వింటూనే వున్నారు. ఇద్దరి ముఖాలు వెలవెల పోయాయి.

"అయితే మన మిప్పుడొక పనిచేయాలి, రాజూ."

"ఏమంటారు?"

"బాగా ఆశచూపించి ఈ కుర్రవాణ్ణి మన వైపు లాక్కోవాలి."

"ఆభేదోపాయం ఫలించదండి. ఇతడు డబ్బుకాశపడే ఘటం కాదు."

"అవును, ఆ సంగతి తెలుస్తూనే వుంది. మరి మాధవరావుని పిలిపించి మాట్లాడితేనో?"

"అది కూడ నిష్ప్రయోజనం. ఆ ముసలాయన మాట వినడీ కొడుకు."

నారాయణరావు ఆలోచించసాగాడు. విజయకుమార్ విషయమై ఒకసారి ఏర్పడిన సద్భావము వరదరాజు మాటల వల్ల నశించి పోయింది. పాతకంలో పుడకలా వచ్చిన రాజును చూచి శ్యామసుందరి, ప్రసన్న లోలోన అసహ్యించుకొన్నారు.

"సరి, నీ వన్నట్లు అయినదేదో అయిపోయింది. ముందితనితో మాకేమి పని. మనసులో యింత కుళ్ళుంచుకొని పిలువగానే ఎందుకొచ్చాడో మా యింటికి!"

"రాకేమి? అది వృత్తి ధర్మం. వృత్తి విషయంలో డాక్టర్లకు మిత్రులు ఒకరే, శత్రువులు ఒక్కరే."

"అదికూడ కొంత వరకు ఉదారత్వమే కదా, రాజూ?"

"ఇదంతా నటన లెండి. పైకి మీతో విరోధమెం... వర్తిస్తున్నా డితడు. కప్పకూత పాము. సార్! జ...

సంగతంతా నాకు బాగా తెలుసు. నిరంజనరెడ్డి, ఇతడు బాల్య స్నేహితులు ఇద్దరిని విడదీయడ మసాధ్యం. వీరంతా చేరి ఊళ్ళో ఒక "యువజన సంఘాన్ని" స్థాపించి ఏవేవో పగటి కలలు కంటున్నారండీ. ఆ సంఘానికి కితడు కార్యదర్శి. రంగపురం స్వరూపాన్నే మార్చేయాలని వీరి ఆశయం."

"సరేకాని, ఇతడు నన్నెందు కెదిరిస్తున్నాడంటావు?"

"మీరు పాతరకం వారంట. వాళ్ళకు మీ ఆదర్శాలు గిట్టవంట. మీరు యువకుల పురోభివృద్ధికి ఆటంకమట...."

"అలాగా?"

"మీటింగుల్లో యీ కుర్రకుంక లీరీతిగా మిమ్మి తెగనాడుతూ వుంటే యీ పాడు చెవుల్తో వినాల్సొస్తూ వుంది, సార్!"

"అయితే, శృతిమించి రాగాన పడిందన్న మాట. మనమింక ఊరుకో కూడదు, రాజూ!"

"అదేనండి నే చెప్పేది కూడ. ఛేర్మెన్ నారాయణరావుగారితో విరోధమంటే అగ్గితో చెరలాడటం అని వీరుగ్రహించేట్టు చేయాలి, సార్"

"సరే, చూద్దాం. ఈలాంటి వాళ్ళకా నేను జంకేది?"

అని లేచి నారాయణరావు లోపలికెళ్ళి పోయాడు.

అతని మనస్తత్వాన్ని గ్రహించిన వరదరాజులు తనకా దినం డబ్బులు వచ్చే యోగం లేదని తిన్నగ వెళ్ళిపోయాడు.

వరదరాజంటే కరటక దమనుల ఐక్యావతారము. సమయా సమయాలు చూచి ఎదుటి వారిని తన వలలో వైచుకొనే విద్యలో అతని కతడే సాటి. ఈ ఎలెక్షన్ పరిస్థితుల్లో నారాయణరావు సంగతిని బాగా గుర్తించాడు కాబట్టి అతడు లంచమిస్తే లోబడుతాడు. ఇతడు లంచమిస్తే లోబడుతాడు" అని లేనిపోని కల్లబొల్లి మాటలు చెప్పి ఈలోగా నారాయణరావుతో

వచ్చినప్పుడల్లా పాతికి, వంద లాక్కొని పోతున్నాడు. అతని తేనెవంటి మాటలకు, పొగడ్తలకు, అతి వినయానికి, స్వాతిశయ ప్రియుడైన నారాయణరావు పూర్తిగ వశుడై గంగగోవువలె కోరినప్పుడు కోరినంత డబ్బి స్తున్నాడు.

ఈ ఎలెక్షన్ల అవసరములో వరదరాజెట్టి మోసగాడైనది శ్యామసుందరి బాగా గ్రహించింది. కాని, అతనిని గూర్చి మగనితో చెప్పే సాహసం లేదామెకు, తామెచ్చిందే రంభ—తామునిగిందే గంగ—అనేరకం నారాయణరావు.

# 11

ప్రసన్నకు విజయకుమార్ తగిన వరుడని శ్యామసుందరి మనసులో ఛాయా మాత్రంగా తోచిన అభిప్రాయమే ప్రసన్న మనస్సులో దృఢ నిశ్చయంగా బయలుదేరింది. కాని, ఆమె ఆ సంగతి గురించి తల్లితోగాని, మాణిక్యంతో కాని యేమి మాట్లాడలేదు. మనసునందే మదనపడసాగింది నాటి నుండి.

ఒక విధంగా శ్యామసుందరి కంటే ప్రసన్నకు మాణిక్యము వద్దనే చనువెక్కువ. ఆమె వంటలక్క మాత్రమే కాదు. ప్రసన్నను రెండేడ్ల వయస్సులో తండ్రి వదలిపోయి నప్పటినుండి ఆ చిన్నదాన్ని పోషించడానికి నియమితమైన దాది. నాటినుండి నేటి వరకు మాణిక్యం ప్రసన్నను పూలలో పెట్టి పోషించింది. దానికి తోడు శ్యామసుందరి 'తల్లిదండ్రులు లేని పిల్ల కదా?' అని అత్యంతమైన గారాబంతో చూస్తూ, కన్నబిడ్డ కంటె అధికంగా ప్రేమిస్తూంది ప్రసన్నను. ఇక రామమోహనునకు చెల్లెలంటే

ప్రాణాధికరాలు. అందుకామె అసామాన్యమైన రూపు రేఖలు, సద్గుణములు, బుద్ధి సూక్ష్మత మున్నగునవి కారణాలు.

ఇక నారాయణరావుకు మాత్రము ప్రసన్న విషయములో ప్రేమాభిమానాలు తక్కువని చెప్ప వీలులేదు. అయినా, అతనిదంతా ఒక విచిత్రమైన ప్రకృతి. 'తాను పట్టిన కుందేటికి కాళ్ళు మూడనే' రకం అతడు. పైగా డబ్బుమీద అమితమైన ప్రేమ. దాని తరువాతనే తక్కినదంతా అతనికి. సుమారు ఇరవై లక్షల స్వంత ఆస్తి ఉన్నా తృప్తిలేక, అవకాశం దొరికినప్పుడల్లా మూల ధనాన్ని వృద్ధిచేయాలనే పేరాశ పెరిగిపోతూందే కాని, తుదకు 'ధన్వేషణ' తగ్గింది కాదతనిలో.

తల్లి బిడ్డ రెండు దినములు దీర్ఘంగా ఆలోచించారు అతని నెట్లయిన యీసారి ఎలెక్షన్ ప్రయత్నం నుండి విరమింప జేయాలని, పైగా విజయకుమారు విషయమై మొదట్లో ఏర్పడిన అతని సదభిప్రాయాన్ని పాడుచేసిన వరదరాజులు మీద వారిద్దరికి చెప్పరానంత అసహ్యము, కోపము ఉదయించాయి.

తన మాట నింక భర్త వినడని శ్యామసుందరికి బాగా తెలిసిపోయింది. ఈ మధ్య యిచ్చటి సంగతులన్ని తెలిపి, కొడుకుతో కూడ వ్రాయించింది భర్తకొక జాబు.... ఈసారి ఎలెక్షన్ ప్రయత్నం నుండి విరమించుకొమ్మని. దానివల్ల కూడ ప్రయోజనం లేకపోయింది. రామమోహనునికి తండ్రివల్ల రెండు చీవాట్లు పడ్డాయంతే. "వద్దమ్మా యిక నీ మాట మాత్రం వింటారా?" అని తల్లి ఎంత చెప్పినా ప్రసన్న వినకుండ ఒకనాడు సమయం చూచి ఒంటిపాటున ప్రసన్న తండ్రి వద్దకు తిన్నగా వెళ్ళింది.

నారాయణరావు అభిమానపురస్సరంగా బిడ్డను దగ్గర కూర్చోబెట్టుకొని, తల దువ్వి "ఏమమ్మా" సంగతి అని ప్రశ్నించాడు

"నాన్నా! నేనొక్క సంగతి తెలియకడుగుతాను. కోపగించుకోరు కదూ?"

"నీమీదనా కోపము, నా చిట్టితల్లిమీద?" అని ప్రేమతో ఆమె భుజము తట్టాడు.

"అసలీ ఎలెక్షన్‌ల వల్ల మనకు ప్రయోజన మేమి, నాన్నా?"

"వెనుక రెండు పెద్మల నుండి కలిగిన ప్రయోజనమే యిప్పుడు కూడ కలుగుతుంది. అధికారం హస్తగతమైనప్పుడు దాని ద్వారా స్వార్థ పరార్థం రెండూ నెరవేరుతాయి, తల్లీ!"

"స్వార్థమంటే?"

"మనకు కావలసిన పనులెన్నో నెరవేర్చుకోవచ్చు. మనల నాశ్రయించిన వారికీ సహాయము చేయవచ్చు. అందరుకోరే డబ్బును పుష్కలంగా సంపాదించవచ్చు. ఇవి స్వార్థానికి లక్షణాలు...."

"ఇవన్నీ నెరవేరాలంటే మీకే ఛేర్మెన్ పదవి ఉండితీరాలంటారా?"

"అవసరం లేదనుకో. అయినా, ఉన్న అధికారాన్ని అంత తేలిగ్గా వదలుకోవచ్చునా?"

"దానికేమి? ఎదురులేనంతకాలం అనుభవించారు. ఎదుటివారితో పోటీ వచ్చినప్పుడు కూడ దానికై పెనగులాడడ మెందుకు?"

"ఇవన్నీ ప్రజాసంస్థలమ్మా. పోటీలు పడడం వాటి లక్షణాలు. అవకాశాలు, అధికారాలు ఎలెక్షన్‌లలోనే నిశ్చితమౌతాయి. పెనుగులాడక పోతే బలాబలాను తేల్చేదెట్లు?"

"ఎవరికక్కరలేని యీ బలాబలాలు? అసలు మీకే పదవి లేక పోతే మాత్రం మీ అధికారానికి, గౌరవానికి లోటుంటుంది చూడబోతే ఈ శాసనల్లో ప్రవేశించనప్పుడే ప్రజలు మిమ్మ ఎక్కువగ గౌరవిస్తారేమో!"

ప్రసన్న చెప్పదలచుకొన్నదేదో అప్పుడే అర్థమై 'ఎందుకే అమ్మాయికి జోక్య' మని మనసులో చిరాకు బయలుదేరుతూ వున్నా నారాయణరావు ఆమె మీద ప్రేమకొలది శాంతంగానే జవాబు చెబుతూ వున్నాడు. వరదరాజులాంటి వారు తమ ప్రయత్నాన్ని హర్షిస్తూంటే, యింట్లో ఆలూ చూలే తన పనికి అడ్డంకా లేస్తున్నారని అతనికి కోపము వచ్చింది. అయినా, తమాయించుకొని. తుదకు "నీ కెందుకమ్మా యీ గొడవలు?" అని బిడ్డను ముద్దుగా మందలించి లోపలికి పంపివేశాడు.

ప్రసన్న ఏలాగైన విజయకుమార్ సంగతెత్తి అతని విషయమై వరదరాజు తండ్రి మనసులో కలిగించిన అసహ్యాన్ని తుడిచి వేద్దామని వచ్చింది. కాని, అందుకత దవకాశమీయ లేదు. ఇంక హెచ్చుగా మాట్లాడడం బాగుండదని గ్రహించి తిన్నగా వెళ్ళిపోయింది. బిడ్డ పరాజయానికి తల్లికి కూడ చాల విచారం కలిగింది. అత్యంతావసరమైన బిడ్డ విషయమాలోచించకుండ మగడు అనవసరమయిన యీ పాడు ఎలెక్షన్ గొడవల్లో దిగాడే అని ఆమె దుఃఖం.

వివాహోచితమగు వయస్సు వచ్చిన ప్రసన్న అవ్యక్తమగు నూతన యౌవ్వనదశలో - అలౌకికమైన ఆ రూపలావణ్యాలతో - చూస్తే దృష్టిదోషం తగిలేట్టుండి. వంశోచితమై వచ్చిన గాంభీర్య గౌరవభావాలామెకు పుట్టుకతో వచ్చాయి. అధునిక విద్య నభ్యసించిందైనా ప్రసన్న భారతస్త్రీ కత్యంత ప్రియమైన వేషభాషలను, పద్ధతులనే అనుసరిస్తూ, ప్రాచీన సాంప్రదాయాలను సమర్థిస్తూ వుంటుంది.

కాలేజీ డి[illegible] సొసైటీలో అనేకమంది విద్యార్థులు, విద్యార్థినులు ఆధునిక నాగరికతా పద్ధతులనె సమర్థించి, సంఘాన్ని ఆరీతిగా సంస్కరిస్తేకాని భారతజాతికి విముక్తిలేదనివాదిస్తే, ప్రసన్న వారి వాదాన్ని సవిమర్శగా ఖండిస్తూ, భారతజాతియొక్క ప్రత్యేక మహోన్నతా దర్శములన

వివరించి, అతి ప్రాచీనమై నాటికి, నేటికి ప్రపంచాని కాదర్శయోగ్యమై నిలచిన సంస్కారాలనుగురించి వినువారు మరి నోరెత్తకుండ విశదీకరించి చెబుతుంది.

అంతటి విజ్ఞానం, విమర్శనాచాతుర్యం చెల్లె లెప్పుడు నేర్చిందా అని రామమోహను డాశ్చర్యపొయ్యేవాడు. ఇంటికి వచ్చిన వెంటనే అతడు తలిదండ్రులతో "ఈ దినం ప్రసన్న డిబేటింగ్ సొసైటీలో ఢంకా బజాయించి చెప్పిన విషయాలకు ప్రొఫెసర్లుకూడ ఢంగైపోయారంటే ఏమి చెప్పాలి మా అమ్మాయి ప్రజ్ఞ!" అని సంతోషాతిశయము గంతు లేశేవా డతడు.

చూపరుల కామె కన్నులపండువు. ప్రతిదినం వేళకు సరిగ అన్నతో కలిసి కారులో కాలేజీకి వెళ్ళడం, అక్కడి కార్యక్రమం ముగిసిందంటే తిన్నగ యింటికి రావడమేకాని, దానికని, దీనికని విచ్చలవిడిగా స్నేహితురాండ్రతో తిరుగాడే స్వభావం కాదామెది. ఇంటా బయట అన్న ఒక్కడే ఆమెకు జత. స్నేహితురాండ్రెవరైన తన్ను జూడడానికింటికివస్తే వారితో తన ప్రత్యేకగదిలో కూర్చొని ఎంతసేపైన బాతాఖానీ జరుపుతుంది కాని, వారు పిలిచినచోట్ల కెల్ల పోదు.

బీదవిద్యార్థుల కామె ఒక కల్పవృక్షం. ఆర్థికంగా వారి కెంతో సహాయం చేస్తుంది. పరోపకారకార్యాల్లో పాల్గొనడమంటే ఆమె కమితోత్సాహం. అన్యాయాన్ని ఎదిరించడంలో ఆమెదే ఒక విశిష్టమైన పట్టుదల. ఆమె నాల్గవఫారములో చదువుతూ స్వంతగా ఒక బీద విద్యార్థినిధిని స్థాపించింది. ఎవ్వరు ఊహించని, [illegible]వని రీతిగా పై తరగతుల విద్యార్థులందరు ప్రతినెల తాము చెల్లించు బడి జీతములతోబాటు [illegible]లకొక్క అయిదు నయాపైసలు వంతున అదనంగా చెల్లించేట్టుచేసి, ఒక [illegible]ధి నేర్పఱచి, అందుండి బీదవిద్యార్థులకు ఉచిత సహాయం జరిగేట్టు

యేర్పాటు చేయించిందామె ఆ చిన్నవయసులో. ఆ డబ్బంతా హెడ్మాష్టరుగారి అధీనంలో ఉండేట్టు, ఆ కర్తవ్యాన్ని న్యాయంగా నిర్వహించేందు కతడొక విద్యార్థి కమిటీని యేర్పాటు చేసేట్టు, అందుకు తగిన నిబంధనలు వగైరాలు నిర్మాణ మయ్యేట్టు పాటుపడింది ప్రసన్న.

ఆమె కృషికి ఉపాధ్యాయులు, తక్కిన పెద్దలు ఎంతో హర్షించి తాముకూడ బీద విద్యార్థి నిధికి యథాశక్తి విరాళా లివ్వసాగారు. ఈ సంగతంత నారాయణరావుకు తెలిసింది హెడ్మాష్టరుద్వారా. అతడు బిడ్డ నెంతో అభినందించి ప్రతినెల తానూ వంద రూపాయ లివ్వ మొదలెట్టాడు.

రెండేండ్లక్రితం యస్. యస్. యల్. సి. విద్యార్థి ఒకడు అహంకరించి మూడవఫారంలోని ఒక అమ్మాయి విషయమై కొంత అసహ్యాకరమైన ప్రవర్తన చూపాడు. వెంటనే ఆసంగతిని తోడి విద్యార్థులవల్ల వినింది ప్రసన్న. అవమానితయైన విద్యార్థిని ఏరీతిగాను ఆ విద్యార్థిపై ప్రతీకారచర్య జరుపలేక లోలోన దుఃఖించుచుండడం చూచి. ప్రసన్న ఆమె కండయై నిలిచి తక్షణమే ఆ సంగతినంతా ప్రధానోపాధ్యాయునికి తెలిపింది. అత డప్పటి కేదో పై మెఱుగులు దిద్ది పంపాడు. కాని, దుర్మార్గునికి తగిన శాస్తి జరుగలేదు. ఆ విషయమై ప్రసన్న అంతటితో వదలక, స్కూలులోని విద్యార్థినుల నందఱిని ఒక సంఘముగా చేర్చి ఆ దుశ్చర్యను ప్రతిఘటిస్తూ, దుర్మార్గుడైన ఆ విద్యార్థిని తగినరీతి దండించాలని సమ్మె జరిపింది. కడకా విషయం నారాయణరావువంటి పెద్దల నోటీసుకు వచ్చింది. అప్పుడు హెడ్మాష్టరు జాగ్రత్తపడి, తగిన విచారణ జరిపి, దుర్వర్తనుడైన విద్యార్థిని డిస్మిస్ చేయ పూనుకొన్నారు.

కాని, అందులోకూడ ప్రసన్న దయ చూపింది. డిస్మిస్ చేయబడితే పాపమా విద్యార్థి భవిష్యత్తే పాడైపోతుంది. అతనిపై ఎంతో ఆశ

ఉంచుకొన్న తల్లిదండ్రులగతి దుఃఖమయమౌతుంది. కాబట్టి యికముం దెప్పుడు అలాంటిపనులు చెయ్యకుండ తగినరీతి హెచ్చరిస్తే చాలు"నని ఆమె, తన సంఘంతోబాటు హెడ్మాష్టరునకు నచ్చచెప్పింది. అందరు ఆమె ఔదార్య సద్భావాల కాశ్చర్యపోయారు.

గొప్ప శ్రీమంతుల యింటిబిడ్డ ఎంతో గర్వంగా, నిర్లక్ష్యంగా వర్తిస్తుంది కాని, యింత నిరాడంబరంగా, నిర్భయంగా పరోపకారపారిణియై పాటుపడుతూ వుండే ఆమెనుగురించి అంతా ఒక కథగా చెప్పుకొనేవారు. విద్యార్థులలో రామమోహనుడు, విద్యార్థినులలో ప్రసన్న అనేక విషయాల్లో కళాశాలకు తలమానికలయ్యారు ఆ దినాల్లో.

ఈయేడు ప్రసన్న పి. యు. సి. లోను, రామమోహనుడు బియ్యే లోను ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. నారాయణరావు కొడుకును లా కాలేజీలో చేర్పి నాల్గుసూసాలైంది. ఇంకా తాను చదవడాని కేలాటి అభ్యంతరం లేకపోయినా, అన్న కాలేజీలో లేకపొయ్యేటప్పటికి ప్రసన్న ఒంటరిగా పొయ్యేందు కిష్టపడక కాలేజీ వదిలేసింది. అందు కామె ఉపాధ్యాయు లందరు చాల బాధపడ్డారు.

ఆమె ఇంటివద్దనే స్వంత లైబ్రరీలో పుస్తకాలు చదువుతూ, సంగీతపాఠా లభ్యసిస్తూ, తల్లికి చేదోడు వాదోడుగా కాలక్షేపం చేయసాగింది. సాయంకాలం గురువువద్ద ఆమె వీణ నభ్యసిస్తూ, తన సహజమైన ముగ్ధమోహన రూపముతో కలకంఠమెత్తి పాడుతూవుంటే విన్నవారందరు 'హాయిహాయి' అంటూ వుండేవారు. నారాయణరావు దంపతులామె విద్యావినయ రూపలావణ్యాదుల కెంతో మురిసిపోతున్నారు. ఈలాంటి బిడ్డనుచూచి సంతోషించే భాగ్యంలేక, కొన్నాళ్ళు భార్యావియోగ దుఃఖాన్ని చిక్కబట్టుకోలేక వెళ్ళిపోయాడే ఆమె తండ్రి సోమసుందరరావున్నివారు విచారించని దినమేలేదు.

# 12

ఎవరో వచ్చారని నౌకరు చెప్పడంతో నారాయణరావు కచేరీగదిలోకి వెళ్ళాడు.

వచ్చినవారు కౌన్సిలర్ మాదన్నపంతులు, కంట్రాక్టరు కలందర్ సాహేబు. వారికి ఛేర్మెన్‌గారు స్వాగతంచెప్పి కూర్చోమన్నారు ?"

"విశేషా లేమో మిత్రులు చాలా దూరం వచ్చారు.

"ఎలెక్షన్‌తేదీ సమీపిస్తూంది. బలాబలాలు చూచుకోవలెకదండీ. ఎప్పటికప్పుడు జరిగే సంగతులు తమకు తెలుపడం నా ధర్మం."

అని మాదన్నపంతులు ఛేర్మెన్‌గారిమీద తనకుండే అభిమాన సూచకంగా ఉపోద్ఘాతం ప్రారంభించాడు.

"మంచిమాట. మీ వార్డులో మన విషయమై బలహీనతకు అవకాశం లేదుకదా ?"

"అలాంటిది మీరు కలలోకూడ అనుకోకండి, సార్. పోతే, ఇన్నాళ్ళుగలేని యీ రెడ్ల ప్రచారంమాత్రం కొంత ప్రారంభమైంది. అయినా భయంలేదు. నేను, యీ కలందర్‌సాహేబు వేయి కండ్లతో చూచుకొంటున్నాము. మా వార్డులోని ఓట్లసంఖ్య 1095. అందులో కనీసం మూడుపాళ్ళు మీవి. ఖచ్చితంగా నమ్మండి.

"అన్నట్టు కలందర్‌సాహేబుగా రేదో కంట్రాక్టుపని చేస్తున్నారు కదూ ?"

వెంటనే సాహేబు అందుకొన్నాడు.

"సిత్తం, సిత్తం. తమర్కి నా సంగతి తెల్సు. నిరుడు

మీ ఆఫీస్కు కావలసిన ఫర్నిచర్ కంట్రాక్టుపని అంతా నా అడీసూయిషీలో నడిచింది, సార్."

"అవును. జ్ఞాపకముంది. ఇప్పు డేదైన కంట్రాక్టుపని చేస్తున్నారా ?"

మాచన్నపంతులు వచ్చిందే సాహేబుకొరకు. అందువల్ల పంతులందుకొన్నాడు.

"మనము క్రొత్తగా మంజూరుచేసిన హైస్కూలు కట్టడంపని తాలూకు కంట్రాక్టుపనికి సాహేబు కాచుకొని ఉన్నాడు, సార్."

"అందుకై ఎంత మంజూరు చేశామండీ ?" జ్ఞాపకం లేనట్లు ప్రశ్నించాడు ఛేర్మెన్.

"రెండు లక్షలు."

"అవునవును. మనము మొదట టెండర్లను రప్పించుకోవలెకదా ? తరువాత నిర్ణయం."

"టెంటర్లకేమిలెండి. పంపడాని కెందరో సిద్ధంగా వున్నారు. అందులో వీరిది ఒకటి."

"కానిండి. చూద్దాం"

"చూద్దాం అంటే ఎట్లా, సార్? మీరు మాకు అభహం ఇయ్యాలి." కలందర్ తన కోర్కెను తెలుపుకొన్నాడు.

"ఇప్పు డెట్లా అభయ మిచ్చేది ? రెండు లక్షల కాంట్రాక్టు — మాటలలో ఎట్లా చెప్పేది ?"

"మాటల్లో వద్దులెండి. మూట లున్నాయిగా ?" అని మెల్లగా నసిగాడు మాదన్నపంతులు.

"........................................"

"ఏలాగైన తాము కలందర్‌సాహేబు టెండరు నంగీకరించాలి. అతడు యిష్టప్రకారం నడచుకొనేందుకు సిద్ధంగా వున్నాడు.

ఛేర్మెన్ మాట్లాడలేదు. అలవాటుకొద్ది చెయ్యి మీసం సవరిస్తూంటే దృష్టులు శూన్యంలోకి చూస్తున్నాయి. మనసప్పుడే యేదో ఆలోచనలో పడిందనేందు కది సూచన. 'దేవుని సత్యం పూజారికెరుక' అన్నట్లు చిరకాల పరిచయంవల్ల మాదన్నపంతులకు తెలుసు నారాయణరావు హావ భావాల కర్థం.

"సరే, టెండరు పంపండి" అన్నారు కడకు ఛేర్మెన్.

"ఇప్పుడే ఏదో తీర్మానం చెయ్యాలి, సార్" అని ప్రాధేయ పూర్వకంగా కలందర్‌సాహేబు అడిగాడు.

"అంటే, మీ అభిప్రాయం?" అని కొంత తీక్ష్ణంగా చూచాడతనివైపు ఛేర్మెన్. ఆ నటన కర్థం మాదన్నకు బాగా తెలుసు.

"అతని అభిప్రాయ మేముంది, సార్? తమ పర్సెంటేజి తమకు చెల్లింపబడుతుంది.

"అది అందరు చేశేపనేగా?" అనేశాడు తేలిగ్గా ఛేర్మెన్.

"అందరికంటె సాహేబుగారి దొకటి ఎక్కువ."

ఛేర్మెన్ అసంతృప్తితో పెదవి విరిచాడు. అయినా మాదన్న పంతులు చేసిన కనుసన్నను గ్రహించి సాహేబు జేబులోనుండి పదిహేను వేల రూపాయల కట్టను తీసి నారాయణరావు ఎదుట వుంచి సలాంచేసి నిలుచున్నాడు.

ఇందులో నారాయణరావుకు క్రొత్తయేమి లేదు. కందెన లేనిది బండి కదలదనేదే అతని పద్ధతి. అందరికి తెలుసు నా చిదంబరరహస్యం. అత డూరిలో ప్రజాద్వేషి కావడానికి లంచగొండితనమే ప్రధాన కారణం అందుకే మాదన్నపంతులు, సాహేబు అంత చొరవతీసికొన్నారు.

# 13

భార్యా భర్త లిద్దరు ఏదో సరదాగా మాట్లాడుకొంటూ ఉన్నా వాస్తవికాలను గురించే చర్చించు కొంటున్నారు.

శ్యామసుందరి దొక పక్షం—నారాయణరావు దింకొక పక్షం. ఈ రెంటికి యీ యుగంలో కలయిక చేకూరడం అసంభవమని యిద్దరికి తెలుసు. ఆమె చెప్పినట్లు వృద్ధులలోని అనుభవము, యువకులలోని ...ము.... యీ రెండు మేళవించితే ఫలితం తప్పకుండా లోక కళ్యా...దారి తీస్తుంది,

కాని, యిరువురి మధ్య విలయతాండవం చేస్తూ వుంటే స్వార్థ... అణచేదెట్లా? అది తానై తాను అణగిపోదు. కాలం గడిచే ...బలమింకా హెచ్చైపోతూంది. దాన్ని రూపు మాపేశక్తి ...న నాడే 'ప్రగతి' సుసాధ్యము.... అంతవరకు సంఘములో ఈ ...తప్పదు.

నారాయణరావునకు ప్రత్యర్థిగా నిలచిన నిరంజనరెడ్డి నూతనంగా వకీలు పట్టాన్ని పొంది రంగపురం డిస్ట్రిక్టు మునసబు కోర్టులో ప్రాక్టీసు నారంభించిన యువకుడు. అతడేమి అంత డబ్బున్నవాడు కాదు. యువక మిత్రులే అతనికి మద్దత్తయి నిలిచినారు. నిజానికి నారాయణరావుయొక్క మితి మీరిన స్వార్థపరత్వమే రంగపురములో ఈ క్రొత్త పార్టీ పుట్టడానికి కారణమైంది. పైగా యువకులలోని ఉత్సాహము కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తూంది. అధికార చక్రాన్ని బట్టి నడిపించాలనే కుతూహలం వారిలో విజృంభించిపోయింది.

పాత రోత క్రొత్త వింత కదా! నారాయణరావు నింక ఫర్వెన్

పడిపోసాగారు. సామాన్య ప్రజలలో విజ్ఞాన వికాసం కలిగేకొలదీ, స్వార్థపరులలోని ఆశాపిశాచము విలయతాండవం చేయదొడగింది. జనులలో యుక్తాయుక్త విచక్షణాబుద్ధి తలఎత్తింది.

"ఛైర్మెన్ లంచగొండి. అతిస్వార్థపరుడు" అని రంగపురములో ఆబాలవృద్ధులకు తెలిసిపోయ్యింది. అతని నెదిరించే సాహస మీసారి విద్యావంతులైన యువకులలో జనించింది. అయినా, నారాయణరావు వారిని ఖాతరుచేయకున్నాడు. "నిన్న మొన్న కళ్ళు తెరచిన యీ కుర్రకుంక లొక లెక్కా నాకు?" అనే ధీమాతో వున్నాడతను. అతని కంటె స్వార్థపరులై, ఏ యెండ కా గొడుగు పట్టే విద్యలో ఘటికులైన వరదరాజులాంటి అవకాశవాదుల పొగడ్తలతో నారాయణరావు మరింత గ్రుడ్డివాడై తన చుట్టుపుట్టి, వ్యాపించే నూతన వాతావరణాన్ని గుర్తించలేకున్నాడు. అతన్ని "ఇంద్రుడు, చంద్రుడవని పొగడేవారందరికి తె[illegible] యీసారి గెలుపు మునుపటివలె అంత సులభమైనది కాదనీ. వారే విశ్వాసపరులని, వారు చెప్పేదంతా నిజమని, వారే [illegible] విధాల అండదండలని నమ్మి అతడు వారి పచ్చిమోసాలకు లోనై, మంచినీళ్ళప్రాయంగా ఖర్చు చేస్తున్నాడు.

భార్య ఎప్పుడీ సంగతినిగురించి హెచ్చరించవచ్చి[illegible]
వామెను దబాయిస్తూ "నీకేమి తెలుసు, శ్యామా [illegible]
వ్యవహార మనుకొంటివా బెదరిపారిపోయేం[illegible]
కైవశం చేసుకొన్నారంటే వా[illegible]
సులువుగా తప్పుకోవలసి[illegible]
మంటావా?" అని[illegible]

ముతో. అత దేమన్నా సరే అని తన పట్టు మానకుండా శ్యామసుందరి యింకా బోధిస్తూనేవుంది యీలాగని.

"అప్పే - నే ననేది ఆమాట కాదండీ. కాలాలు మారిపొయ్యాయి ప్రతియొక్కరు ఏదో 'ప్రగతి - ప్రగతి' అని కలవరిస్తున్నారు. యువ లు వెర్రిగా ముందుకు దూకుతున్నారు. మంచో, చెడ్డో ఒక్కమారు చూస్తే వారి సత్తా ప్రజలకు, ప్రజలసత్తా వారికి అర్థమౌతాయి. తరువాత మీలాంటి అనుభవజ్ఞులే సంఘానికి శరణ్యులౌతారు."

"నీ వనేవి ఒకరీతిగా మంచివేకాని, ఇప్పుడు వారంత సుళువుగ తమ పొరబాట్లను గ్రహించే స్థితిలో లేరుసుమా. చేసేవి తప్పులే అయి వాటినే సమర్థించుకొంటూ, తామే దేశోద్ధారకులమని విర్రవీగిపోతున్నా అధికారాన్ని ఒక్కమారు వారిచేతుల్లో పెట్టామా, దాన్ని మావంటివాళ్ళు మరల పొందలేరు."

"పొందకపోతే పోనియ్యండి. రాజ్యం వారిదే కానియ్యండి. వారికైన పొరబాట్లు సహజమేకదా? క్రమ క్రమంగా వారికే యి మంచి చెడుగులు."

అలోగా దేశం ఏగతి పడుతుందో నీకు తెలుసా?"

గని ఏకాలానికి యువకులు ముందుకే రాకూడదనా మీ అభి

వాళ్ళే అధికారం వహించాలంటారా?"

చ్చిన గొడవ? నీపని నీవు చూచుకోరాదూ?"

మీతో తర్కానికి రాలేదు. సంగ

కొత్త శక్తి బయలు

— చ.కాన్ని

"వారి ఉత్సాహం, మీలాంటివారి అనుభవం.... రెండు

"అదెట్ల వీలౌతుంది? రెండు కత్తులొక ఒరలో యిముడు

"మీరు ప్రక్కకు తప్పుకొని, వారిని గద్దె నెక్కించి, సరి దారిలో నడిపించండి."

"బాగా చెప్పావు. ఆ రీతిగా చేయగలిగితే అందరి కంటే ముందు నేనే ఆ పని చేస్తా. కాని, యీ యువకుల కంత విశాల దృష్టి లేదు, శ్యాము! ఒక్కమారు అధికారాన్ని పొందారా, వారింక మాలాం[illegible] వాళ్ళను లక్ష్య పెట్టరు.

"అధికార గర్వం అందరికీ వుంటుంది కదండీ మో[illegible] ఢక్కాముక్కలు పడితే అందరు సరిపోతారు."

"ఇంతకు నీవిప్పుడు చెప్పేది నను ప్రతి పక్షం వారికి పొమ్మనడమే కదూ?"

"[illegible]

కాసులదండ

పదవి నుండి తప్పించేదే బాగనిపించింది చాలా మంది కి
పురములో....

అధికారాన్ని, ధనబలాన్ని, దర్పాన్ని చూచి జనులు జంకే కాలం దాటి పోయింది. ప్రజలు తమ హక్కు భుక్తాలకోసం పెనగులాడు తున్నారు. వారిలో నవ చైతన్య ముదయించింది. అన్ని వర్గాలలోను ఉత్సాహం ఉరకలేస్తూంది.

అనుభవము లేక యువకు లెక్కడ పరిపాలనా రథాన్ని దారి తప్పించి బోల్తా కొట్టిస్తారో అని, కేవలం స్వార్థ దృష్టితో కాకపోయినా ప్రజా క్షేమ మెంచి, అధికారాలను వదలుకొనేందు కొక వంక వృద్ధులు తికమక పడుతూ వుంటే వారిని స్వార్థపరులుగా నిందిస్తూ వై...గి ...మ్మని, తమకు కూడ పరిపాలనానుభవం కలిగే అవకాశ ...యువకు లింకొక వంక గోల పెట్టుతున్నారు.

ఇదంతా ఒక సంధి యుగం— ప్రాత, క్రొత్తల సంధి మిగిలేది క్రొత్త రకమే. అయినా, వృద్ధు లూరకుండ... నరికట్టానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు.

నిరంజనరెడ్డి స్వతంత్ర పార్టీ సభ్యు... విద్యార్థి దశనుండి రాజకీయాల్లో తల దూర్చి ప్ర... ...కా... ...స్థి... బాగా ఆకళింపు చేసుకొన్నాడు. అతడు లోపల కాంగ్రెస్ పక్షాభిమానియే అయినా ఆ పార్టీకెందుకో రంగపురములో ప్రజా బలము తగ్గిపోతూ వుండటం గ్రహించి, యితర పార్టీలలో విశ్వాసం లేక, తాను స్వతంత్రుడని చాటుకొన్నాడు, ఈ పార్టీవారి స్వాతంత్ర్యము నేతి బీరకాయలోని నేతి లాంటిది. గబ్బిలాల్లాంటివారు వీరు. కడకు ఏదో ఒక పార్టీతో చేతులు కలుపక పోతే వీరికి రాజకీయాల్లో వ్యక్తిత్వం లేదు.

నిజాని కీసారి రంగపురంలో జరిగే ఎలెక్షన్‌లో రాజకీయ పార్టీల

ఖ్యాత లేదు. నారాయణరావును, అతని దర్పాన్ని వ్యక్తి చూచి ఓర్వలేని వాళ్లు, అతని లంచగొండి తనాన్ని చూచి సహిం సని వాళ్ళు, నిరంజనరెడ్డి పక్షాన్ని బలపరుస్తున్నారు.

వరదరాజులాంటి వారు సమయ సందర్భాలు గమనించి, ద్విపాత్రా భినయనముతో, అవకాశాన్ని వృధా పోనియ్యకుండ, ఉభయపార్టీలతోను జేబులు నింపుకొనే ప్రయత్నం చేస్తున్నారు.

తాను ఆగర్భ శ్రీమంతుడై వుండి కూడా, తృప్తిలేక అంతులేని దురాశతో తుదకొక చిన్న ఉద్యోగము కొరకు తన్ను సమీపించే బీదవాడు దలుకొని గొప్ప కంట్రాక్టరు వరకు అందరి వద్ద లంచాలు గుంజుకొనే వల్ల నారాయణరావు చాలా వరకు జనద్వేషి అయ్యాడు. కాని, ఉన్నంతవరకు ఎవ్వరిని 'నీవలాంటి వాడు' వని ఎవరు పరు. అధికారాంత్యమునందే కదా ఆ యయ్యా పస బయట లసింది? ఎదుట భూషించే వారే వెనుక దూషిస్తారు.

ప్రజలలోని అసంతృప్తవల్లనే ప్రతి పక్షానికి బలం చేకూరుతూంది. స్వాతిశయపరుడు, అధికారరోగపూరితుడు అగు నారాయణరావుకు తన కాళ్ళ క్రిందనే, తాను నమ్మినవారే త్రవ్వే గోయి కనబడలేదు. ఎదుటివారి పార్టీబలాన్ని గురించి గోరంతలు కొండంతలు చేసి చెబుతూవుంటే, వారి మాటలను నమ్మి, యీసారి ఎంతయినా ఖర్చుచేసి తన పదవిని నిలుపుకోవా లని విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

ఇప్పుడిప్పుడే తలయెత్తే రాజకీయ నాయకుడైన నిరంజనరెడ్డి తెలిపే నిస్వార్థ నీతులను నమ్మినట్లు, 'ముసలి నక్క' అనిపించుకొన్న నారాయణ రావు ప్రచారాని అంతగా నమ్మేవారు లేరిప్పుడు రంగపురంలో. అతడిప్పుడు అవకాశవాదుల పాలిటికి గంగగోవై డబ్బును మంచినీళ్ళ ప్రాయంగా వెదజిమ్మి, ప్రజానురాగాన్ని వెల కట్టబోతున్నాడు. మున్నెప్పుడు చేయని

ధానధర్మాల నిప్పుడు రంగపురములో చేసి ప్రజాహితుడని పించుకోవాలని తహతహ పడుచున్నాడు. మునిసిపల్ కౌన్సిలర్ల సహాయ సానుభూతులను కోరి వారి సలహాల ననుసరిస్తూ, ఎన్నో అభివృద్ధి ప్రణాళికల నామోదిస్తూ, వారినందరిని తనవారిగా చేసుకోవలెనని ప్రయత్నిస్తున్నాడు. ఎదుటి పక్షం వారు వీనినన్నిటిని "ఎలెక్షన్ స్టంట్స్" క్రింద ప్రచారం చేస్తూ ప్రజల 'మోసపోకు' డని హెచ్చరిస్తున్నారు.

గోముఖ వ్యాఘ్రాలు యిటీవల నారాయణరావు మనస్థి పాడు చేస్తున్నారు. తన నిరంకుశాధికారాన్ని ఎదిరించే పార్టీ దేరింది కదా యని యతడు, ఆ పార్టీ అనుయాయుకుల నం శత్రువులుగా భావిస్తున్నాడు. అతడీసారి ఎలెక్షన్లలో నిలబడడం కొడుకు రామమోహనునికి ఎంతమాత్ర మిష్టము లేదు. ఆమె చెప్పవ దంతా చెప్పింది. కాని, అతడు వినే స్థితిలో లేడు. మద్రాసులో ఉ కొడుక్కి వ్రాసింది తక్షణం రమ్మని. రామమోహనుడు వచ్చి తల్లి చెప్పిన దంతా విన్నాడు. ఆమె వాదనే సమంజస మనిపించిం దాతనికి కూడ. అయితే తండ్రికి నచ్చచెప్పే దెట్లా? తల్లికొడుకుల కిది విడదీయరాని చిక్కు సమస్యగా ఏర్పడింది.

ఒకవేళ ఎన్నికల్లో గెలుపు లభించినా అది అనేక మందితో స్పర్థ సంపాదించి, అనేక వేల రూపాయలు వెదజల్లుకొన వలసిందే కాని, వెనుకటి వలె సులభసాధ్యం కాదు. లేదా – కీడెంచి మేలెంచిన ఓడిపోతే – అంతకంటే అవమాన ముందా? పరువు నష్టం – ధననష్టం – శాంతి నష్టం – అంతా నష్టం బాపతే!

పోని, యింతపట్టుపట్టి అందులో గెలవవలసిన అవసర మేమొచ్చింది తనకు? ఛెర్మెన్ పదవి లేకపోతే తన దర్పానికి, ధనానికి, గౌరవానికి లోటేమైన ఉంటుందా? అలాంటిదేమి లేదు, నిజానికి, ఛేర్మెన్ నారాయణ

రావు కంటే, ఛేర్మెన్ కాని నారాయణరావే ప్రజాదరణకు పాత్రుడు కాగలడు.

చిన్నవాడైన రామమోహనుడి పూర్వాపదముల నన్నిటిని చక్కగా ఆలోచించాడు. అయినా, తన మాటనుకూడ తండ్రి లక్ష్యపెట్టడని ఆతనికి వచ్చిన రెండు దినాలు మోహను దూరికో తిరిగి అందరితోను ాటం లేకుండ మాట్లాడి ప్రజాభిప్రాయాన్ని కనిపెట్టాడు. జనరెడ్డిలాంటి యువకుల సానుభూతినికూడ సంపాదించాడు. ్మైనదల్లా ఒక్కటే – ఈసారి 'ఛాన్సు'ను ఎదుటి పార్టీవారికి ిడమే వివేకం.

ఎట్లయినా కానిమ్మని రామమోహనుడు తండ్రితో యీ విషయాలన్నీ ంగా మాట్లాడాడు.

కాని, నారాయణరావు దొక్కటే పట్టుదల. తా బట్టిన కుందేటికి మూడుకాళ్ళంటున్నా డతడు. కొడుకు చెప్పినదేది అతని తలకెక్కలేదు. పైగా ప్రపంచానుభవములేని పెండ్లాము, కొడుకు తనకు బుద్ధిచెప్పవచ్చారని ఇద్దరినోళ్ళు మూయించాడు. వలదని చెప్పినదంతా శతించిపోయాడతడు. వారే తనకు శ్రేయోఘాతకులట! వరదరాజులాంటివారే శ్రేయోస్కాము లట! మూర్ఖపద్ధతి యీలాటిదేకాబోలు – ఇది వినాశకాలానికి ప్రతివానికి పుట్టే విపరీతబుద్ధి.

ఊళ్ళో గొప్ప జ్యోతిష్కుడని పేరుకాంచిన తాతాచార్యులను పిలిపించి ఒకనాడు "ఏమండీ, ఆచార్యులూ! ఈసారి నాకు ఎలెక్షన్‌లో గ్రహబల మేలాగుంటుందో చెప్పండి?" అని అడిగాడు. అత దేనాడు ఒకరి నిట్లడిగినవాడుకాడు.

వైద్యులు, జ్యోతిష్కులు సాధారణంగా ఉన్న దున్నట్టు చెప్పే రకం కాదు. ఒకవేళ యేదైన ప్రమాదావస్థ ఉన్నదని తెలిసినా ఏదో తల్చి

మాట్లాడీ "అది చెయ్యండి మేలౌతుంది. ఇది చెయ్యండి మంచిదౌతుంది" అని చెబుతారేకాని పుల్ల విరిచినట్లు మాట్లాడేవారు చాల అరుదు.

తాతాచార్యులు అరచేతిలో వైకుంఠం చూపించినట్లు మాట్లాడినంత సేపు మాట్లాడి, తుదకు ఒక చిన్న గ్రహం కొంత అడ్డంగా ఉందని నవగ్రహ పూజాదులను చికిత్సగా చెప్పిపోయినాడు. "సరే – తప్పేమి? దైవారాధన. పరంధామయ్య వూళ్ళో లేడు. వచ్చాక చేయిద్దా" మనింది శ్యామసుందరి. నారాయణరావు తాతాచార్యులను బాగా సత్కరించి పంపాడు.

మరియొకనాడొక బైరాగి భిక్షని కొచ్చాడు వారింటికి. ... సరిగ నారాయణరావు ఎందుకో మొదటి గేటువద్ద ఉండడం తటస్థి... ఈ భిక్షకులకు బాగా తెలుసు ఎవరి నేరీతిగా మభ్యపెట్టడం, గృహప... గుర్తించి ఏవేవో ఆగతా నాగతాలను గురించి గుక్క త్రిప్పుకోకు... చెప్పసాగాడు బైరాగి.

మరొక్కప్పుడైతే నారాయణరావు యీలాంటివారిని నోరెత్తించే వాడు కాదు. కాని, ఇప్పుడు తానున్న పరిస్థితుల్లో "ఏ పుట్టలో ఏపా ముందో ఎవరు చెప్పగలరు? ఈ సాధువులదగ్గర ఏవో వశీకరణశక్తు లుంటాయట!" అని వానిని తోటలోనికి పిలుచుకొనిపోయి "ఏమయ్యా, నేనొక పెద్ద పనికి పూనుకొన్నాను. అది అవుతుందా? లేదా?" అని ప్రశ్నించాడు. ఎన్నటికి లేని పిచ్చి ఇతని కేనా దేమకు కలిగిందా అని నౌకర్లు దూరదూరమునుండి చూస్తున్నారు. ఇంట్లో శ్యామసుందరి మొదలైనవారు మెల్లిగా నవ్వుకొన్నారు.

దొరికిన అవకాశాన్ని సద్వినియోగపరచుకొనే తెలివిగల ఆ బైరాగి వెంటనే వాగ్ఘరినిపెంచి, అంతా అనుకూలంగానే చెప్పి, కట్టకడకు యంత్రమొకటి వేయించుకొండీ జయము శతస్సిద్ధమన్నాడు. యజమాని

కానిమ్మన్నాడు. అందుమూలాన ఆ బీదవానికి ఐదురూపాయలు, పాత పంచె, ఒక చొక్కా లభించాయి.

ఇది యీలోగా నారాయణరావుకు పట్టిన పిచ్చి. ఎప్పుడు చూచిన ఎలెక్షన్ ప్రసంగమే. ఎప్పుడు తనకు జయం కలుగాలన్న కోరికే. ఎలెక్షన్ దినము దగ్గర పడేకొలది ఎన్నడులేని బీదసాదలమీద దయ, మంత్ర తంత్రాలమీద నమ్మిక, దైవభక్తి ప్రబలిపోసాగాయి.

ఈ సంగతులన్నీ కర్ణాకర్ణిగ విన్న ఎదుటి పార్టీవారి కంతా వేళా కోళంగా ఉంది.

# 14

పదినాళ్ళుగా వూళ్ళో లేనట్టు నటించిన పరంధామయ్య సోమవారం ఉదయం నారాయణరావును చూడవచ్చాడు. భార్యా భర్త లిద్దరు అతన్ని సంతోషపూర్వకంగా ఆహ్వానించారు. "ఏమండీ, ఎంతవరకు ఫలించింది మీ ప్రయత్నం?" అని అడిగాడు నారాయణరావు. శ్యామసుందరి అతని ప్రక్కనే సోఫాలో కూర్చునివుంది పరంధామయ్య యేదైన సంతోషవార్త తెచ్చాడేమో విందామని.

"పదిరోజులయ్యింది ఊరు విడిచి, రాత్రే వచ్చాను. ఇంకా ఎక్కడ తగిన సంబంధం కుదురలేదండీ" అని పరంధామయ్య ఏదో ఘనకార్యంచేసి అలసినవాడిలాగా మాట్లాడాడు.

"ఎక్కడికి వెళ్ళివచ్చారు ఈలోగా" అని శ్యామసుందరి ప్రశ్న.

"బెంగుళూరు, మైసూరు వెళ్ళివచ్చానమ్మా. నాకు పరిచయమున్న కొన్నిచోట్లకు పోయివచ్చినాను. ఏదో ఒకరిద్దరున్నారనుకోండి. ధన

ముంటే విద్యలేదు. విద్యవుంటే ధనములేదు. ఈ రెండు వుంటే గుణంలేదు.

"సరే బాగుంది." శ్యామసుందరి రుత్సాహంతో పెదవి విరిచింది.

"చూడండి, పరంధామయ్యా. ధనలోప మొక లోపంకాదు. దానిని మనము సరిదిద్దుకోవచ్చు, విద్య, గుణము, రూపము – వీనినే మనము ముఖ్యంగా చూడాల్సింది."

"చిత్తం, అదే ఆలోచిస్తున్నాను."

"ఎవరో ఒకరిద్ద రన్నారే. ఎవరు వారు ?"

"బెంగుళూరులో శ్రీపతిరావుగారని ఒక వకీలున్నారు. గొప్ప శ్రీమంతులు. పేరుప్రతిష్ఠలు కలవారు. అతని కిద్దరు కొడుకులు. పెద్దబ్బాయి కప్పుడే వివాహమయింది. చిన్నవాడు బియ్యే ప్యాసయ్యాడు. తండ్రి అతన్ని బారీష్టరుకోర్సుకని ఇంగ్లండుకు పంపగోరుచున్నాడు."

"మంచిదే, తప్పేమి ?"

"అతని చదువుఖర్చునంతా పిల్ల నిచ్చేవారే భరించాలని వారి కోరిక."

"కావచ్చు. అభ్యంతరములేదు.

"అయితే పిల్లవాడు మన అమ్మాయికి తగినవాడేమో మీరే యీ ఫోటో చూచి చెప్పండి."

అని ఒక ఫోటోనుతీసి వారికి చూపాడు పరంధామయ్యా. ఇద్దరు దాన్ని అన్నివైపుల త్రిప్పిచూచి పెదవి విరిచారు.

"అందుకే మొదటే చెప్పానుగా ఇంకా తగినవాడు దొరకలేదని.

"సరే, మరొకరెవ్వరు ?"

"ఈ ఫోటోను చిత్తగించండి."

అని మరియొక ఫోటోను తీసి ఇచ్చాడు వారికి.

"అబ్బాయి బాగానే వున్నట్టుంది" అని సణిగాడు నారాయణరావు. దాన్ని పరిశీలించి, శ్యామసుందరికూడ 'అవు' నన్నదా మాటకు.

"గొప్ప శ్రీమంతులబిడ్డ అతడు" అన్నాడు పరంధామయ్య.

"ఊ....తరువాత?"

"అయితే, చదువుమాత్రం సామాన్యం - యస్. యస్. యల్. సి."

"ఛా - ఏటి సంబంధం? అయినా, ఇంకా ప్రయత్నించండి. ఆ భారమంతా మీదే. అమ్మాయికి తగిన భర్తను భగవంతు డెక్కడ సృష్టించాడో వెదకండి" అని నారాయణరావు లేచిపోయాడు.

తరువాత కొంతసేపు గృహిణితో మాట్లాడి పరంధామయ్య సెలవు పుచ్చుకొన్నాడు.

పరంధామయ్య చెప్పిందంతా పచ్చి అబద్ధం. అత డేవూరికీ పోలేదు. ఎవరి సంగతి విచారించలేదు. తెచ్చిన ఫోటోలుకూడ సమయాను కూలానికి సంగ్రహింపబడ్డాయి. ఈలాంటి కట్టుకథ లల్లేదాంట్లో అతడు మహాప్రవీణుడు. ఈ పెండ్లిండ్ల విషయములో అత డిదివరకే ఒక నిశ్చయానికి వచ్చాడు. కాని, నారాయణరావుతో కడసారి అంతా చెప్పి ఒప్పించేందుకు ముందు ఉపోద్ఘాతంగా యీ తతంగం జరుపుతున్నాడా బ్రాహ్మణుడు.

* * *

సెప్టెంబరు 20 వ తారీఖు రంగపురములో మునిసిపల్ ఎలెక్షన్ జనము - నే డప్పుడే ఐదవతేది.

ఎటు చూచినా ఎలెక్షన్ ప్రచారాలు ముమ్మరంగా సాగిపోతున్నాయి. ...సలాలో అభ్యర్థులపరంగ వారి వారి అనుయాయకులు

కాసులదండ

కొబ్బరికాయలంత అక్షరాలతో "మీ ఓటును దయచేసి..................గారి కివ్వండి" అని అభ్యర్థిస్తూ, పటాలు, ప్రకటనలు ప్రేలాడగట్టారు. సినిమాల్లో స్లైడ్సు చూపబడుతున్నాయి. కరపత్రాలకు కరవేలేదు. ఎవరి పార్టీని వారు సమర్థించుకొంటున్నారు. అభ్యర్థులు తమకు అనుకూలమైన వార్డులలో దినమొకచోట మీటింగులు జరుపుతూ, తమునంతాము పొగడుకొంటూ, ప్రత్యర్థులను నిరసిస్తూంటే, వారు చేశేదంతా గోలగా కనిపిస్తూవుంది. తెల్లవారింది మొదలు లౌడ్‌స్పీకర్ల మోతతో ఊరంతా మారుమ్రోగి...

అవకాశవాదులకు, దురాశాపరులకు మంచి తరుణము. కొన్ని వార్డులలో అభ్యర్థులు ప్రతి... వలసిన దుస్థితి ఏర్పడింది. "అయ్యా, కొంప కాలిపో... యిల్లు కట్టుకోవాలి. కాస్త సహాయం చెయ్యండి" అని అర్థించిన... కసరికొట్టిన పెద్దమనుషులు, "ఉత్తమమైన గ్రంథం వ్రాశానండి. ముద్రణకు సహాయం చెయ్యండి" అని అడిగిన రచయితను వెక్కిరించిన మెరమెచ్చుల దాతలు, జీర్ణోద్ధరణ అవుతుంది. ఈ దేవాలయ పునర్నిర్మాణానికి పదిరూపాయలు చందా వియ్యండి" అని ఆసించిన ఆస్తికుని చీవాట్లు పెట్టి పంపిన ధర్మకర్తలు, "మా వూళ్ళో ఆస్పత్రి కట్టించుకొంటాం. ఏమైన తోచిందివ్వండి. బాబూ!" అని వేడుకొన్న పల్లీయులను తూలనాడిన మహాపురుషులు—ఇప్పుడీ ఎలెక్షన్‌లకని డబ్బును మూటలు కట్టుకొనివచ్చి, "మీకు ఓటునిస్తా మన్నవారికి చేతినిండా రొక్కం క్రుమ్మరించి పోతున్నారు."

ప్రజలుమాత్ర మంత అమాయకులా? ఓటుయొక్క విలువను మఱచి, అది దొరికిన మరుదినమునుండే దాన్ని దుర్వినియోగ పరచే అభ్యర్థుల మతా బయలు దేరాక, ఆ ఓటుయొక్క పవిత్రతను గణించవలసిన అగత్యం ఓటరు కేమొచ్చింది? ఓటుకు పదిరూపాయలైతే-ఇంట్లో

పదిమంది ఓటర్లుంటే – సునాయాసంగా వందరూపాయలు గడించవచ్చునని వారికేమి తెలీదా? కాబట్టి, యీ బంగారులాంటి అవకాశాన్ని పోగొట్టుకోకుండ, వీలైనంతవరకు అభ్యర్థుల్ని మభ్యపెట్ట మా వార్డు అంతా మీదే అని అరచేతిలో వైకుంఠంచూపి, మాటలులాగి మరొక విధంగా జీవితములో తీర్చలేని పాతబాకీలను తీర్చుకోగలిగారు కొందరు ప్రబుద్ధులైన మధ్యవరులు.

మాదన్నపంతులులాంటి స్వలాభపరుల మాటలువిని జయలక్ష్మి వరిస్తుందని నారాయణరావు విచ్చలవిడిగా ...న్నాడు. చూడబోతే యీ ఎన్నికలు ముగిసేటప్పటి ...బదివేలు ఖర్చవుతుందని భార్యాపుత్రు లప్పుడే లెక్క... ...లు.

నిరంజనరెడ్డిది యువకులజట్టు. ఉత్సాహమే వారి మూలధనం. అతడేమి అంత ధనికుడుకాదు. అయినా, ఊళ్లో వుండే విద్యావంతులు, ధనికులైన యువకులంతా అతనికి మద్దత్తుగా నిలబడ్డారు. నారాయణరావు వుండే వార్డులోనే, గుహలోదూరి సింహాన్ని జూలుపట్టి లాగినట్టు– అతనికి ప్రత్యర్థిగా రెడ్డి కుమారుని నిలిపి, మిత్రులంతా నిరంతర ప్రచారం చేస్తూ తమ అభ్యర్థిని గెలిపించ చూచుచున్నారు.

నారాయణరావు డబ్బిచ్చి ఓట్లను కొంటూవుంటే, వారు సామ వాక్యాలతో అతని అనౌచిత్యాలను వెలిబుచ్చి ఖండిస్తూ, ప్రజాభిప్రాయాన్ని తమ కనుకూలపరచుకొంటున్నారు. మిత్రులంతాచేరి తామే డబ్బును చందాలు వేసికొని, నిరంజనరెడ్డిని గెలిపించాలని భగీరథ ప్రయత్నం చేస్తున్నారు.

వారి పార్టీకి నాయకుడు చంద్రశేఖరం. అతని తరువాత ప్రముఖ పాత్ర వహిస్తూ వుండేవాడు డాక్టర్ విజయకుమార్, నిరంజనరెడ్డి యీ

ఇద్దరు బాల్య స్నేహితులు. మిగుల ఉత్సాహవంతులు - మహదాశయ ములు కలవారు.

చంద్రశేఖరం మధ్యరకంవారి ఇంటిబిడ్డ. ఇంటర్‌మీడియట్‌తో చదువు చాలించి, చాలఏండ్లకుముందే జాతీయోద్యమములోదిగి కాకలుతీరిన బంటనిపించుకొన్నాడు. మహాత్మాగాంధీలాంటివారితోకూడ అతడు స్వార్థము లేని ప్రజాహితుడు. ఊళ్ళోకాని, పరిసరాల్లోకాని, ఎప్పుడెక్కడ ఏ మీటింగు జరిగినా చంద్రశేఖరానికి ఆహ్వానముంటుంది. గొప్ప గొప్ప ఆశయాలతో కూడుకొన్న అతని వాగ్ఝరిలో శ్రోతలు తన్మయులై పోతుంటారు. ప్రముఖ పత్రికలో సుదీర్ఘమైన చక్కని వ్యాసా వుంటాయి. ఈసారి నిరంజరెడ్డిని, నారాయణరావునకు ప్రత్యర్థి దాతడే - "ఎంతకాలమైన యీ వృద్ధులే అధికారా లంటిపట్టుకొ మాలాంటి యువకులు ముందుకొచ్చే దెప్పుడు ? పోనీ, పెద్దలని ఊరు కొందామంటే, వీరి దురాగతాలు, నిరంకుశచర్యలు హద్దుదాటి పోతున్నాయి. వీరి ధనానికి, దర్పానికి జంకి ఇంకా ఎంతకాల మూరకుంటా ? ఏమైనాసరే - యీసారి నారాయణరావును గద్దె దించాల్సిందే. పెద్దలైనవారు యువకులకు మార్గదర్శకులుగా నుండవలసినవారేకాని, మార్గావరోధకులుగా నుండకూడదు. అట్లు కానప్పుడీస్వార్థపరుల నెదిరించి పనిచేయుటం మా కనీసధర్మం. ప్రజా ప్రభుత్వం వెలసిన మన దేశములో అర్హులు, ఉత్సాహవంతులు, అగు యువకులను ప్రోత్సహించి. వారిచే న్యాయ విరుద్ధముకాని, సాంఘిక రాజకీయ సేవలను చేయించడం పెద్దల విధి. పదవీ వ్యామోహము, లంచగొండితనము, కులమత కక్షలు, చిన్నలు పెద్దలనే భేదబుద్ధి, స్వార్థపరత్వము సహింపరాని దుర్గుణాలూ అవి ఎక్కడున్నా అణచాల్సిందే! ధనికులగువారు పేదలపాలిటిపెట్టు జెట్టలయి వుండాల్సిందే కాని, వారిని పీడించరాదు."

అని యీరీతిగా చంద్రశేఖరం, విజయకుమార్, నిరంజనరెడ్డి మొదలైనవారు చేస్తూవుండే ప్రచారముయొక్క సారాంశము.



# 15

నారాయణరావు తానెంత తెలివికలవాడైన దేశకాలోచితంగా మారి పరిస్థితుల ప్రాబల్యాన్ని గుర్తించలేకున్నాడు. అతని నారీతిగా ఉప్పించి, అరచేత వైకుంఠం చూపించేవారి దుర్బోధనలవల్ల అతని తల బట్టింది.

దేశమునకు స్వరాజ్యమువచ్చి పదిహేను సంవత్సరాలు దాటిపోయాయి. ప్రజలలో నవచైతన్య ముదయించింది. వ్యక్తిగత ప్రాబల్యాన్ని ఎవరు సహించే స్థితిలో లేరు. బ్రిటిష్‌వారి పరిపాలనలోవలె బెదరించినట్టు నటించి, దర్పాన్నిచూపి పనులు సాధింప జూచుకొనే నారాయణరావు లాంటి వారి పెద్దరికాన్ని తృణీకరించగలిగే స్థితికి వచ్చారు సామాన్యులు. అతనికి మిత్రులని తిరిగేవారిలోనే అనేకమందికి అతనిమీద కంటే, అతడిచ్చే డబ్బుమీద ప్రేమ ఎక్కువగవుంది. దాన్ని లాగడానికి తనకు లేనిపోని మాటలుచెప్పి, వృధా పౌరుషంపెంచి, తన్నొక బొమ్మగా వారు ఆడిస్తున్నారనే సంగతి నతడు గ్రహించలేకున్నాడు. 'ధనమే సర్వార్థ సాధనమగు మూలశక్తి' అనే వాక్యాన్నే పరమార్థసాధనంగా నమ్మాడు. ఈసారి ఎన్నికల్లో 'జయమో - వీరస్వర్గమో' అదే ధోరణిలో ఉన్నాడతడు

డాక్టర్ విజయకుమార్ యీలోగా ఊళ్ళో మంచి పలుకుబడి సంపాదించుకో గలిగాడు. అతడు నిరంజనరెడ్డికి కుడిభుజమని, నారాయణరావుకు

తెలియవచ్చింది. ఎలెక్షన్ సమయం కొబ్బ...
క్రొత్త – వీరు పాత – వీరు చిన్న – ...
తాత్కాలికంగా మరచి, ఓటర్లను తమ జీవితాల్లో ...
కొని మాట్లాడకపోతే తప్పదనే "ఆధునిక అభ్యర్థి ధర్మాస్...
నారాయణరావు ఒకనాడు కొంతమంది మిత్రులతో లక్కవరం ...
ఇంటికివెళ్ళి నమస్కారమండి, మాధవరావు! బాగున్నారా?' ...
పలుకరించాడు.

అతడు తమ యింటి గడప నేనాడు త్రొక్కిన వాడు కాదు. తాను వారి పిల్లలకు ట్యూషన్ చెప్పి జీవిస్తూ వున్న కాలములో అతనికి తానే లొంగి వుండేవాడు. తానెక్కడ – నారాయణరావెక్కడ? సింహం కుందేటి యింటికి వచ్చినట్టుంది పరామర్శించడానికి....

మాధవరావు విస్తుపోయి.... అంతలో 'ఇదంతా ఎలెక్షన్ స్టంటు కదా!' అని సమాధానపడి – వచ్చిన పెద్ద మనిషిని యథాశక్తి ఆహ్వానించి ఆదరించాడు. నారాయణరావు ఎన్నటికి లేని ఆప్తతతో తన ... క్షేమాలు విచారిస్తూంటే, మాధవరావుకు లోలోన నవ్వు పుట్టుకొచ్చింది.

కడకు అసలు సంగతికి వస్తూ నారాయణరావు "చూడండి మాధవ రావ్! మనం మనము ఒకటిగా ఉండకుండ మీకుమారుడు నిరంజనరెడ్డిపార్టీలో చేరి, అతనికి కుడి భుజమై వర్తిస్తున్నాడంటే నాకెంతో విచారంగా ఉంది. అతనికి మీరైనా చెప్పలేక పోయారా? అని ప్రారంభించాడు.

"ఈ దినాల్లో యీ పాపిష్టి రాజకీయాలవల్ల గృహ పరిస్థితులే తారు మారయ్యాయి, సార్! తండ్రి మాట కొడుకు వినడు, భర్త మాట భార్య వినదు. ఒక్కొక్క రొక్కొక్క పార్టీతో సంబంధ ముంచుకొని, ఏవేవో అర్థములేని ఆశయాలతో జీవిత సౌఖ్యాలనే పాడుచేసు కొంటున్నారు. సరిగ్గా, యీలాంటి పరిస్థితే ఏర్పడింది మా యింట్లో. అబ్బాయి నా మాట

౮౮

...ందు కూరకుండు' మని నోరు మూయి
...వాడే. ఎంతో శ్రద్ధా భక్తులతో ఉంటాడు.
...మాత్రం మామాట వినడండీ." అని మాధవరావు
...గూర్చి సుదీర్ఘంగా చెప్పి, క్షమింప వేడుకొన్నాడు.

...క్మన్ మరి అచట నిలవకుండ నిరాశ, కోపము, అవమానము
...నే పీడిస్తూంటే వెంటనే వెళ్ళిపోయాడు.

నిరంజనరెడ్డికి పదవీవ్యామోహ మంతగా లేదు. చేతనై నంత వరకు ప్రజోపకారిగా వుండాలనే ఆతని కోరిక. చంద్రశేఖరం, విజయకుమార్ లాంటి మిత్రుల సహాయముతో ప్రజల కంత కంతకు సన్నిహితుడు కాసాగాడతడు. రంగపురం ప్రజలీసారి అతన్ని గెలిపించే స్థితిలో వున్నారు చాలామందికి నారాయణరావును దించేయాలనే వుంది. తుద కతనితో లంచాలు తిన్నవారు కూడ రెడ్డి అభ్యర్థిత్వాన్నే లోలోన సమర్థిస్తున్నారు మిత్రులనేక మంది చేరి సుమారు పదివేలు వసూలు చేసి నిరంజనరెడ్డిని ...పించాలని పాటుపడుతున్నారు. ఎలెక్షన్ తేదీ సమీపించే కొలది ఉభయ వర్గాల్లోను ఆవేశము, ఉత్సాహము అంత కంతకు మించి పోతున్నాయి.

♦ ♦ ♦

నారాయణరావు యింటినుండి బయలుదేరిన పరంధామయ్య తిన్నగా యింటికి పోక శంభుదాసు యింటికి వెళ్ళాడు. అప్పటికింకా తొమ్మిది గంటలు. తండ్రీ, బిడ్డ ముందు హాలులో కూర్చొని ఏదో మాట్లాడు కొంటూ ఉన్నవారు, పరంధామయ్యను చూచి ఆప్యాయతగ "రండి రండి. మీసంగతే మాట్లాడుకొంటున్నాము. ఇన్నాళ్ళుగా ఎక్కడికి వెళ్ళారా అని" అంటూ ఆహ్వానించి కూర్చోమన్నారు.

"ఎక్కడికో ఒక చోటికి వెళ్ళకపోతే మీకు చేసిన వాగ్దానం నెరవేరే దెట్లండి?" అంటూ అచ్చట సోఫాలో కూర్చున్నాడు పరంధామయ్య.

ఇంతకు పోయినపని కాయా? పండా?" - శంభుదాసు ఆతురం పట్టలేకున్నాడు.

"కాయ కాదు, పండు కాదు, ఇంకా ప్రయత్నంలో ఉందండి."

"సరే, అమ్మాయ్, మొదట అయ్యగారికి కాఫీ తెచ్చి యివ్వమ్మా"

అరుంధతి తెచ్చి యిచ్చిన కాఫీని పొగడుతు త్రాగేశాడు పరంధామయ్య.

"చూడండి, శంభుదాసుగారూ, బెంగుళూరు, మైసూర్ మొదలైన చోట్లకు వెళ్ళి నాకు పరిచయమున్న స్థలాల్లో విచారించి, చూచి వచ్చాను కాని మీకుమాత్రెకు తగిన వరుడు దొరకలేదు. ఇక మీ విషయమంటే డబ్బిస్తే ఏబీద యింటి అమ్మాయి అయినా వస్తుంది కాని, యింటి తనం చూడొద్దండీ?"

"అవును, డబ్బుపెట్టుకొని తెచ్చిన అమ్మాయి యీ సంసారానికి తగదు లెండి, కొంత గౌరవ కుటుంబములోనిదే కావాలి" అని అరుంధతి సమర్థించిందా మాటను.

"గౌరవ కుటుంబములో పుట్టిన ఏ అమ్మాయి హృదయపూర్వకంగా వయసు చెల్లిన నన్ను పెండ్లాడు తుందమ్మ? నీకు, పరంధామయ్యగారికి పిచ్చిగాని....

"ఛాఛా – అలా అనకండి, శంభుదాసుగారూ! మీరు ముసలివాళ్ళని ఎవరన్నారండి. చూడ్డానికి ముప్పైఐదు కంటే ఎక్కువ ఏళ్ళు కనబడవని ఎన్నిమారులో చెప్పానుగా? అందులో కుబేరుని కున్నంత ఐశ్వర్యముంది?"

"ఈకాలం పిల్లలు ఐశ్వర్యాన్నా, యవ్వనాన్నా చూచేది?"

"రెండు చూస్తారనుకోండి. మీరేమి అంత వయసు చెల్లనవారు కాదండి."

"మీరనుకొంటే తీరుతుందా, పరంధామయ్యా?"

"నేనను కోవడమేమి? ఎవరైనా అలాగే అనుకొంటారు."

"సరిసరి. అమ్మాయి సంగతేమిటి? ముఖ్యంగా అది కావాలండీ"

"రెండు కావాల్సిందే కదండీ. నేనొక ఆలోచన స్థిరపరచుకొన్నాను మొదట మీ అభిప్రాయం తెలుసుకొన్నాక ప్రయత్నం చేద్దామనుకొన్నా."

"ఏమిటది? చెప్పండి."

"ఛేర్మెన్ నారాయణరావుగారున్నారు కదా...."

"సరే. ఉన్నారు...."

"అతని కుమారుడు రామమోహనుని చూచారా ఎప్పుడైనా?"

"చూడకేమి? అనేక మార్లు చూచాను. ఇప్పుడు మద్రాసు లా కాలేజీలో చదువుతున్నాడట కదా?"

"అవును. ఆ అబ్బాయికి మీఅమ్మాయిని చేసుకొనేటట్లు చేయాల కొన్నానండి. బ్రహ్మ యీ యిద్దరికే ఆలుమగలు కమ్మని వ్రాసి తోచింది.

"మీరు చెప్పినట్టు మా అరుంధతి నారాయణరావుగారి కుమా కియ్యడానికి నాకెట్టి అభ్యంతరము లేదు. వీరిద్దరికి తగిన జంట అని నే ఒప్పుకుంటాను. కాని, నాకు కావలసినది యిల్లరికపుటల్లుడు కదండీ?"

"ఉండూరులోనే ఉండేవాడుకదండీ, యిల్లరిక మున్నట్టేగా?"

"మీరనుకొన్నారు కాని, వాళ్ళ సమ్మతి ఏలాగుందో? ఇంతకు నారాయణరావుగారు సామాన్యులా? అతడు యిల్లరికమంటే సమ్మతిస్తారా?

"అతడు మీ అమ్మాయిని కోడలుగా గ్రహించేట్టు చేసే భారంనాది

ఇప్పుడు యిల్లరికం మాట ఎత్తకండి. దై
మూడు ముళ్ళు పడితే, కడకు అల్లుడు మీ
సరిపోయిందా?"

"కావచ్చు...."

"మరి, నాన్నగారి సంగతి అలాగే వదిలేస్తారా.

"లేదమ్మా. దానికొక ఆలోచన చేశాను. భగవం ... అందుకు తోడయ్యాడా, నాన్నగారిని మించిన అదృష్టవంతులే వుండరు."

తండ్రీ, బిడ్డలిద్దరు రిచ్చపాటుతో చూడసాగారతనివైపు.

"ఏమిటా ఆలోచన చెప్పండిచూద్దాం" అన్నాడు శంభుదాసు.

"మీకు నారాయణరావుగారి అన్నకూతురైన ప్రసన్న నిప్పించాలని నా ఆలోచన.

ఆమాట వింటూనే అది ఎన్నటికి నెరవేరే విధం కాదన్నట్టు శంభు దాసు తల నడ్డంగా ఆడించి "ఇది ఎప్పటికి కుదిరే ఆలోచనే కాదు. నారాయణరావు కింక నన్ను మించిన అల్లుడే పుట్టడు కాబోలు" అనేశాడు.

అరుంధతికి కూడా అది సమంజసంగా తోచలేదు. కాని, పరంధా మయ్యా వారిద్దరిని సమాధాన పరుస్తూ యిట్లన్నాడు.

"కొంత నిదానించి వినండి. అంతలోనే నిరుత్సాహపడకండి. మీకువలెనే, అతనికి కూడ నాయందు ఎంతో విశ్వాసముంది. చెప్పేరీతిగా చెప్పితే అతడు తప్పకుండ నా సలహాను త్రోసివెయ్యడని నా నమ్మిక."

"ఇంతకు అమ్మాయి సమ్మతించొద్దా?" అని అడిగింది అరుంధతి.

"అది ముఖ్యమైన సంగతి" అన్నాడు శంభుదాసు.

"ఆ యింటి సంగతి మీకు తెలియదు లెండి. నారాయణరావుగారు సమ్మతించారా ఇంకెవ్వరు నోరెత్తడానికి వీల్లేదు."

# 16

…ంధా …ఘ్య ఆలోచన చాలా బాగా నచ్చింది తండ్రి బిడ్డ లిద్దరికి. కాని, అది అందని మ్రాని పండ్ల కర్రలు చాచుటేమో అనిపించింది వారికి.

మీరీ విషయమై ఎప్పుడైన చూచాయగా వారియింట్లో ఎవరితోనైన ప్రస్తావించారా?" అని అడిగాడు శంభుదాసు.

"ఎవ్వరితోను అనలేదు. నా మనసుకే తోచిందీ ఆలోచన. ఇది అమోఘమని నా తలంపు, వారితో మాట్లాడేందుకు ముందు మీ అభిప్రాయం కనుక్కోవాలని మీతో చెప్పాను"

"వారి అభిప్రాయం కనుక్కొన్న తరువాత మావద్ద ప్రస్తాపించి వుంటే బాగుండేదేమో!"

"ఎందుచేత నంటారు?"

"ఒకవేళ మీ ఆలోచన ఫలించకపోతే మాకు వృధా ఆశలు కల్పించినట్టవుతుంది కదా?"

"ఇందులో వృధా వుండదని నా దృఢ సంకల్పం. నారాయణరావు గారి ప్రకృతి నాకు బాగా తెలుసునండి. అతనిని సమ్మతింపచేసినా నంటే యింక ఆ యింట్లో నోరెత్తడాని కెవ్వరికిని సాహసం లేదు. ఇక ప్రసన్న సంగతంటారా? — ఆమె చాల విధేయురాలు. పినతండ్రి మాట కెదురాడే రకం కాదు. ఇంతకు మిమ్ముల నామె నిరాకరించేందుకు కల కారణమేమో నా కర్థం కావటం లేదు. అందము లేదా? విద్య లేదా? ధనము లేదా? — పోతే మీరు సామాన్యంగా కావలసిన వరుని కంటే పదేళ్ళు హెచ్చుగా కనబడవచ్చు. అంతటితో పుట్టి మునిగిందేమి లేదు. నేను నారాయణరావు

గారి కీసంగతంతా చెప్పి ఒప్పించగలననే ధైర్యము నాకుంది. కూతురుతో 'ఊ' అనిపించగలడు. శ్యామసుందరినికూడ సమ్మతింపచే గలను."

తన రూపయౌవ్వనములకు మాటి మాటికి పరంధామయ్యా అం వెలకడుతూ వుంటే శంభుదాసు కొంత అభిమానంతో పెండ్లికొడుకు లాగ అప్పుడే ఫోజుపెట్టి చూడసాగాడు.

"సరే, చాలా బాగుంది మీ ఆలోచన" అని తండ్రి బిడ్డలిద్దరు అట్టి ఆలోచన చేసినందుకు పరంధామయ్యను చాల మెచ్చుకున్నారు. శంభుదాసు మరింత ఉబ్బులమారి మనిషి. మనసులో మాటను దాచుకోలేడు.

"మీరు గనక యీ పనిని సాధించారంటే మీకు నేను మూడువేల రూపాయల బహుమాన మిస్తానండీ, పరంధామయ్యా. ఈ దినమే ఐదు వందలు అడ్వాన్సు తీసుకోండి. మిగతా రెండున్నర వేలు ప్రసన్నతో నాకు, రామమోహనునితో మా అరుంధతికి వివాహమైన మరుక్షణమే యిచ్చివేస్తా" నంటూ బిడ్డవైపు సాభిప్రాయంగా చూచాడు. తండ్రిమాట నామోదించిన దానివలె అరుంధతి చిరునవ్వుతో లోపలికివెళ్ళి అయిదువందల రూపాయల నోట్లు తెచ్చి అతని చేత బెట్టింది. శంభుదాసు డబ్బునందిస్తూ "ఇదో చూడండి, పరంధామయ్యా, మీ మాటమీద, మీ శక్తిమీద నాకు నమ్మిక ఉంది. ఈ కార్యాన్ని యెలా సాధిస్తారో మీదే భారం." అని 'అన్యధాశరణం నాస్తి' వాక్యాన్ని పలికాడు.

ఆ క్షణములో - మునుపు తన చేతికి ఏడువందలు వచ్చి అందులో మూడువందలు జారిపోగా, మిగిలిన నాల్గువందలు, యిప్పుడు మరల చేతికి వచ్చిన ఐదువందలు - మొత్తం తొమ్మిదివందల రూపాయలు పరంధామయ్య మనోనేత్రంముందు ప్రదర్శితమై అతన్ని ఆనందాబ్ధిలో ముంచివేశాయి. అదృష్టంఅంటే, చూడబడనిది - అతన్ని వెతుక్కుంటూ

వుంది. ఏమిచెప్పాలో తోచక అతడు క్షణకాలం ఉక్కిరి బిక్కిరి య్యాడు. అయినా, అంతలోనే తెప్పరించుకొని, లాంఛనమాత్రానికి అయ్యా, శంభుదాసుగారూ, మాటిమాటికి మీరు నామీద మోయలేని భారం మోపుతున్నారెందుకు? ఈ డబ్బిస్తేనేనా నేను హృదయపూర్వకంగా పనిచేసేది? లేకుంటే లేదంటారా?" అని మొమోటానికి రెండు మాట లన్నాడు.

"అబ్బే, అదికాదండి నా ఉద్దేశ్యం. మీ రీమాత్రం మావిషయంలో సద్భావంకలిగి, యింత గొప్ప ఆలోచన చేస్తున్నారంటే నా కెందుకో పరమానందంగావుంది. ఇది మీ శ్రమకు పారితోషిక మనుకోండి."

"ఏమి చెప్పాలో నోరు రావటంలేదు. మీరుచూస్తే మహా ఉదార సంపన్నులు....కానీండి, మీ యిష్టప్రకారం జరుగనియ్యండి."

సూక్ష్మగ్రాహియైన అరుంధతిమాత్రం కొంతవరకు గ్రహించింది. పరంధామయ్య ప్రదర్శించే నటన. ఆమె ఏమీ మాట్లాడలేదు.

"శంభుదాసుగారూ, మీతో ఇప్పుడు నారాయణరావుగారి యింటి సంగతి చెప్పానంటే, ఊరకే అన్నా ననుకొన్నారా?"

తండ్రి, బిడ్డ అతనివైపు అదో మాదిరి చూడసాగారు.

వెనుక మీతో మాట్లాడి వెళ్ళిన మరుదినమే నారాయణరావుగారు నన్ను పిలువనంపి తమ అమ్మాయికి తగిన వరుణ్ణి చూచే భారాన్నంతా నామీదే ఉంచారు మీలాగా. ఇప్పుడు రెండు భుజాలమీద రెండు మోయ లేని భారాలు మోస్తున్నానండి."

"ఈ ఆలోచన నెరవేరిందంటే ఆ భారాలు కాస్త సులభంగా దిగిపోతాయిలెండి" అన్నాడు శంభుదాసు.

"ఇంకొకమాట. నారాయణరావుగారేమో యిప్పుడు ఎలెక్షన్ హడావుడిలో వున్నారు. ఇంక వారంలోగా ఎన్నికలైపోతాయి. తరు వాత అతను తీరిగ్గా వుంటాడు."

"అన్నట్టు, మరచాను. ఈసారి అతడు గెలిచేది సంశయ
మని ఊళ్ళో కొంద రనుకొంటూన్నారే?"

"ఏమో, లెండి. ఆ గొడవ నాకెందుకు? అసలీసారి ఎన్ని
నిలువవద్దో అని అతన్ని భార్యా, కొడుకు ఎంతో వారించారు. కా
అతడు వినలేదు. ఫలితమేదైన అనుభవించితీరాల్సిందే. చూడం
నారాయణరావుగారి ప్రకృతి అక్కడే మీకర్థమవుతుంది. ఏదేని విష
యమై పట్టు పట్టాడా అతన్ని దారి తప్పించడం బ్రహ్మకు కూడ తరం
కాదు.

"సరేలెండి. ఎవరిపద్ధతి వాళ్ళది. అతనికంత మోజుగా వున్న
ప్పుడు వద్దనడమెందుకు?"

"ఎందుకా? మీరే విన్నారుగా యీసారి గెలుపు సంశయాస్పద
మని. అలాంటప్పుడు వేలకు వేలు డబ్బు తగలేసి, యీ ఎన్నికల్లో
నిలువకపోతేమాత్రం అతనికి వచ్చిన లోటేమిటి? అత దూరకుంటేనే
గౌరవంగా ఉండేది."

"మీరైనా చెప్పకపోయారా వద్దని?"

"బాగుంది, మీరనేమాట. అతని ప్రకృతి ఏలాంటిదో చెప్పానుగా?
భార్యా పుత్రులే అతనికి విషయంలో లెక్కలేకపోతే నేనెవరండి? సరేకాని,
చెప్పవచ్చిందేమంటే, యీ ఎన్నికలు ముగిశాక నేను సమయంచూచి
నారాయణరావుగారిలో మనఆలోచనలనుగురించి ఉపాయంగా ప్రస్తావిస్తాను.
కాస్త ఆలస్యమైన మీరేమి అనుకోకూడదు సుమా."

"లేదులెండి. సావకాశంగా ప్రయత్నించండి. ఏతావతు, మీకు
కార్యాన్ని సాధించితీరాలి."

"భగవంతుడున్నాడు. సాధించగలననే ధైర్యం నాకుంది. ఈ
మధ్యలో అప్పుడప్పు డొచ్చిపోతుంటానుగా."

ఆపూట పరంధామయ్యా అచ్చటే భుజించి ఇంటికి వెళ్ళిపోయాడు మగడు తెచ్చిన డబ్బునుచూచి మంగమ్మ అమితమైన ఆశ్చర్యా ములతో "ఈవేళ మరి ఎక్కడిదండి యింతడబ్బు? బలేగ కని ట్టారే? మళ్లీ నారాయణరావు యిచ్చాడా?" అని ప్రశ్నించింది. పరం మయ్య రహస్యంగా చెప్పాడామెతో శంభుదాసు సంగతి, తన ఆలోచన సంగతి. మంగమ్మ మూతి విరిచింది."

"మీ ప్లానేమి బాగలేదండి" అనింది.

"ఎందుకు?"

"రెండోపెండ్లికి, అందులో ముసలాడికి నారాయణరావు ప్రసన్న నిస్తాడా? ఆమె చేసుకొంటుందా? శ్యామసుందరి ఒప్పుకుంటుందా?. మీది కేవలం బుద్ధితక్కువ ఆలోచన. మీ పుణ్యం- నారాయణరావుతో యీ ప్రస్తావన చేయకండి. చేశారా, తల వాచేట్టు చీవాట్లు తింటారు జాగ్రత్త."

భార్య హెచ్చరికను విని పరంధామయ్యా నవ్వుకొన్నాడు.

"అందుకే ఆడంగులతో ఏమీ ముందుగా చెప్పరాదు" అన్నాడు.

మంగమ్మ గస్సుమని లేచి "చెప్పితేమాత్రమేమి? ఈలాటి బుద్ధి తక్కువ ఆలోచన లెవ్వరైన చేస్తారా? నాకు కాసులదండవద్దు. ఏదండ వద్దు. ఈ డబ్బుకోసరం యీలాటి దురాశలు కల్పించి అటు శంభు దాసుతో, ఇటు నారాయణరావుతో చీవాట్లు తినకండి. మర్యాదగా బ్రతికితే చాలు" అనింది.

భార్య ఈమాత్రం బుద్ధిమంతురాలైందంటే పరంధామయ్యా లోలోన పరమానంద మొందాడు. కాని, యిప్పుడేమిచేయడం? డబ్బును శంభు దాసుకు వాపసిస్తే బాగుంటుందా? ఆలోచించాడు. రోటిలో తలమార్చి రోకటిపోటుకు భయపడడ మెందుకా అని తన ఆలోచననే గట్టిపరచు కొన్నా డతడు.

# 17

నారాయణరావుస్వభావ మేలాంటిదో పరంధామయ్యకు బాగాతెలుసు. అమయ మెరిగి తన ఆలోచన నొక్కమారు అతని తలలో ప్రవేశపెట్టాడా సది తనంతకు తానే పనిచేసి అతన్ని తనదారికి తేగలదు. ఏమాత్రం తాను పొరబడిన, తుదకది తనకే నష్టకారణమని పరంధామయ్య మూడు దినములనుండి నారాయణరావు ఇంటికి ఉదయం, సాయంకాలం పోయి వస్తున్నాడు. అతనితో మాట్లాడేందుకు తగిన అవకాశం దొరకునేమో అని. కాని, వీలుపడలేదు. అత డెప్పుడు ఎలెక్షన్ విషయాల్లో మునిగి వచ్చీ పొయ్యేవారితో మాట్లాడుకొంటూ, పరంధామయ్యను గమనించనే లేదు.

నాల్గవదినం నారాయణరావు ఇంట్లో ఏదో పండుగ. శ్యామసుందరి పౌరోహితుని, అతని భార్యను భోజనాని కాహ్వానించింది. భార్యా భర్త లిద్దరు వచ్చారు. దైవికంగా ఆదినం నారాయణరావు ఎన్నడు లేని ఉల్లా సముతో ఇంట్లో అందరిని పలుకరిస్తూ సుముఖుడై ఉండడం గమనించాడు పరంధామయ్య. భోజనాలముందు అతనితో చాల చనువుగా మాట్లాడాడు. తన మంత్రాలోచనకు తగిన సమయం లభించిందని పరంధామయ్య యజ మానితో భోజనానంతరం తాంబూలం నమలుతూ, నిశ్చయించుకొన్నా దాదినం. తనకు మనసులోని ఆలోచనను గురించి ప్రస్తావించేందుకు.

ఇరువురు తోటలో ఒక మల్లె పొదవద్ద స్ఫటిక శిలావేదికమీద కూర్చున్నారు.

"ఎలెక్షన్‌రోజు యింక నాల్గు దినాలుమాత్రం మిగిలింది. ఆ ప్రొద్దు మన గ్రహచారం ఏలాగుంటుందండీ, పరంధామయ్యా ?" అని నారాయణ రావు ప్రశ్నించాడు.

పరంధామయ్య తడుముకోకుండా "అంతా సవ్యంగానే ఉంటుందండి. ,బూల సమయములో అడిగిన ప్రశ్న తప్పక నెరవేరితీరుతుంది. ఇది నుభవ సిద్ధాంతం" అని చెప్పడంతో నారాయణరావు తృప్తితో నవ్వు "న్నాడు.

"సరేకాని, మీరు వరాన్వేషణకు మరల ఎప్పుడు బయలుదేర బోతారు?"

"ఇప్పట్లో వెళ్ళదలచుకోలేదు. ఈ విషయమై నాకొక ముఖ్యమైన ఆలోచన తోచింది. మీతో ఆలోచించాలని మూడు దినాలనుండి ప్రయత్ని స్తున్నాను. అందుకు మీ రేమంటారో,"

"ఏమిటది? చెప్పండి."

"నేను మీ కుటుంబానికి శ్రేయస్కాముడనే సంగతిని మీరు గ్రహించారనుకొంటాను."

"అచ్చే, అవేటి మాటలండీ? ఆలాటి విశ్వాసం మీలో లేకపోతే ఈ కార్యభారం మీ మీద వుంచి నేను నిశ్చితంగా వుంటానా?"

"సంతోషం. మీకు శంభుదాసుగారు బాగా తెలుసు నను కొంటాను."

"తెలియకేమి? అయితే అంత బాగా తెలియనుకోండి, ఎందుకు?"

"అతడు ఆస్థిపాస్తుల్లో మీతో సరిసమానుడని మీరీపాటికే గుర్తించి వుంటారు."

"కావచ్చు. తరువాత...."

"అతని కొక్కతే బిడ్డ. పురుష సంతతి లేదు. ఆ బిడ్డఅయినా ఏలాగుంటుందనుకొన్నారు? కేవలం అప్సరస అనుకోండి...."

"అయితే?" .... నారాయణరావులో ఏదో ముందు వినాలనే ఉత్సా హం ఉరకలేయసాగింది.

"ఆ అమ్మాయిని మీ కోడలుగా పరిగ్రహించాలని నా సలహా"

"దాని కిప్పుడేమంత ఆత్రంగా లేదు. రామమోహను డింకా రెండేళ్లు చదవాలి. తరువాత కదా వాని పెండ్లిమాట? ప్రస్తుతం ప్రసన్న విషయం కదా మనము మాట్లాడుతున్నాము. మీ మనసులో ఏదో ఆలోచన ఉంచుకొని, దాన్ని డొంకతిరుగుడుగా చెబుతున్నారు. అదేదో సూటిగా చెప్పండి."

నారాయణరావు ఒకరీతి సీరియస్ ఫోజు పెట్టాడు. అతని మనస్తత్వం కనిపెట్టి పరంధామయ్య తుదకిలాగన్నాడు.

"శంభుదాసుకు మరల పెండ్లి చేసుకోవాలని ఉంది. ఇంట్లో తండ్రి బిడ్డ మాత్రమే వుండేది. బిడ్డకు పెండ్లిచేస్తే తానిక ఒంటరివాడై పోతాడు. అప్పుడిక ఒంటరిగా జీవితం వెళ్ళగొట్టడమెట్లా అని అతని నిప్పుడిప్పుడా బెంగపట్టుకోంది."

"నిజమే. భార్య పోయిన వెంటనే అతడాపని చేయాల్సింది. ఇంత కాల మెందుకూరకున్నాడో?"

"దేనికి సమయం కలిసిరావాలె కదండీ? పెండ్లంటే ఋణానుబంధ విషయం."

"జాతకరీత్యా అతని 'వయస్సెంత?' నలభై మూడేళ్ళు, చూడ్డానికి ముప్ఫై ఏళ్ళవాని లాగుంటాడు."

"అదిసరే అనుకోండి. పిల్ల కుదిరిందా? ఆపనిని కూడ మీమీదే పెట్టాడా అతడు?"

"చిత్తం. నాకు మీరెంతో అతడు కూడా అంతే కదండీ? సుమారు ఇరవై లక్షలకు పైబడిన ఆస్థి. ఎవరికో దిక్కుమాలిన వారి కది సంక్రమించేది నా కిష్టం లేదు."

"అంటే, మీ అభిప్రాయం?"

"అదంతా మీ అధీనానికి రావాలి?

"అదెట్ల వీలౌతుంది?"

"ప్రసన్న నాతని కిచ్చి పెండ్లిచేస్తే...."

ఆ మాటకు నారాయణరావు కెందుకో అదిరిపడి చూచాడు పరంధామయ్య వైపు.

"ఏమిటీ మీరనేది? మా అమ్మాయిని ఆ వయసు చెల్లినవాని కంట గట్టమంటారా?" అని చూపులో కొంత వ్యగ్రత కనిపింపచేశాడతడు. తన ప్రజ్ఞనంతా ఖర్చుచేయవలసిన క్షణమాసన్నమైందని పరంధామయ్య గుర్తించి చాల జాగ్రత్తగా మాటలుపయోగింపసాగాడు.

"అతడేమంతటి వయసు మళ్ళినవాడు కాదు. ఆరోగ్యానికి, అందానికి కొరతలేదు. చక్కని దేహస్థితి అతనిది. పోతే నా ఆలోచన లోని సారాంశమిది. శంభుదాసుగారికి ప్రసన్న నిచ్చి, అతని కూతుర్ని మన రామమోహన్‌కు చేసుకొండి, వారి ఆస్థి సర్వస్వం మీ చెప్పుచేతల్లోకి వస్తుందే కాని, ఒక పైసా కూడ ప్రక్కకు పోయేందుకు వీలు లేదు. ఒకవంక కొడుకు అధిపత్యం.... రెండవ వంక బిడ్డ అధిపత్యం పరోక్షంగా అంతా మీదే అధిపత్యం."

ఒక్క క్షణమాగాడు పరంధామయ్య ఏదో ఆలోచనా నిమగ్నుడై నారాయణరావును గమనిస్తూ, సరిగ్గా అదే క్షణంలో నౌకరొకడు దూరము నుండి "బాబుగారూ, వరదరాజయ్యగారొచ్చారండీ." అని చెప్పడంతో నారాయణరావు తటాలున అచ్చటి నుండి లేచి పోయాడు, పరంధామయ్యకు చాలా నిరుత్సాహం కలిగింది. "వీడెక్కడి నుండి ఊడిపడ్డాడురా పానకంలో పుడకలాగా" అని గొణుగుకొంటూ అక్కడి నుండి లేచిపోయాడు.

అయినా అది ఒకందుకు మంచిదనుకొన్నాడు పరంధామయ్య, తానేమో తన ఆలోచనను తెలిపాడు కాని, దాన్ని గురించి వెంటనే ఒక

నిర్ణయానికి రావడ మంత తేలికైన సంగతి కాదది. తలలో ప్రవేశ పెట్టాడు ఆలోచనను.... భూమిలో విత్తనం నాటుకొంటుందో, చెడి పోతుందో చూడాలి కదా! ఆలోచించేందుకు నారాయణరావుకు కూడ కొంత వ్యవధి లభించింది లెమ్మని సమాధాన పడ్డాడా బ్రాహ్మణుడు.

ఆ ఎలెక్షన్ నాల్గు రోజులు నారాయణరావు సగం తిండి తిన లేదు. నిద్రపోలేదు. చూచేవారికి నిర్వికారుడుగా కనబడుతున్నా, మనసులో ఆరాటమధికంగా ఉంది. ఇంటికి వచ్చే పోయే స్నేహితుల సంఖ్య కంతమే లేదు. ఏది ఎట్లవుతుందో అని తన అధికార ముండేలోగా ఆఫీసు కాయి తాల మీద, కంట్రాక్టు పత్రాల మీద సంతకాలుంచేశాడు.

రంగపురంలో ఐదు చోట్ల పోలింగ్ బూత్‌లను ఏర్పాటు చేశారు. ప్రతిచోట అభ్యర్థులు తమకు కావలసిన ఏజెంట్లను నియమించి, చేయ వలసిన సదుపాయాలన్ని చేశారు. నారాయణరావు ముందుగా ఇరవై జట్కాలకు, పదిహేను రిక్షాలకు డబ్బిచ్చి ఓటర్లను సకాలానికి పోలింగ్ స్టేషన్ల వద్దకు సగౌరవంగా పిలుచుకొని వచ్చే ఏర్పాట్లు చేయించాడు. అన్ని అనుకూలాలాలు సక్రమంగా జరిపించారు.

సెప్టెంబరు 20వ తేదీ తెల్లవారింది. రంగపురమంతా ఎన్నిక సందడితో నిండిపోయింది. ఎటు చూచిన కార్లు, జీపులు తిరుగాడు తున్నాయి. ఓటర్లను తీసికొని వెళ్ళు జట్కాలు, రిక్షాలతో బాటు, అభ్యర్థు లందరు తమతమ ఏజంట్ల నందరిని పోలింగు జరుగుచోట్ల అప్రమత్తులై యుండు నట్లు హెచ్చరించుచు, క్షణమొక చోట నిలువకుండ తిరుగాడు చున్నారు. తమతమ వార్డులలోని ఓటర్లను వదలకుండా పోలింగు జరుగు చోటికి పంపుతూ, తమ పూర్వ వాగ్దానలను జ్ఞాపకపర్చుచున్నారు. అంత హడా వుడిగా వున్నా గల్లంతులు, గలాటాలు మాత్రం యెచ్చట జరగలేదు. తమతమ పార్టీలను ఎక్కువ ఓట్లతో గెలిపించుకో చూచుచున్నారే కాని అక్రమ పద్ధతులు, అవాంతరాలు ఎక్కడ జరిగినట్టు రిపోర్టులు లేవు.

నారాయణరావు నిలబడినది నాల్గవ వార్డు. అచ్చట అతనికి, నిరంజనరెడ్డికి పోటీ జరుగుచున్నది. ఆ వార్డులో ఓటర్లందరు యించు మించుగా మధ్యాహ్న సమయానికే తమ ఓట్ల నిచ్చిపోయారు. ఒంటిగంట కల్లా అన్నివోట్ల పోలింగు ముగిసిపోయింది. సాయంకాలం ఐదుగంటల కల్లా కలెక్టరు గారి ఆఫీసువద్ద ఫలితం తేల్చబడునని ప్రకటింపబడింది.

అభ్యర్థులలో యింతకుముందు ఉన్న ఉద్విగ్నత మరింత అధికమై పొయ్యింది. ఫలిత మేలాగుంటుందో అని. నాల్గవవార్డులోని ఓట్లపెట్టెల యొక్క భారమునుబట్టి పోలింగు ఆఫీసరే రహస్యంగా నారాయణరావు యొక్క జయము సంశయాస్పదమని ప్రక్కన ఉన్నవారితో చెప్పాడు. ఆ వార్త అట్లే వ్యాపించి, తుదకు ఐదుగంటలవేళకు కలెక్టర్ ఆఫీసువద్ద "నిరంజనరెడ్డి గెలిచా"డని అందరికి స్పష్టంగా తెలిసిపొయ్యింది. చాల మంది "ఇది ఎదురుచూచిన ఫలితమే" అని తృప్తిపడ్డారు.

తన గదిలో కూర్చొని టెలిఫోనుద్వారా ఎప్పటికప్పుడు వార్తలను వింటూవుండే నారాయణరావుకుకూడ తెలిసిపొయ్యింది తా నోడిపోయినట్లు. ఆ వార్త అందిన క్షణములో రిసీవరునటు పెట్టివేచి అతడు చెప్ప నలవి కాని బాధోద్విగ్నుడై, తనలో తా నేదో గొణుగుకొంటూ బోనులోని పులి వలె అటు యిటు పచారు చేయసాగాడు గదిలో. దగ్గరికివచ్చి "ఏమైనదని" ప్రశ్నించే ధైర్యంలేక, సంగతంతా గ్రహించిన శ్యామసుందరి, ప్రసన్న విచారవదనములతో మరుగున నిలబడి కన్ను లొత్తుకోసాగారు. ఆ సమయ మున ఎవ్వరెదుటికివచ్చి యేమి చెప్పినా సహించే స్థితిలో లేడు నారాయణరావు.

# 18

నాటకం ముగిసిన మరునాటివలె ఎన్నిక లైపోయాక రంగపురములో సందడి తగ్గిపొయ్యింది. గెలిచినవారొకవంక తమ ప్రగల్భాల్ని చెప్పుకో సాగారు. ఓడినవారిలో కొందరు "ఇదేమి మా అబ్బసొమ్మా? ఎన్నికల్లో జయాపజయాలు ఒకరి సొత్తా? మాకు గెలిచినా ఒకటే, ఓడినా ఒకటే" అని ఏలాటి ఖిన్నత లేకుండ యధాప్రకారం తమ పనులు తాము చూచుకొంటున్నారు. నిజానికి వారిదే మంచి పద్ధతి. ప్రజాసంస్థలో ప్రజల విశ్వాసమున్నంతవరకే గెలుపు. తరువాత అది చేకూరదు. కాబట్టి నిరంతరం ప్రజల విశ్వాసాన్ని భద్రపరచుకో గలిగినంత దూరదృష్టితో వర్తించగలిగే వారే నిజమైన ప్రజాసేవకులు. ఒకవేళ ఎదుటిపక్షమువారు డబ్బుయొక్క ప్రాబల్యముతో వారిని ఓడించినా 'ఓడితిమ'ని వా రెన్నడు నిరుత్సాహ పడరు. వారి క్రింద వ్యక్తిగతమైన మానావమానాలే ఉండవు.

నారాయణరావు మనస్థితి అలాంటిదికాదు. భార్యాపుత్రులు మొదటి నుండి యీ ఎన్నికల్లో యీసారి దిగవద్దని మొత్తుకొన్నా వినకుండ, కేవలం పౌరుషాభిమానాలకు లొంగి, హితులెవరో, అహితులెవరో గ్రహించకుండ మూర్ఖభావంతో వర్తించాడతడు. బలాబలాలు తేల్చుకో వలెనని చూచాడు. గోముఖ వ్యాఘ్రాలలాంటి హితశత్రువుల ముఖ స్తుతులను నమ్మి మోసపోయాడు. ఒకవంక పరువునష్టమైపోయింది. రెండవవంక సుమారు ఏబదివేల రూపాయలు పాడైపోయాయి. మన సులో ఏమూలనుండో యిప్పుడు "ఊరకుంటే బాగుండేదేమో" అనే పశ్చాత్తాపం తొంగి చూడసాగింది. కాని, పౌరుషాభిమానాలముం దది స్పష్టంగా తల ఎత్తలేకపొయ్యింది. ప్రాయికంగా మూర్ఖులు తమకు కలిగే కష్టనష్టాలకు ఇతరులను బాధ్యులచేసి వారిని దూషిసారేకాని,

స్వయంకృతాపరాధ మొక టుందని గ్రహించలేదు. అతనికి భార్యమీద, కొడుకుమీద, బిడ్డమీదకూడ కోపం వచ్చింది - వీరు ముగ్గురు శకున పక్షుల్లాగా తాను చేసే ప్రయత్నానికి పానకంలో పుడకలవలె అడ్డు వచ్చారట. అతడేమైన అననిమ్మని శ్యామసుందరి, ప్రసన్న నోరెత్త లేదు. ధననష్టం, పరువునష్టం కలిగినందుకు వారుకూడ లోలోన ఎంతో విచారిస్తున్నారు.

ప్రసన్నద్వారా మదరాసులోనున్న రామమోహన్‌కు ఎలెక్షన్ ఫలితాలు తెలిసిపోయాయి. అతడు తండ్రిని ఊరడిస్తూ జాబు వ్రాశాడేకాని, అతని తప్పిదాలను గురించి యేమి ప్రస్తావించలేదు. శ్యామసుందరి తన నేర్పుకొలది మాటలతో, చేష్టలతో భర్త మనసులో కలిగిన తీవ్రమైన పరాభవ వ్రణాన్ని మాన్ప యత్నిస్తూంది. అయిపోయిన సంగతిని మరల ఎత్తి చూపడ మెందుకని ఆమె గతాన్ని గురించి మాట్లాడేదే మానుకొంది.

నాల్గవతేదీరాత్రి నిరంజనరెడ్డిని పూలమాలతో ముంచి ఎత్తి కారులో మిత్రులంతా ఊరేగించారు. కావలెనని ఊరేగింపును నారాయణరావు యింటిముందే పోనిచ్చారు. సేవకులు కొందరు దృశ్యాన్నిచూచి 'అమ్మ గారి'తో చెప్పారేకాని యజమానితో చెప్పే సాహస మెవ్వరికి లేక పొయ్యింది. చెప్పకపోతేమాత్ర మతడు గ్రహించలేదనా ? ఇదంతా గోరు చుట్టుమీద రోకటి పోటులాంటిది.

మనసులో ఎంత విచార ముండినా కాలక్రమంగా అది తగ్గిపోతుంది. ఏబాధైనా తరుణంలోనే దుర్భరము. ఇది లోక సహజమైన సంగతి. కాని, నారాయణరావు విషయములో ఏదీ విపరీతంగా ఉంటుంది. బయటి కెక్కడికి పోనవసరములేక ఇంట్లోనే వుంటున్నాడు. కాని మనసులోని ఉద్ధృతాన్ని ఇంకా అణచుకోలేకున్నాడు. క్రమక్రమంగా తాను ఓడిపోవుట వల్ల కలిగిన అవమాన మేదైనా వుండేదాన్ని కొంతకు కొంత మరచిపో సాగాడు. కాని, యాభై వేల ధననష్టాన్ని తలచుకొని చాల బాధ పడిపో

తున్నాడు. తనకున్న ఆస్తిలో అది లెక్కింపవలసిన ఖర్చే కాదు, అయినా అతనికి రాబడిమీద ఉన్నంత మోజు ఖర్చుమీద ఉండదు. తన్ను కల్లబొల్లి మాటలతో వంచించినవా రందరిమీద సహింపరాని కోపం వచ్చింది కాని — వారిని తానిప్పుడేమి చేయగలడు? వారు తన దగ్గరి కిప్పుడు వస్తేగా? వరదరాజు, మాదన్న పంతులులాంటివా రింటికి రాక అప్పుడే వారందాటింది. అతనికిప్పు డర్థమైంది వా రెటువంటి మోసగాండ్రైనది. ఇప్పు డనుకొంటే తనకే పరువుదక్కదు.

కొన్నాళ్ళపాటు తన కోపాన్ని, చిరాకును నౌకర్లమీద, భార్యమీద కనబరుస్తూ వచ్చాడు నారాయణరావు. ఈ నడుమ అప్పుడప్పు డింటికివచ్చి పోతూవుండే పరంధామయ్యతో ఎక్కువ మాట్లాడలేదు. అతడుకూడ హద్దుమీరి ఏమీ చెప్పలేదు.

కొన్నాళ్ళ తరువాత ఒకనాటిరాత్రి ఉన్నదున్నట్టు నారాయణరావుకు నిద్ర పట్టని స్థితిలో అలనాడు పరంధామయ్య ప్రసన్నను శంభుదాసుకిచ్చి, అరుంధతిని తన కొడుక్కు చేసికొన్నట్టయితే ఉభయవర్గాల ధనరాసులు తన అధీనంలోకి రాగలవని చెప్పిన ముత్యమంతమాట తటాలున జ్ఞప్తికి వచ్చింది.

ఆ రాత్రి అత డింక నిద్రపోలేదు, దీర్ఘాలోచనలో పడ్డాడు. ఆలోచించేకొలది అది అతని పాలికి అమోఘమైన తారకమంత్రం కాజొచ్చింది. అతడు తనలో తా నిట్లని ఆలోచించుకోసాగాడు.

పరంధామయ్య ఆలోచన పెడచెవిని బెట్టదగినదికాదు. ఇది తంగేటి జున్నులాంటి పని. ప్రసన్నను శంభుదాసు కివ్వడములో అసంగత మేముంది? పోతే, యితడు కొంత వయసైనవాడనేకదా ఆక్షేపణ? అతడు ముసలివాడుమాత్రం కాదు. ద్వితీయ వివాహానికి తగిన వయస్సుంది. ఆమె అతన్ని చేసుకొంటే ఆ యాస్తి కంతటికి అధికారిణి యైపోవును. అప్పుడింత తన తండ్రితాలూకు ఆస్తి విషయమై అంతగా ఆశించేంత ప్రమేయముండదు. ఏదో కొంత యిచ్చి లోకాపవాదం [illegible]

వచ్చు. ఇక శంభుదాసు కూతురును మా రామమోహనునకు చేసుకోవడం వల్ల, పుత్రసంతతిలేని శంభుదాసు బిడ్డకు కనీసము అర్థమాస్థి యివ్వకుంటాడా? – అంటే సుమారు పదిలక్షలన్నమాట! అబ్బో – తలచుకొంటే ఏనుగుపాడిలా గుంటుంది అప్పుడు నా ఆస్థి సర్వస్వం. ఇప్పుడే ఎలెక్షన్‌లలో పోగొట్టుకొన్న డబ్బుకు ఎన్నంతలో లాభం కలిగేందుకిది చక్కని మార్గం."

పరంధామయ్య మంచి అదునుచూచి, చక్కని క్షేత్రములో మంచి విత్తనం నాటాడు. దానికి ప్రకృతి దోహద మిచ్చింది. విత్తనం మొలిచి అప్పుడే చెట్టు కాసాగింది....

ఈ యిచ్చిపుచ్చుకోలు వ్యవహారములోని సాధకబాధకాలను గురించి నారాయణరావు రెండు దినములు తనలో తాను బాగా ఆలోచించుకొన్నాడు. ఆలోచించే కొలది అది పెన్నిధివలె తోచిందాతనికి.

ప్రసన్న యిప్పుడు తన అధీనంలో వుంది. ఆమె తండ్రి సోమసుందరం ఏమయ్యాడో దేవుడెరుగు. అతడు సన్యాసులలోచేరి వుండడమో లేక మరణించి ఉండడమో సంభవనీయమని నారాయణరావు నిశ్చయించుకొన్నాడిదివరకే. కాబట్టి యిప్పుడు ప్రసన్నమీద తనకు సర్వాధికారం కలదు. ఆమె తాను చెప్పినట్టు వినాల్సిందే. వినకపోతే నిర్బంధించే అధికారం తనకుంది. ఇంతకు తానీరీతిగా ఆమె కేలాటి అన్యాయము చేయడం లేదు కదా అని ఆతని తలంపు. నారాయణరావు దృష్టి ఇప్పుడు పూర్తిగా శంభుదాసుయొక్క ఆస్థిపై బడింది. బిడ్డ, కొడుకుల ద్వారా దానిమీద కూడ తన అధికారాన్ని చెలాయించవచ్చుకదా అనే పేరాశ నడుమ అతనికి ఇతర విషయాలన్నీ అల్పస్వల్పాలుగానే కినబడసాగాయి. తనకంటె తక్కువ ధనము కలవాని కెవనికైన ప్రసన్న నిస్తే అప్పుడామెకు తండ్రి భాగాన్ని పంచి పెట్టవలసి వస్తుంది. ఆమె ఊర [illegible] దూరకుండకపోవచ్చు. శంభుదాసే అల్లుడైతే....

వచ్చి, మీతో అన్ని సంగతులు మాట్లాడవలెనని ఉన్నారు. మీకేమైన ఆక్షేపణ కలదా?

"అబ్బే – అలా అడుగుతారెందుకు! ఈమాత్రం మీరు మాకు ఉపకారం చేయడానికి పూనుకొన్నారు. ధన్యవాదాలు."

"అదంతా ఎందుకండి. మీకు కాకపోతే నే నింకెవరికి సహాయ పడాలి? రేపు దినశుద్ధి బాగానేవుంది – తదియ గురువారం. మధ్యాహ్నం మూడింటికి రాహుకాలం పోతుంది. మేము నాలుగింటికి రావచ్చునా?"

"ఇంకా అడగడమెందుకండి. మీరు వస్తామన్నవేళకు మేము సిద్ధంగా ఉండగల మంతే."

మరికొంతసేపు మాట్లాడుకొన్నాక పరంధామయ్య మరల నారాయణ రావును చూచి సంగతంతా చెప్పి, సాయంకాలం ఆరుగంటల కిల్లుచేరు కొన్నాడు. అతన్ని చూచి భార్య "ఏమండీ, ఉదయం వెళ్ళినవారు యిప్పుడా యింటికి వచ్చేది. ఇప్పు డయ్యగారికి రాజకీయా లేవో చాల పట్టుపడినాయే. నే నొక్కతె యింటిలో దినమంతా గుటకలు మింగుతూ కూచోవాలా?" అని ఏదో వెటకారంగా చేతులు త్రిప్పవచ్చింది.

"తాళవే, మంగా, ఎందుకలా ఎగిరిపడతావు? నీ రొట్టె నేతిలో పడేకాలం సమీపించింది. నీ కాసులదండకోసరం నే నెన్నితంటాలు పడుతున్నానో నీ కేమెరుక? నీ ముద్దు తీర్చకపోతే నా బ్రతుకెందుకే?" అని భార్య బుగ్గమీద చిటికెవేసి ఆనాటి సంగతంతా వివరించి చెప్పాడు పరంధామయ్య ఆమెతో.

మంగమ్మ మొగము చేటంత అయింది. మగ డెంత అఘటనా సమర్థు డయ్యాడా అని ఉబ్బి తబ్బిబయ్యింది. ఇన్నాళ్ళుగ మరచిన కాసులదండమీది కోర్కె మరల రేకెత్తింది.

మరుసటిదినం ఉదయం పరంధామయ్య మరియొకమారు అమితో

త్సాహంతో శంభుదాసు యింటికి వెళ్ళి సాయంకాలం ఐదు గంటలకు నారాయణరావుతో వస్తానని చెప్పి వచ్చాడు.

అరుంధతి ప్రత్యేకంగా చూచుకోవలసిన దేమి లేదు. ఆ యింట ఎప్పుడు అన్నివిధాలా వైభవం వెలసిపోతూ వుంటుంది. ఆమె సహజంగానే అందకత్తె. ఇంక అలంకణాలతో అపరరతి అయిపొయ్యింది.

నారాయణరావు ఆదేశాన్ననుసరించి పరంధామయ్య సరిగ నాల్గు గంటలకు వారి యింటికి వెళ్ళాడు. వారి కార్యక్రమ మేమాత్రం పైకి పొక్కలేదు. ఇద్దరు కలిసి ఎక్కడికో వెళ్ళదలచినట్టుకూడ శ్యామసుందరికికాని, ప్రసన్నకుకాని తెలియదు — తెలిసికొనేందు కవకాశంలేదు. పరంధామయ్య సలహా ననుసరించి తన గదిలోనున్న ప్రసన్న ఫోటోను తీసి తన హ్యాండ్‌బ్యాగ్‌లో ఉంచుకొన్నాడు నారాయణరావు. టిఫిన్ తీసికొంటూ భార్య వినేటట్టు అతడు "పరంధామయ్యగారూ, మీకేదైన వేరేపని ఉందా?" అని ఆమెను మభ్యపెట్టేందు కడిగాడు.

"నాకేమి పనిలేదండి" అని పరంధామయ్య ఏమీ తెలియనట్టు చెప్పాడు.

"సరే, మీతో పని వుంది. అలా పోయివద్దాము రండి."

అని టిఫిన్ ముగిశాక నారాయణరావు కారులో బయలుదేరాడు పరంధామయ్యతో శంభుదాసు యింటికి. కారు గేటు దాటీదాటకముందే అక్కడ వున్న ఘూర్కాలలో ఒక్కడు 'తుసుక్కు'న తుమ్మేశాడు. నారాయణరావు దాన్ని గమనించలేదు. కాని, పరంధామయ్య గమనించి మనసులో కొంత నొచ్చుకొన్నాడు. అయినా, 'భగవంతుడున్నాడు' లెమ్మని సమాధానపడ్డాడు.

పోర్టికోలో కారు ఆగింది విని శంభుదాసు బరబర వచ్చినారాయణ

రావుకు నమస్కరించి లోపలి కాహ్వానించాడు. అరుంధతి లోపలిగదిలో నుండి రాలేదు.

విశాలమైన ఆ భవనముయొక్క అందాన్ని, చుట్టూ వుండే తోట సొబగును, నౌకర్ల ప్రవర్తనను చూచి తృటిలో గ్రహించాడు నారాయణ రావు గృహయజమాని వైభవాన్ని - అతడెప్పుడు అక్కడికి రాలేదు. వారిద్దరికి పరిచయముకూడ లేదు. ఒకరి నొకరు ఎప్పుడో చూచుకొన్నా రంతే.

హాలులో కూర్చున్నారు ముగ్గురు సోఫాలమీద. ఎటు చూచిన ఆధునిక పద్ధతుల్లో రాజసౌధంలోని అలంకారాలవలె అన్ని తీర్చి దిద్దబడి నాయి. శంభుదాసు, అతని కూతురుయొక్క ఉన్నతమైన అభిరుచి సంస్కారము అచ్చటి ప్రతి వస్తువు ఎలుగెత్తి చెబుతున్నాయి. నారాయణ రావు చాల తృప్తిపడ్డాడు అదంతా చూచి. ఒక విధంగా చూడబోతే తమ యింటి కీ యిల్లో, మా యింటికి తమ యిల్లో పోటీ పడినట్లు తోచిం దతనికి. రంగపురంలో యీ రెండిండ్లుతప్ప తక్కినవేవి యింత ముచ్చటగా ఉండవు - నిజమేమంటే, ఆ యిద్దరిని వదలితే ఆ వూళ్ళో వారిని మించిన ధనికు లుంటేగా ?

శంభుదాసు అప్పుడు బిడ్డను పిలిచి ఉపహారం తెప్పించమన్నారు. "వలదండీ, ఇప్పుడే నేను పరంధామయ్యగారు తీసికొనివచ్చా" మని నారాయణరా వన్నాడు. కాని, అంతమాత్రముతో ఆపని ఆగిపోతుందా? రాక రాక పెద్దమనిషి తమ యింటి కొస్తున్నాడంటే శంభుదాసు తగిన తిండి, తీర్థాలు తయారు చేయించకుండా ఉంటాడా ?

వంటమనిషిని, నౌకర్లను పనులకు పురమాయిస్తూ అటు ఇటు తిరిగే అరుంధతిని నారాయణరావు కన్నారచూచి, మనసార మెచ్చుకొన్నాడు. ఆ అమ్మాయిని చేపట్టితే తన కొడుకు నిజముగ అదృష్టవంతు డౌతాడని తృప్తి పడ్డాడు.

ఉపహారాలు, పానీయములు అయ్యాక ముగ్గురు లోపల హాలులోకి వెళ్ళి కూర్చున్నారు. అక్కడవారేమి మాట్లాడుకొన్న బయటివారికి వినబడదు. అరుంధతి అందుకు చేరువగా ఉండే తన గదిలో, తలుపు లోరగ మూసికొని కూర్చొనింది. అప్పటికి వారి సంభాషణలు బాగా వినబడగలవు.

# 20

పరంధామయ్యే ముందుపడి మాట్లాడాడు.

"శంభుదాసుగారూ, నిన్న మీతో చెప్పినట్టు నారాయణరావుగారు మాట్లాడ్డాని కొచ్చారు. వారి కొమారుడు రామమోహన్, కూతురు ప్రసన్నకుమారి ఫోటోలుకూడ తెచ్చారు."

నారాయణరావునుండి ఆ రెండు గ్రహించి పరంధామయ్య, శంభుదాసు కందిచ్చాడు. వాటిని పరిశీలించి చూచిన దాసుయొక్క సంతృప్తి అతని ముఖంలో వ్యక్తమైంది. "అమ్మాయ్, అరుంధతీ!" అని పిలిచాడతడు. ఆమె వచ్చి తండ్రి కుర్చీ కానుకొని నిలబడింది. "వీరేనమ్మా పరంధామయ్యగారు మనతో చెప్పిన నారాయణరావుగారు" అనేసరికి ఆమె అతనికి నమస్కరించింది. లజ్జావనితయైన ఆమె ముఖబింబ మసదృశమైన లావణ్యముతో తొణికిసలాడిందా సమయంలో.

శంభుదాసు, రామమోహన్ ఫోటోను బిడ్డకుచూపి "ఇతడే నారాయణరావుగారి కుమారుడు రామమోహన్" అనేసరికి, పరంధామయ్య "ఆ రెండవ ఫోటోనుకూడ చూపండి అమ్మాయికి" అని, ఫోటోలను పరికిస్తూవుండే అరుంధతితో "ఆమెయేనమ్మా ప్రసన్నకుమారి" అన్నాడు.

నారాయణరావు బాగా గమనించాడు తండ్రి, బిడ్డల నిద్దరిని. పరంధామయ్య చెప్పినట్టు శంభుదాసు అంత వయసుమీరినవాడిలాగా అతని కన్పడ కనబడలేదు. నిజమైన వయసుకు, ఉన్నరీతికి చాలా తేడా కనిపించింది. వివాహోచితమగు వయస్సు దాటలేదని నారాయణరావు నిశ్చయించుకొన్నాడు. ఇక అరుంధతిని తన కోడలుగా గ్రహించే విషయములో ఏకోశాన అతని కనుమానం కనిపించలేదు.

పరంధామయ్య చూచి రమ్మంటే కాల్చి వచ్చేరకం. తానిక జాతకాలను పరిశీలించి చూడవలసి వస్తుందని ముందుగనే ఊహించి, ఆ పనిని సొంతంగా చూచుకొనే వచ్చినాడు. శంభుదాసు, ప్రసన్నకుమారి జాతకాలను గురించి, రామమోహన్ అరుంధతి జాతకాలను గురించి అతడు చెప్పిన సంగతులన్నీ ఉభయులకు సంతృప్తి నిచ్చాయి.

ఒక అరగంటసేపు విషయాలన్నీ చర్చించుకొన్నారు శంభుదాసు, నారాయణరావు, పరంధామయ్య సంభాషణల్లో పాల్గొన్నాడు. సారాంశమేమంటే—రామమోహన్‌కు అరుంధతిని చేసుకొనేందుకు నారాయణరావు తన సంపూర్ణమైన అంగీకారాన్ని సూచించాడు. శంభుదాసుకు ప్రసన్న నిచ్చే విషయంలోకూడ అతడు సమ్మతిని వెల్లడించాడు. కాని, ఒకమారు ఇంట్లో ఆడంగులతో మాట్లాడి తీర్మానిస్తా నన్నాడు. ఒకవేళ వారు సమ్మతించకపోతే" అనే ప్రశ్న వచ్చింది శంభుదాసునుండి. వారితో ప్రస్తాపించడం లాంఛనమాత్రమేనని, వారిని సమ్మతింపజేసే భారము తనదని నారాయణరావు సమాధానమిచ్చాడు. రెండు వివాహాలు ఒకదినమే జరిగేట్టు చూడాలని పరంధామయ్యను ముహూర్తం విషయమై ఆలోచించమని చెప్పారు. అరుంధతి రామమోహనుని పెండ్లియాడేందు కొప్పుకొంది.

ఇక కొన్నాళ్ళలో ముందు జరుగవలసిన వివరాలన్నిటిని గురించి పరంధామయ్యతో చెప్పి పంపుతానని, అప్పుడు మరల ఒకమారు తా

ముభయులు కలుసుకోవచ్చునని శంభుదాసురో చెప్పి. నారాయణరావు అతని వద్ద సెలవుతీసికొన్నాడు. పరంధామయ్యకూడ వెళ్ళిపోయా డతనివెంట.

నారాయణరావు మనసులో ఎలెక్షన్ పరాజయమువల్ల విచారం మరుగుపడి, దాని స్థానాన్ని వివాహ విషయికమగు ఉత్సాహము ఆక్రమించుకొంది. భర్తయందలి యీ పరివర్తనానికి శ్యామసుందరి సంతోషించింది. కాని, దాని కారణ మేమిటా అని దీర్ఘంగా ఆలోచింప సాగిందామె, ఆమె కేమి పాలుపోలేదు. భర్త యింగితమేమి అర్థము కాలేదు. ఆ దినం పరంధామయ్యతోకూడ కారులో వెళ్ళిన దెక్కడికని రహస్యంగా డ్రైవరు నడిగి తెలుసుకొంది శంభుదాసు యింటికి వెళ్ళినట్లు. అతని నామె చూచి ఎరుగదు. పేరుమాత్రం విన్నదంతే. అతని ఇంటికి పరంధామయ్యతో వెళ్ళవలసిన అవసరమేమి వచ్చిందా అని ఆలోచించి ఏమి అర్థంకాక 'ఏవోలే మగవారి పను'లని తన్నుదాను సమాధానపరచుకొంది. ఏదైన వినదగిన సంగతుంటే తనతో భర్త చెప్పకపోడని ఆమె సమాధానం.

తరువాత నారాయణరావు మూడు దినము లాలోచించాడు. భార్యకు తన ఆలోచనలను గురించి చెప్పి, ఎట్లు సమాధానపరచాలనే సంగతిని ఆమెతో ఏది ముందుముందుగా చెప్పవద్దని పరంధామయ్యను ఆరంభములోనే కట్టడిచేశాడు. రామమోహనునికి తగిన కన్యను చూచివచ్చానంటే నేమో ఆమె సంతోషిస్తుంది. కాని, శంభుదాసుకు ప్రసన్నకుమారి నియ్యదలచానంటే పరిణామ మెట్లుంట్లుదో అని అతని భయము. అయినా అత డింతకు జంకేవాడుకాదు. ఎవరి అభిప్రాయా లేలాగున్నా తన పట్టే చెల్లాలి అనేవా డతడు. ఒకవేళ అందరు తన మార్గానికి వచ్చారా, సంతోషం — లేకుంటే ప్రసన్నను నిర్బంధంగా శంభుదాసు కంటగట్టాలని నిశ్చయించుకొన్నాడు నారాయణరావు.

శంభుదాసు యింటికి పోయివచ్చినాక నాల్గవదినం శ్యామసుందరి

భర్త గదిలో కూర్చొని, అతనికి తమలపాకులు మడిచి యిస్తూ, మగడు ఉల్లాసంగా వుండడంచూచి యిలాగన్నది.

"ఏమండీ, కావలసిన వేవో అయిపోయాయికదా, పరంధామయ్య యింకా ప్రసన్నకు తగిన వరుణ్ణి చూడలేదే, ముందేమాలోచించాడు ?"

"శ్యామా, పరంధామయ్య అంటే ఏమనుకొన్నావు. అతడు నీ వనుకొన్నంత ఛాదస్తపు బ్రాహ్మణుడు కాడు. మంచి యుక్తిపరుడుసుమా. చూచి రమ్మంటే కాల్చి వచ్చే రకం."

"సరేకాని, మనపని నెంతవరకు సాధించాడో చెప్పండి."

"ఆ సంగతంతా మూనాళ్ళక్రిందే నాతో చెప్పాడు. నీతో చెప్పుదా మనుకొంటూనే ఆలశ్యం చేశాను. ప్రసన్న కప్పుడే అంతా నిశ్చయ మైంది. ముందుగా యీ సంగతి విను. రామమోహనునికి బహు చక్కని పిల్ల కుదిరింది."

శ్యామసుందరి సంతోషం ప్రకటించకుండ ఉండలేకపొయ్యింది.

"ఎక్కడ ?"

"ఈ వూళ్ళోనే."

"అంటే ?"

"శంభుదాసుగారి పేరు విన్నావా ఎప్పుడైనా ?"

"ఓహో, అతడా, బొంబాయిలో వుండి వచ్చినాతడు ?"

"అవును. అతన్ని గురించి మన కింతవరకు అంతగా ఏమి తెలీదు. పరంధామయ్య అంతా భోగట్టా చేశాడు."

"అన్నట్టు మీరు, అతడు మూడు రోజులక్రితం వారి యింటికి వెళ్ళివచ్చారటకాదా ?"

"అవును. ఎవరు చెప్పారు నీకాసంగతి ?"

"ఎట్లో తెలిసిందిలెండి. సంగతేమిటో చెప్పరాదు."

"అతనికి అరుంధతి అనే కూతురుంది. ఎంతబాగుందనుకొన్నావు. ఫోటో తెచ్చాను చూడు"మని అతడు తన హ్యాండు బ్యాగ్‌లో ఉంచుకొన్న శంభుదాసు, అరుంధతి ఫోటోలు తెచ్చి చూపాడామెకు.

శ్యామసుందరి అమ్మాయి ఫోటోను చూచి చాల సంతోషించింది.

"ఈమెను మన రామమోహనునికి చేసుకొందా మంటారా ?"

"నీ అభిప్రాయమేమి ?"

"అమ్మాయి బాగానేవుంది. అబ్బాయికి ఏమి ఆక్షేపణ వుండ దనుకొంటా. అయినా నిశ్చయమయ్యేందుకు ముందు వాడూ ఒకమారు చూడాలికదా ?"

"ఎవరొద్దన్నారు ? వా దొకడేమిటి ? నీవు చూడాలి, ప్రసన్న చూడాలి, అందరు చూడాల్సిందే."

"మరి, యీతని ఫోటో ఎందుకు తెచ్చారు ?"

"అతని కెంతవయసుందంటావు ?"

"ఏమో నాకేలాగు తెలుస్తుందండి. ఫోటోల్లో ముసలివాండ్రు పిల్ల వాండ్లలాగ కనిపించొచ్చు, పిల్లవాండ్రు ముసలివారిలాగా కనిపించవచ్చు."

"నే నతన్ని చూచి చెబుతాగా ? అతడీ ఫోటోలో ఉండేవిధంగానే వున్నాడు."

"నభై ఏండ్లు ఉండొచ్చు ననుకొంటా ?"

"శబాష్, బాగాచెప్పావు. ఉండేదేమో అంత - అంతకు 3 - 4 ఏండ్లు ఎక్కువ కావచ్చు కాని, మనిషిమాత్రం యింకా ఐదేండ్లు తక్కువ వున్నట్టే కనబడుతాడు."

"కావచ్చు. కాని, అతని వయసుకు, అరుంధతి పెండ్లికి సంబంధ మేమి ?"

నారాయణరావు తాను చెప్పదలచిన అసలు సంగతిని చెప్పేందుకు సిద్ధపడి భార్య నింకా దగ్గరికి రమ్మని ఆమె చెవిలో మెల్లగా "ప్రసన్నను శంభుదాసు కిద్దా మనుకొన్నా" ననేశాడు కథయొక్క కీలక మంతా అక్కడే వున్నట్లు గ్రహించి.

ఆ మాట వింటూనే శ్యామసుందరి ముఖమంతా కుంచించుకు పోయింది. పెదవులమీది మందహాస మంతరించింది. బొమముడి పడింది.

"ఇదేమిటండి మీ రనేది? ఉన్నట్టుండి ఎంత విపరీతమైన ఆలోచన చేశారు? ఇదికూడ పరంధామయ్య ప్రజ్ఞావిశేషమేనా?" అనింది కొంత కటువుగా.

"ఏం, యిందులో దోషమేముంది?"

"చాలించండి, వింటే ఎవరైన నవ్విపోతారు. వెర్రితీరె రోకలి తలజుట్టు మన్నట్లుంది మీ ఆలోచన. బలేవాడే పరంధామయ్య – మంచి సలహానే యిచ్చాడే?" అని శ్యామసుందరి తన అయిష్టాన్ని మోమాటం లేకుండ ప్రకటించింది.

నారాయణరావు కామె చర్య సరిపడకపోయినా ఓపికను వహించి మరల యిట్లన్నాడు. "వెఱ్ఱిమొగమా! నడుమ పరంధామయ్య నెందు కంటావే, ఆలోచన నాకు నచ్చిందే? అంతా సాంతంగా వినకుండ అప్పుడే ప్రారంభించావు తలపట్లు."

"మీకుమాత్రం ఎట్లా నచ్చిందండి యీ సంబంధం? బంగారులాంటి అమ్మాయిని యీ రెండవపెండ్లికి, వయసు దాటినవానికి అంటగట్టేంత అవసర మేమొచ్చింది? సరియైన వరుడు దొరక్కపోతే యింకా కొన్నాళ్ళు విదానిస్తే పోయింది."

నారాయణరావు ఓపిగ్గా తన మనసులోని సంగతంతా వినిపించాడ

భార్యకు. చెప్పతగ్గ ముఖ్యాంశాలను విశదంగా చెప్పాడు, అతని అభిప్రాయ మంతా గ్రహించింది శ్యామసుందరి. అతనితో యీ విషయమై ఏభకీ వించేందు కామె ఎంతమాత్రం సుముఖంగా లేనట్లు ప్రకటించింది. బిడ్డపైన ప్రేమకంటే అతని కిప్పుడు శంభుదాసు ఆస్తిమీద మమకార మధికమైనట్లు బోధపడిం దామెకు. "ఎందుకండీ యింత విడ్డూరమైన ఆలోచన చేశారు? మనకు డబ్బువిషయమై ఏమి కొరత వుందని పరుల ధనాని కిట్లు ఆశపడి, అమ్మాయి జీవితాన్ని ఉసూరు మనిపిస్తారు. దానికి తల్లి దండ్రులు మనమే కదా? ఆమె సుఖాన్ని చూడవలసింది మన కర్తవ్యం కాదా? చేత చిక్కిందికదా అని మన ఇష్టానుసారం ఆ ముసలివాణ్ణి పెండ్లాడమంటే అది యిష్టపడుతుందా? ఒకవేళ దాని తల్లిదండ్రులే వుంటే యీలాంటి ఆలోచన చేసేవారేనా? ఇప్పటికి పదిమందిలో జరిగిందే అవమానం, నిష్ఠూరం చాలును. ఇంకా రచ్చకెక్కాలని వుందా మీకు?" అని కసరినట్లు మాట్లాడి శ్యామసుందరి యింక అక్కడ నిలబడకుండ చరాలున లోపలికి లేచిపొయ్యింది.

నారాయణరావు తల పట్టుకొని కూచున్నాడు కొంతసేపు. కీడెంచి మేలెంచినట్లు యిదివరకప్పుడే నిశ్చయించుకొన్నాడు ఒకవేళ భార్య, ప్రసన్న, కొడుకు యీ విషయములో తన కెదురైతే తానేమి చేయవలసింది. శ్యామసుందరి నిరాకరణవల్ల అతని మూర్ఖ ప్రకృతి రెచ్చగొట్టబడిందే కాని తన అభిప్రాయాన్ని మార్చుకో లేదతడు. తన మాట కెదురాడిందికదా యని ఆమె మీద కోపము హెచ్చింది. తన్నెవరైన యీ విధంగా ఎదిరించారంటే నారాయణరావులోని మృగ లక్షణం విజృంభించి పోవడమాతని నైజ గుణము. మానవత్వానికి స్థానమే లేకుండ పోతుంది. ఇన్నాళ్ళు, అతనితో కాపురం చేస్తున్న శ్యామసుందరి కీసంగతి బాగా తెలిసికూడ్ను ఆమె యీ పట్టున కొంత పొరబాటు చేసిందనే చెప్పాలి. తన కతని ఛన సరిపడకపోయిన, కొంత తమాయించుకొని, అతని మాటకు

'ఊ' గొట్టి పిదప ఏదో ఉపాయాంతరముతో అతన్ని దారికి తెచ్చే ప్రయత్నం చేయాల్సిందామె.

రెన్నాళ్ళు ఆలుమగలిద్దరు ఎడాపెడ వుండటం గమనించారు మాణిక్యం, ప్రసన్న యిద్దరు. మాణిక్యానికి ధైర్యం చాలదు అదేమని శ్యామసుందరిని ప్రశ్నించేందుకు. ఉండబట్టలేక ప్రసన్నే అడిగింది కాని, శ్యామసుందరి ఏమి చెప్పకపోవడమే కాక, ఆమె సమక్షంలోను, ఏకాంతంగాను కన్నీరు కార్చసాగింది. అది ప్రసన్నకు మరింత హృదయ విచారకమైంది. సరి, ఏదో వెనుకటి సంగతులను గురించి భార్యాభర్త లెప్పుడో తనకు తెలియకుండ కీచులాడుకున్నారని, నారాయణరావేదో అభూయిత్యపు మాట లని ఉంటాడని, అందుకే ఆమె అలాగుందని ప్రసన్న, మాణిక్యం తలంచారు.

మాణిక్యం ఆ యింట్లో కేవలం వంటమనిషి మాత్రం కాదు. అందరికంటె హెచ్చుగ ఆమెకు ప్రసన్న విషయంలో చాలా చనువుంది. కారణం, తల్లి సులోచన చనిపోయాక, తండ్రి సోమసుందరం రెండేండ్ల బిడ్డను వదలిపోయినప్పటినుండి ప్రసన్న కామె పెంపుడు తల్లి. సోమసుందరం భార్యకు మాణిక్యం దూరపు బందుగురాలు కూడ. ఏదో లేని స్థితిలో, ఆదరించే వారెవ్వరు లేక, చిన్నతనములోనే విధవాత్వం సంభవించి సులోచన జీవితకాలంలోనే ఆయింట్లో చేరింది. ఈ పద్దెనిమిదేండ్లనుండి ప్రసన్న నామె కన్నబిడ్డ కంటే అధికంగా పరామర్శిస్తూ కాపాడింది. శ్యామసుందరి ప్రేమ ఒక విధమైతే, మాణిక్యం ప్రేమ ప్రసన్న యెడ మాతృవాత్సల్యమని చెప్పాలి. అందుచేత ప్రసన్నకు కూడ మాణిక్యం వద్ద శ్యామసుందరివద్ద కంటే చనువెక్కువ. నారాయణరావు కాని, శ్యామసుందరి కాని, మాణిక్యాన్ని ఎన్నడు తమ నౌకర్ల వర్గములో కలిపిచూచింది లేదు. వంటకని నౌకర్లుంచుకొంటే వారంత శ్రద్ధగా పనిచేయరని మాణిక్యమే వద్దని శ్యామసుందరితో చెప్పి, సోమసుందరం వెళ్ళిపోయాక, ప్రసన్నతో

ఆ యింటికి వచ్చింది మొదలు తానే ఆ పని చూచుకొంటూ వుంది. అందులో మాణిక్యం వంట అంటే ఏనలపాకమో, భీమపాకమో అని అందరు మెచ్చుకొంటూ వుంటారు. ఆ శాస్త్రములో ఆమె నైపుణ్య మలాంటిది.

# 21

మూనాళ్ళయ్యాక శ్యామసుందరే కొంత మెత్తపడి నట్లయింది. మగనితోబాటు తానుకూడ శరించి కూర్చుంటే బాగుండదని ఆమెకు తోచిందికాబోలు. క్రమంగా తన బిగింపును తగ్గించి అతనితో మాటలాడ సాగింది. తనతో మాట్లాడకూడదని భీష్మించుకొన్న నారాయణరావును మరల కొంత ప్రసన్న హృదయుణ్ణి చేసుకోగలిగింది.

మరల ఒకనాడు అతడు ఏకాంతముగా భార్యతో తనగదిలో కూర్చుని పూర్వ విషయాన్నెత్తాడు. అది కనిపెట్టి మాణిక్యం, కొంత నేర్పుతో, వారిద్దరికి తెలియకుండ ప్రక్కగదిలో ప్రవేశించి, వారి సంభాషణా సారాంశాన్ని వినగలిగిందానాడు.

మాణిక్యాని కిప్పుడంతా అర్థమైంది. శంభుదాసుకు ప్రసన్న నిచ్చే విషయంలో నారాయణరావు కృతనిశ్చయులై యున్నట్లుంది. అతనికి కావలసింది ధనము. తరువాత బిడ్డయొక్క ముచ్చట. తన మాటను ప్రసన్న కాదనిందంటే నిర్బంధించి అయినా ఆమెను శంభుదాసు కంటగట్టే స్థితిలో ఉన్నాడతడు. ఆ విషయమై తమలో తమకు ఏకాభిప్రాయం కుదరడం బాగని నారాయణరావు భార్యకు బోధిస్తూ, ప్రసన్నను తిన్నగా [illegible] ఒప్పుని ఆమెను బలవంతం పరుస్తున్నాడు.

శ్యామసుందరి యిందుకు సుతరాం అంగీకరించకుండా ఉంది. ఏమియు తెలియని గోల ప్రసన్న విషయమై ఆమె అమితమైన వాత్స ల్యాన్ని కనబరుస్తూ తన బొందెలో ప్రాణముండగ ఆ చిన్నదాని కన్యాయం జరుగ నియ్యనని శపథం చేసినట్టు చెబుతూవుంది. ప్రసన్న విషయంలో శ్యామసుందరి యీ రీతిగా వకాల్తా పుచ్చుకోవడం నారాయణరావు సహించ లేకున్నాడు. ఇద్దరు పట్టిన పట్టును వదలేస్థితిలో లేరు. దీనికంతా పరంధామయ్యే కారకులైనట్లు, అతడు కలిగించిన దురాశయే నారాయణ రావు నిట్లు పిచ్చివాణ్ణి చేసివేసిందని కూడ తేలిపోయింది వారి సంభాషణలో.

ఇక శ్యామసుందరి యీవలికి వస్తుందని గుర్తించిన మాణిక్యం ఉపాయంగా వంటింట్లోకి జారుకొంది. తల్లిదండ్రులు లేని ప్రసన్న తమ్మే తల్లిదండ్రులని నమ్మి, హృదయమార ప్రేమించినందు కిప్పుడామె కా యింట జరుగనైఉన్న దురన్యాయ మెట్టిదో తెలిసికొన్న మాణిక్యం హృదయంక్రోధాన్నితో భగ్గుమనింది. శ్యామసుందరి యశక్తత కూడ ఆమె గ్రహించగలిగింది. అందుకుతానేమి చేయగలదు. మగడు అంతకంతకీ విషయంలో రాక్షసుడై పోతుంటే అడ్డమై యేడ్వడమూ, మనసార ప్రేమించే ప్రసన్న కష్టాల్ని సహించడమూ, లోకాపరాధానికి భయపడడమూ ఇది శ్యామసుందరి దుస్థితి.

మరల ప్రారంభమైంది ఆలుమగల వైముఖ్యత యింటిలో అది మునుపటికంటె స్పష్టంగాను, తీవ్రంగాను కనిపించింది ప్రసన్నకు, మాణి క్యానికి. ప్రసన్న యిక ఉండబట్టలేక, ఒకనాటి మధ్యాహ్నం, మాణిక్యం ఎదటనే శ్యామసుందరిని యిక్కచ్చిచేసి అడిగింది. "ఎందుకమ్మా, నీవు నాన్న అంత విముఖంగా" ఉన్నారని. శ్యామసుందరికేమి చెప్పడానికి నోరాడలేదు. ఊరక చీరకొంగుతో కన్ను లొత్తుకోసాగింది. ప్రపంచ జ్ఞానము కలిగిననాటి నుండి ప్రసన్న నేటి వరకు శ్యామసుందరి ఏనాడు

కన్నీరు పెట్టింది చూచి ఎరుగదు. ఇప్పుడామె దుఃఖాన్ని చూచి ఆ చిన్నది హృదయం తల్లడిల్లిపోసాగింది. మాణిక్యానికి కారణం తెలిసినా ఆమె తనకేమీ తెలియనట్టు, అంతా శ్యామసుందరి నోటితోనే చెప్పించ దలచి, ప్రసన్నతోబాటు తానుకూడ ఆమెను నిర్బంధించసాగింది విచారానికి కారణమేమో తెలుపుమని. ఆడువారి దుఃఖం ఆడువారి దగ్గరనే బాగా ప్రదర్శితమౌతుంది.

శ్యామసుందరి ప్రసన్నను కౌగలించుకొని మరింత ఎక్కువగా దుఃఖింప మొదలెట్టింది. ఆ స్థితిని చూచి సహించలేని ప్రసన్న మనసు కరిగిపోవుటచే ఆమెకు కూడ ఏడుపాగింది కాదు మనసులో క్రోధ మొకవంక బుసకొట్టుతున్నా, మాణిక్యం స్త్రీ సహజమైన మృధుభావాన్ని వదలకుండ, ప్రసన్నకు జరగబోయే అన్యాయాన్ని తలంచి కంట తడి పెట్టు కొంటూ, శ్యామసుందరిని ఓదార్చి కారణం చెప్పమని ఏమి తెలియని దాని వలె బలవంత పెట్టసాగింది.

కడకు శ్యామసుందరి వారిద్దరితో భర్తయొక్క అభిప్రాయాన్ని విశదీకరించి చెప్పి, తానందుకు పూర్తి వ్యతిరేకిస్తూ వుండడమే తన విచా రానికి కారణమని తెలిపింది. మరుగున నిలబడి ఆమె మాటల ధోరణిలోని సత్యాన్ని గ్రహించిన మాణిక్యానికి, శ్యామసుందరి చెప్పినదంతా యదార్థ మని ఆమె మనసులో కల్లాకపటము లేనిదని బాగా తెలిసిపోయింది.

తల్లి మాటలు విన్న ప్రసన్న భయంకర వ్యాఘ్ర దర్శనముతో బెదరిపోయిన లేడివలె కంపించిపొయ్యిందా క్షణములో. తన్ను కన్నవారు లేకపోయినా, ఎంతో గారాబంగా తన్నింతకాలం పెంచి పెద్దదాన్నిచేసి తుదకు తనకీరీతిగా పినతండ్రి అన్యాయం చేయబూనుకొన్నాడనే సంగతి పాపం ప్రసన్న హృదయాన్ని కదలించివేసింది. ఆమె తన స్థితినంత క్షణమాత్రంలో గ్రహించి, తన్ను మ్రింగడాని కేదో దుష్టశక్తి మీద

పడవచ్చినట్లు "అమ్మాగా" అని ఆక్రోశిస్తూ పినతల్లి ఒడిలో తల దాచుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

అదిచూచి శ్యామసుందరి, మాణిక్యం పూర్తిగా కలతచెందిపోయారు. మృదు శిరీష కుసుమానికి హాని స్పర్శ తగిలితే చూచి ఎవరోర్వగలరు?

శ్యామసుందరి తన దుఃఖాన్ని అణచుకొని, ప్రసన్న నూరడిస్తూ, చెప్పవలసినదంతా చెప్పి, తుదిమాటగా యిట్లన్నది. ప్రసన్నా, నా బొందెలో ప్రాణ ముండగా నీ కన్యాయము జరుగనీయనమ్మా. నీలాటి సుకుమారి హృదయం నాకు తెలియదనుకొన్నావా? నీ కిష్టములేనివానికి నిన్నిచ్చి పెండ్లిచేయడానికి ఎవరు సాహసిస్తారో చూస్తానుగా. భయపడ వద్దు. ఇందువల్ల యీ ఇంట్లో ఏ మహాదారుణం సంభవించినాసరే, నేను నీ పాలిటి కన్నతల్లిగా నిన్ను రక్షిస్తాను, తల్లీ. ఊరడిల్లు"మని చెప్పింది. ఆ అమృతోపమానమైన అభయానికి ప్రసన్న కొంత ఊరడిల్లింది. మాణిక్యంకూడ తృప్తిచెందింది.

అసలే ఎలెక్షన్లలో దెబ్బతిని నగం పిచ్చివాడై పోయిన నారాయణ రావు, తన ఆలోచనతో భార్య ఏకీభవించకపోయేటప్పటికి, రానున్న సిరిని త్యజించేందు కిష్టపడక మరింత పిచ్చివాడై పోయాడు. తారక మంత్రం లాంటి ధనసంగ్రహణోపాయాన్ని తెలిసిన పరంధామయ్య అంటే అతని కిప్పు డెంతో అభిమానంగా వుంది. ఆ పాపిష్ఠి బ్రాహ్మణుడే తమ ఇప్పటి కుటుంబ కలహానికి కారకు డయ్యాడని గ్రహించిన నాటినుండి శ్యామ సుందరికి అతనిమీద అసహ్యం కలగడమేకాక ఒకనాడు నారాయణరా వింట లేనితరి వచ్చిన పరంధామయ్యను తల వాచేట్టు చీవాట్లుపెట్టి నానా విధాల నిందించింది. తరువాత నారాయణరావు యీ సంగతినంతా పరం ధామయ్య వల్లనే విని భార్యను నోటికి వచ్చినట్టు తిట్టి, ఆనాటినుండి వలసి నప్పు డతనిని తన గదిలోనికి పిలిపించుకొని, ఏదో కొంతసేపు గుసగుస

లాడి పంపించేయసాగాడు. ఇంటి యజమాని తనవాడైనప్పుడు యిల్లా లిని లక్ష్యపెట్ట నవసరం లేకపొయ్యింది పరంధామయ్యకు.

ఈమధ్య ఒకనాడు శ్యామసుందరి, మాణిక్యం, ప్రసన్న ముగ్గురే ఉన్న కాలంలో మాణిక్యం యీలాగన్నది శ్యామసుందరితో "అమ్మా, ప్రసన్న తన మనసులోని మాటను మీతో చెప్పటానికి జంకుతోంది" అని అనింది.

శ్యామసుందరి ప్రసన్నను దగ్గరి కీడ్చుకొని, తొడమీద కూర్చొ బెట్టుకొని, తల దువ్వుతూ "ఎందుకమ్మా నా వద్ద జంకు? చెప్పు తల్లీ, నీ మనసులో ఏముందో. నీకొరకు నే నే కష్టాన్నైనా ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉన్నాను. ప్రసన్నా" అని బుజ్జగించి అడిగింది. ఆమె వాత్స ల్యాన్ని చూచి మాణిక్యం మనసు సంతోషంతో గంతులేసింది. ప్రసన్న నునుసిగ్గుతో ఒకవంక పోరాడుతు, కన్ను లొత్తుకొంటూ, సాభిప్రాయంగా మాణిక్యంవైపు చూచింది.

"ప్రసన్న డాక్టర్ విజయకుమార్‌ను ప్రేమించిందమ్మా"

మాణిక్యం నోట యీ మాట రాగానే శ్యామసుందరి కొంత నిర్ఘాంత పోయినా, యింగితజ్ఞురాలు కాబట్టి, అంతలోనే తన్ను తాను సంబాళించు కొని, నవ్వు మొగముతో "మాణిక్యం, సింహంపిల్ల సింహాన్ని కోరుతుందే కాని, మరి దేన్నైనా ఆసిస్తుందా? ప్రసన్న కోరిక చాల సమంజసంగా వుంది. ఆ దినం నన్ను తేలు కుట్టినప్పుడు వచ్చిన విజయకుమార్‌ను చూచిన మొదట్లోనే నా కెందుకో అతడంటే ఎంతో అభిమానం ఉదయిం చింది. ఈ జంట చిలుకా గోరంకల్లా గుంటుందని అప్పుడే అనుకొన్నా నెందుకో నాకేతెలియదు. నీరు పల్లానికి పారుతుందేకాని మిట్టకుపోతుందా ప్రసన్న తన కనురూపుడైన భర్తనే కోరింది. బిడ్డా! ప్రసన్నా! విచా రించకమ్మా. నీ కోర్కె తీర్చడానికి నేనున్నాను. ఇప్పట్లో యేదో దుష్టశక్తి మన యింట్లో ప్రవేశించి, మీ నాన్న నిట్లాడిస్తూంది. కాని

లేకపోతే అతడుమాత్రం నీ ముద్దుముచ్చట్లు కోరేవారు కాదా? విచారించకు. సావకాశంగా, నే నతన్ని దారికి తెచ్చే ప్రయత్నం చేస్తాను. ఒకవేళ మీ నాన్న తన పట్టును వదలకపోతే, నేను కడవరకు వారిని ఎదిరించి అయినా నీ కోర్కెను నెరవేర్చితీరుతాను. నన్ను నమ్ము తల్లీ." అని ప్రసన్న చుబుకం కుదుపుతూ, చెంపలు సవరిస్తూ ప్రేమ ఉట్టిపడే లాగున సముదాయించింది. ఆమె వాత్సల్యానికి ప్రసన్న ముగ్ధురాలై, మాటలకు మించిన సంతోషాని, కృతజ్ఞతను ఒక్క కౌగిలింతతో వ్యక్త పరిచిందంటే, మాణిక్యం హృద్భారం తీరినట్టు నిట్టూర్చింది.

నారాయణరావు యింటి పరిస్థితు లిప్పుడు కాలే పెనుము మీద నుండి అగ్గిలోకి పడినట్టుంది.

ఇన్నాళ్ళు ఎలెక్షన్ గొడవలో పడి అతనికి కాని, ఇంటివారికి కాని శాంతిలేకపోయింది. ఆగొడవ దాటిపోయింది కదా, యింకేమి తొందరలు ఉండవని అందరు అనుకొన్నారు. కాని, పరంధామయ్య ప్రభావమో అన్నట్టు నారాయణరావులో దురాశ రేకెత్తి, ఆత్మీయులకే రెండెంచే పరిస్థితులేర్పడ్డాయి. శ్యామసుందరి మొదలగువారు ఆ బ్రాహ్మణుని తిట్టని ఘడియేలేదు. అతని నిప్పుడు వారెవ్వరు మాట్లాడించరు. నారాయణరావు మాత్రం మప్పుడప్పుడు పిలిపించుకొని, ఏదో మాట్లాడి పంపిస్తున్నాడు.

పూర్తిగ మదిరాపానం చేసినవానికి యుక్తాయుక్త జ్ఞానము నశించినట్లు నారాయణరావు దురాశలోపడి, పూర్తిగ మూర్ఖుడై పోయాడు. అన్న కాని, అన్నకూతురు కాని, భార్యకాని, మరెవ్వరు కాని అతని కిప్పుడు లక్ష్యము లేదు. తానేమొ మహా లాభకరమైన పధకం పన్నితే, వారంతా మూఢులై తన్నెదిరింపవచ్చినట్టు భావిస్తున్నాడే కాని, గురిగింజ తన క్రింది నలుపును తాను చూడనట్లు, తన తెలివిలేని తనాన్ని తాను గుర్తించలేకున్నాడు.

అరుంధతిని రామమోహనునికి చేసుకొనే విషయంలో ఎవ్వరికి ఏలాటి ఆక్షేపణ లేదు. అదొక్క సంగతే అయివుంటే ఆ యింట్లో ఎంత ఆనందం తాండవించి ఉండేది. శంభుదాసుకు ప్రసన్న నివ్వాలని నారాయణ రావు పట్టుపట్టడం వల్ల. అది శ్యామసుందరికి కాని, ప్రసన్నకు కాని యిష్టం లేకపోవడం చేత పరిస్థితి తారు మారై పోయింది.

గోరు చుట్టు మీద రోకటి పోటన్నట్లు ప్రసన్న విజయకుమార్‌ను ప్రేమించిందని విన్నప్పటినుండి నారాయణరావు కల్లుత్రాగిన కోతివలె మరింత రెచ్చిపోయాడు. తనకు ఎలెక్షన్‌లో ప్రత్యర్థిగా నిలబడిన నిరంజన రెడ్డికి కుడిభుజమై తన్నెదిరించిన విజయకుమార్ తన బిడ్డచే ప్రేమింప బడ్డాడంటే తన కెంత లోకువ కలిగించినట్టు? ఇంతవరకు అతనివల్ల తన కైన అవమానం చాలదా? స్వయంగా యింటికి వెళ్ళి అడిగితే మాధవరావు చెప్పిన ఆకుకు అందని పోకకు పొందని సమాధానమింకా అతని హృదయంలో ముల్లువలె గుచ్చుకొంటూవుంది. ఒకవేళ ప్రసన్న శంభుదాసును నిరాకరించినా సహింపవచ్చును కాని, విజయకుమారును ప్రేమించిందంటే తాను బ్రతికి ఉండగా ఆ పని వీలులేదు. ఇది నారాయణరావుయొక్క దృఢ సంకల్పము.

ఇందులో ప్రసన్న బుద్ధిపూర్వకంగా చేసిన పొరబాటేమి లేదు. మొదటిసారి విజయకుమార్ తల్లికి చికిత్సచేయడానికి వచ్చినప్పుడే ఆమె మనసు అతనిమీద లగ్నమైపోయింది. అప్పటి కతడు నారాయణరావుకు ఎదుటి పక్షములోని వాడని ఆమెకేమి తెలియును? ఒకవేళ తెలిసివుంటే మాత్రం అన్యథా జరిగి ఉండేపనా? సహజమైన ప్రేమ కడ్డంకు లుండవు. వినిర్మలమైన ఆ ప్రేమ ప్రవాహాన్ని మెరుపులాంటి కొండలు కూడ నిరోధించలేవు. ఇంతకు స్త్రీ పురుషుల కీరీతిగా ప్రేమసంఘటనలు కలిగాయంటే అవి పూర్వజన్మ సంబంధమైనవే కాని, వాటికి ప్రస్తుత జన్మలోని తర్కవితర్కాలు పనికిరావు.

ఈలోగా శ్యామసుందరి, మాణిక్యం, ప్రసన్న తరచుగ ఒక్కచోట చేరి తమలో తాము ఈ సంగతిని గురించి ఆలోచిస్తుంటే, నారాయణరావు తన ఆలోచనా సముద్రములో తానీదుకొంటూ వుంటాడు.

# 22

ప్రసన్నను తన కిచ్చి పెండ్లిచేసే విషయంలో నారాయణరావు సుముఖుడైనా, అతని భార్య యిష్టపడలేదని - అసలు ప్రసన్నకే ఇష్టము లేదని శంభుదాసుకు తెలియకూడదని నారాయణరావు జాగ్రత్త పడ్డాడు. పరంధామయ్యను హెచ్చరించాడీవిషయమై. అతడప్పుడప్పుడు శంభుదాసు ఇంటికి పోయివస్తూ శంభుదాసుకు పెండ్లిండ్ల విషయమై లేనిపోని ఆశలు కల్పిస్తూ వున్నాడు.

ఒకనాడు నారాయణరావు, పరంధామయ్య ఆలోచించుకొని, శంభుదాసు యింటికి వెళ్ళారు. ఒకమారు అతడు, అతని బిడ్డ అరుంధతితో తమ యింటికి వస్తే ఆడువారు చూడడం జరుగుతుందని శంభుదాసునకు సలహా యిచ్చాడు నారాయణరావు. శంభుదాసంటే చాలా వృద్ధుడేమో అని ఆపోహపడే శ్యామసుందరీ, ప్రసన్నలయొక్క మనసులు మార్చడానికది కొంత వీలౌతుందేమో అని అతని ఊహ. పరంధామయ్యకూడ ఆ మాటను సమర్థించాడు

ఆ మరునాడే శంభుదాసు, అరుంధతి కారులో నారాయణరావు ఇంటికి వెళ్ళారు. సమయానికప్పుడు పరంధామయ్య కూడ అచ్చటనే ఉండినాడు. ఎదురుచూచినట్టు వచ్చిన ఆగంతకులను గౌరవపురస్సరంగా ఆహ్వానించి నారాయణరావు "శ్యామా, ఈమె నీకు కాబోయే కోడ..."

అని అరుంధతిని చూపి ఆమె కప్పగిస్తూ, "ఇతనామె తండ్రి, శంభుదాసు అని శంభుదాసును పరిచయం చేశాడు.

వారాదినం తమ యింటికి వచ్చేసంగతి శ్యామసుందరికి ముందుగా తెలియదు. ఈ ఆకస్మికమైన ఆగమనమంతా భర్తచేసిన కుతంత్రమే అని గ్రహించింది. అయినా, యింటికి వచ్చినవారిని మర్యాదగా చూడడం తన ధర్మమని అరుంధతిని, శంభుదాసును గౌరవించింది. అరుంధతిని చూచి శ్యామసుందరి మనసులో చాల సంతృప్తి పడింది. క్షణకాలంలో ఆమెకు ప్రసన్నకు స్నేహం కలిసిపోయింది. ఇద్దరు ఒకరిని మించి ఒకరు అప్సరసల్లాగా వెలుగుతూ వుండే చూచి అందరు చాల సంతోషించారు. రామమోహన్‌కు అరుంధతిని పెండ్లిచేసుకొనే విషయంలో శ్యామసుందరికి ఇదివరకు ఏదైన అనుమానముండినా అదంతా ఇప్పుడు తీరిపోయింది.

ఇక శంభుదాసు సంగతి అతడేమంత వృద్ధుడు కాదు. అందమైన వాడే ఆరోగ్యవంతుడే, అంతా సరే. కాని అతన్ని పెండ్లిచేసుకొనేందుకు ప్రసన్న యిష్టపడలేదు. శ్యామసుందరికి అసలే యిష్టములేదు ఒక్కగాని ఒక్కపిల్ల నాతనికి రెండవ పెండ్లికిచ్చేందుకు. అయినా, అప్పుడు వారే విషయాన్ని ఎవరితోను చెప్పలేదు.

శంభుదాసు, అరుంధతి చాల సంతోషపడి వెళ్ళిపోయారు. ఇంటి వారు చూపిన గౌరవాదరణను బట్టి అరుంధతి ఆ యింటి కోడలుగాను తాను అల్లుడుగాను అవటం నిజమని శంభుదాసు పగటి కలలు గాంచ నారంభించాడానాటి నుండి.

పరంధామయ్య కెందుకో యీ పెండ్లిద్దు జరుగగలవనే ఆశ యిప్పు డిప్పు డంతరించిపోసాగింది. అయితే అరుంధతీ రామమోహనులకు పెండ్లి కావచ్చును కాని, మరియొకటి కాకపోతే, ఇదికూడ నిలిచిపోవచ్చు ననేందు కవకాశముంది. ఎట్లయితేనేమి, ఇదివరకప్పుడే అతని చేతికి వెయి'

రూపాయలొచ్చాయి. 'చచ్చినవాని పెండ్లికి వచ్చినంతే కట్నం చాల్ను' ననే సామెత ప్రకారం. ఎంత చేజిక్కిందో కడకంతే చాలు ననుకొన్నాడా దురాశాపూరిత చిత్తుడు.

శంభుదాసు బిడ్డతో వచ్చిపోయాక భార్య మనసు ఎట్లు మారిందో చూడాలని ఆ మరునాటి రాత్రి భోజనానంతరం నారాయణరావు ఆమెను తన గదిలోనికి పిలిచి ప్రశ్నించాడు. ఆమె మొదటి అభిప్రాయమేమి మారలేదు. "అరుంధతిని కోడుక్కి చేసుకొనేందుకు నాకెట్టి అభ్యంతరం లేదు. శంభుదాసుకు ప్రసన్న నిచ్చేది నాకిష్టము లేదు. అసలు ప్రసన్న కాపని అయిష్టంగా వుంది. ఆమె మనసు వేరుగా వుంది. ఆమె తండ్రి మనలను నమ్మి చిన్ననాడే మన చేతిలో పెట్టిపోయినందుకామె యిష్ట ప్రకారం విజయకుమార్‌కు యిచ్చి పెండ్లిచేయడం మన కనీస ధర్మ"మని ఖచ్చితంగా మరియొక మాట చెప్పి వెళ్ళిపోయింది.

'చెలిమిని చేదు మేపవచ్చును. కాని బలిమితో పాలు త్రాగించ రాద'ని నారాయణరావు మనసులో అనుకొని, ఆ మరుసటి దినం లాలనగా ప్రసన్నను దగ్గరకు పిలిచి, ఒంటరిగా ఆమెతో శంభుదాసును పెండ్లిచేసు కొనే సంగతిని గురించి ఎంత ఆశాజనకంగా మాట్లాడాలో అంత ఆశాజన కంగా, యుక్తి యుక్తంగా మాట్లాడాడు. కాని, ఆమె సుతరాం తనకీ పెండ్లి యిష్టంలేదని చెప్పి వెళ్ళిపోయింది.

నారాయణరావు మనసుపూర్తిగ విరిగిపొయ్యేంతపని జరిగిపొయ్యింది తుదకు. కడకు రామమోహనునకు జాబువ్రాసి పిలిపించుకొని అతని కన్నిసంగతులుచెప్పి "మీ అమ్మకు, చెల్లెలికి నచ్చచెప్పు" మన్నాడు. తండ్రివంటి దురాశాపరుడుకాని, అవివేకికాని కాదు రామమోహనుడు. అందులో చెల్లెలంటే అతనికి బహిఃప్రాణము. ఆమె కిష్టంలేని యీ పెండ్లి ఎంతమాత్రం జరగడానికి వీలులేదని తండ్రితో మోమాటం లేకుండా చెప్పినాడు. అంతటితో తండ్రి కొడుకు లిద్దరికి ఘర్షణ

ప్రారంభమైంది. రామమోహనుడు తల్లి, చెల్లెలిపక్షంవహించి తండ్రికి మనసు మార్చుకొమ్మని ఎంతదూరం చెప్పవలెనో అంతా చెప్పిచూచాడు. కాని, నారాయణరావు మనసు మరింత శిలించిపొయ్యింది. అతనికి కడకు కొడుకుమీదకూడ అసహ్యం కలిగింది.

ఎలెక్షన్‌గొడవ దాటిపోయాకైనా యింట్లో కొంత శాంతి వుంటుందనుకొన్న రామమోహను డీ తారుమారు పరిస్థితుల కన్నిటికి పరంధామయ్యే కారణభూతుడని తల్లివలన విని, అతనిని తండ్రి ఎదుటనే నానా విధముల దూషించినాడు. అది విని నారాయణరావు మరింత రెచ్చిపోయి "ఛీ – దుర్మార్గుడా! నన్నే ఎదిరించ సాహసించావా? పో – నా యిల్లు విడిచి" అని గద్దించాడు కొడుకును. "సరే" నని రామమోహన్ ఇల్లు విడిచి పొయ్యేందుకు సిద్ధపడినాడు. శ్యామసుందరి కొడుకును సమాధానపరిచింది. "అమ్మా, నే నింక మదరాసు పోను. నాకీ చదువు చాలు. ఈలాంటి అశాంతి పరిస్థితుల్లో నేనేమి చదవగలనమ్మా? ఇంతకు, నే నిక్కడ లేకపోతే చేజిక్కిన పక్షికదా అని ప్రసన్నగతి నేమిచేస్తాడో కడకు నాన్న? అందువల్ల నే నిక్కడే వుంటా" నన్నాడత డామెతో. కొడుకు మాటకు తల్లి సమ్మతించింది. ఆనాటినుండి రామమోహనుడు రంగపురములోనే నిలచిపోయినాడు. నారాయణరావు అతనితో మాట్లాడడమే మానుకొన్నాడు.

క్రమంగా శంభుదాసుకు తెలిసిపొయ్యింది నారాయణరావు యింటి సంగతంతా పరంధామయ్యద్వారా. అతని గాలిమేడలన్ని ఒక్కసారి కూలిపోయినంత పని అయింది. అయినా, పరంధామయ్య యింకా అతనిలోని ఆశ చావకుండ దోహదం చేస్తున్నాడు.

రామమోహను డింటికి వచ్చాక శ్యామసుందరికీ, ప్రసన్నకు చాల ధైర్యం కలిగింది. అతడు చెల్లెలి నూరడించి "ప్రసన్నా, చింతించకమ్మా! కడకు నీవు కోరిన విజయకుమార్‌తోనే నీకు పెండ్లి చేయిస్తా"నని శపథం

చేసినట్లు చెప్పడంతో ఆమె మనసు చాల కుదుటపడింది. తల్లి, కొడుకు, బిడ్డ ఏకమయ్యారు. రాగల దెట్టి ప్రమాదమైన దాని నెదుర్కొనేందుకు సిద్ధపడినారు.

రంగపురానికి వచ్చిన నాల్గవనాడు రామమోహన్ తల్లిని చూచి రహస్యంగా "అమ్మా, యీ దినం నేను విజయకుమార్‌తో మాట్లాడివస్తా. అతని మనసు ఎట్లుందో చూడాలిగా?" అన్నాడు. ఆమెకుకూడ ఆ మాట నచ్చింది. సాయంకాలం అతడు రహస్యంగా విజయకుమారుడును చూడపొయ్యాడు.

అప్పుడే చీకటి పడింది. దీపములుకూడ వెలిగించబడ్డాయి. ఆ దినం సెలవురోజగుటచే విజయకుమార్ డిస్పెన్సరికి పోలేదు. అప్పుడే షికారువెళ్ళి తిరిగివచ్చాడుకాబోలు, దుస్తులు మార్చుకొంటూవుంటే రామమోహన్ యింటిలోకివస్తూ "హల్లో, డాక్టర్" అన్నాడు. విజయకుమారు తిరిగిచూచి తన కన్నులను తానే నమ్మలేకపోయాడు నారాయణరావు కొడుకునుచూచి. క్షణములో తన ఆశ్చర్యాన్ని దిగమ్రింగి విజయకుమార్ చిరునవ్వుతో అతన్ని ఆహ్వానించే మార్పోబెట్టా డొక కుర్చీలో.

అంతలో మాధవరావు లోపలినుండి అక్కడికి రావడంచూచి రామమోహన్ లేచి "నమస్కారమండి, మాష్టారుగారు" అని చేతులు జోడించి నమస్కరించాడు. మాధవరావు అతనిని వెంటనే గుర్తుపట్టలేక చూస్తూవుంటే కొడుకు "నారాయణరావుగారి కుమారుడు రామమోహన్ నాన్నా, మీ పాత శిష్యుడు" అనేసరికి మాధవరావు రామమోహనుని కౌగిలించుకొన్నంతపనిచేసి "ఎంతవాడవయ్యావోయ్! చాల సంతోషం. కులాసేగా? ఎప్పుడొచ్చావు మద్రాసునుండి? లా చదువుతున్నావటకదా?" అని ప్రశ్న లడిగి తాను ప్రక్కన ఒక కుర్చీలో కూర్చున్నాడు.

రామమోహను డిప్పు డొంటరిగా ఉన్నట్టుంది తమ యింటి కెందు కొచ్చాడో తండ్రి, కొడుకు తోచక పరిపరివిధాల ఆలోచించారు మనసులో.

అయినా సభ్యతను పాటించి యధాలాపంగా నారాయణరావు ఎన్నికల్లో ఓడిపోయినందుకు విచారం తెలుపుతూ, మరి ఏవో అందుకు సంబంధించిన మాటలే కొంతసేపు మాట్లాడుకొన్నారు. రామమోహనుడు ఎంతో అనునయంగా చెప్పే సమాధానాలు వారిని మరింత ఆశ్చర్యచకితుల్ని చేశాయి. కడకు మాధవరావు "చాల అపురూపంగా వచ్చావు, నాయనా బీదవారి యింటికి" అని యేమేమో చెప్పబోతుంటే రామమోహను డతన్ని ఆపి "మాష్టారుగారూ, అలాంటి తారతమ్యాలు చెప్పి నన్ను కించపరచకండి. ఇందులో బీదలు లేరు - భాగ్యవంతులు లేరు. అంతా ఒకటే" అన్నాడు.

"ఎట్లౌతుంది నాయనా, మీతో మేము సాటా?"

"అదే, ఆమాటలే వద్దన్నా."

"సరికాని, ఊరకరారు మహాత్ములన్నట్టు రామమోహన్ యింత ఆకస్మికంగా వచ్చాడంటే ఏదో విశేషముంది నాన్నా" అన్నాడు విజయకుమార్ నవ్వుతూ.

"విశేషాల కేమిగాని మీతో మా పాత స్నేహాన్ని పునరుజ్జీవం చేయటానికి వచ్చా" అన్నారు రామమోహన్.

తండ్రి కొడుకు లిద్దరు చాల సంతోషించారామాటకు.

"అంతకంటే కావలసిందేముంది నాయనా? నేను నీకు, నీచెల్లెలికి ట్యూషన్ చెప్పే రోజుల్లో మీ తలిదండ్రులు చూపుతూవుండిన మర్యాదను మీ పిల్ల లిద్దరి సౌజన్యాన్ని నే నీ జన్మలో మరువలేను, రామమోహన్" అని వృద్ధుడైన మాధవరావు ఆ గతకాలాన్ని స్మరించుకొని ఏవేవో ఏకరువు పెటసాగాడు.

యధాలాపంగా మాట్లాడుతూ రామమోహన్ అసలు సంగతిలోకిదిగి తమ యిప్పటి యింటిపరిస్థితిని గురించి వారికి విశదంగా చెప్పి "చూడండి మా దురదృష్టం. ఇంట్లో తండ్రే యీరీతిగా దారి తప్పిపోతే పిల్లలం మా గతి యేమికాను? అమ్మ బెంగపెట్టుకొని కూచుంది. ప్రసన్న భయపడి

పోయ్యింది. నా కింక దిక్కుతోచక, వారికొరకు నేను చదువు మాను కొని యింట్లో నిలిచిపోయ్యాను" అని ఖిన్నుడై పోయాడు.

మాధవరావు, విజయకుమార్ చాల అసహ్యించుకొన్నారు నారాయణ రావు చర్యను. ఇంతకు కారకుడైన పరంధామయ్యను చెడతిట్టినారు. శ్యామసుందరి, ప్రసన్న, రామమోహనులయెడ మిక్కిలి సానుభూతి కన పర్చారు.

కడకు ప్రసన్న విజయకుమార్ మీద మనసు నిలిపినదని చెప్పి, అదెప్పు డారంభమైనది విశదీకరించేసరికి మాధవరా వొకవంక నిర్విణ్ణు డైపోతే, విజయకుమార్ ఆడబోయిన తీర్థ మెదురైనట్టు లోలోన మహా దానంద చకితు డై పోయాడు.

# 23

"రామమోహన్, నిన్నొక సంగతి అడగాలి, పరంధామయ్య కిందులో ఎందుకింత శ్రద్ధ కలిగిందంటావ్ ?" అని అడిగాడు మాధవరావు.

"ఇదంతా ఏదో దశారీబేరంగా ఉంది, మాస్టర్‌జీ! పుత్రసంతతిలేక, ఏకమాతపుత్రీ సంతానంకలిగి, విశేష ధనముకల శంభుదాసుకు మా ప్రసన్న నిచ్చి, అతని కూతురును నేను చేసుకుంటే, ఉభయపక్షాల ఐశ్వర్యంమీద మా తండ్రి కధికార ముంటుందని పరంధామయ్య అతనికి బాగ దురాశ కల్పించినాడు. ప్రసన్నలాంటి భార్యను సంపాదించిపెడతానంటే శంభు దాసు కెంత ఆశకల్గిందో! పరంధామయ్య కెంత దలాళీ ముట్టిందో! ఇంతకు మా తండ్రి చేసిన పొరబాటొకటుందిలెండి. ఎలెక్షన్ పనులలో తనకు తీరిక వుండదని ప్రసన్నకు తగినవరుని చూచేభారాని రెంగు...

నెలలక్రితం యీ పరంధామయ్యమీద పుంచాడట. ఆ అవకాశం తీసికొని యీ దుష్ట బ్రాహ్మణు డింత పితలాటకం ప్రారంభించాడు.

"నీవు శంభుదాసు కూతురును చేసుకోవచ్చును. కాని, నీ చెల్లెలిని మాత్ర మతని కివ్వడం బాగులేదు."

"ఆ సంగతి మాకందరికి తెలుసుకాని, దురాశచే మా తండ్రి మూర్ఖపు పట్టుపట్టి 'ప్రసన్న శంభుదాసు నెట్ల చేసుకోదో చూస్తానుగా' అని ప్రగల్భాలు పలుకుతున్నాడు."

"అవును. ఇంటి యజమానుడే అంత పట్టుపడితే పాపం ప్రసన్నకు దారియేది? నీవుకాని, మీ తల్లికాని ఏమి చేయగలరు?"

"మేము ఏమిచేయగలమో, ఏమిచేయవలసి వస్తుందో ముందు తెలుస్తుంది. ఇప్పుడు చెప్పండి, మా అమ్మాయి మీ కుమారుని ప్రేమించింది. ఇందు కేమంటారు?"

"నాయనా, సిరిరా మోకా లడ్డువా రుంటారా? సాక్షాత్ లక్ష్మీదేవి లాంటి కోడ లింటికి వస్తుందంటే మా పుణ్యం ఫలించినట్టే."

"విజయకుమార్, ఏమి మాట్లాడవే?"

"అంతా నాన్నగారు చెబుతున్నారుగా? అయితే, ఆ కోర్కె నెరవేరే అవకాశ ముందా అనే నా అనుమానం."

"ఇందులో అనుమానానికి అణుమాత్రంకూడ అవకాశంలేదు సుమా. నే నడిగే దొక్కటే — ప్రసన్నను భార్యగా పొందడానికి నీవే సాహసానికైన సిద్ధపడుతావా" అని.

"అంటే, నా కర్థముకాలేదు. విశదంగా చెప్పు నే చూపవలసిన సాహస మేలాంటిదో?"

"అనును. రామమోహన్, నీవు యిప్పుడు వచ్చిన ఉద్దేశమేదో

బాగా విశదమైంది. సంగతుల నన్నిటినీ బాగా ఆలోచించి, సాధక బాధకా లన్నీ నిర్ణయించే భారం నీవే."

"ఇంక మీవద్ద దాపరిక మెందుకు. నేను, మా తల్లి, ప్రసన్న, మాణిక్యం — నలువురం ఒకటి - మా తండ్రి తా నొక్కడే ఒకటి. అతని మౌర్ఖ్యం తగ్గే స్థితిలో లేదు. నిర్బంధముగ నైన శంభువాసుకు ప్రసన్న నంటగట్టాలని అతని ఆలోచన వున్నట్టుంది. ఒకవేళ అలాంటి పరిస్థితి ఏర్పడితే, ప్రసన్నను రహస్యంగా మీఇంటికి పంపివేయాలని మాసంకల్పం. అప్పుడు మా తండ్రి వైఖరి యేలాగుంటుందో చెప్పలేను. ఏమైనను సరే, ఆమెను దక్కించుకోగలరా చెప్పండి, మాష్టర్‌జీ."

మాధవరావు, విజయకుమార్ ఆలోచనలో పడ్డారు. రామమోహన్ మరల యిలాగన్నాడు.

"ప్రసన్న కేమిచేయడానికి తోచక 'అన్నా' అని పిలుస్తూవుంది ? నేనే ధైర్యం చెప్పవచ్చును. మీ మన స్సెలాగుందో తెలిసికొనిపోదామని. మీ అభిప్రాయం తెలిస్తే ఆమెను కాపాడ్డానికి నేను తగినదెరవు వెతకాలి."

విజయకుమారుకు ప్రథమ సందర్శన సమయములోనే ప్రసన్నమీద మనసు పారింది. కాని, అందని పండని భావించి ఆ యాలోచన మాను కొన్నాడు. నిజంగా ప్రసన్నలాంటి భార్య లభిస్తే తనవంటి అదృష్టవంతు డుండడని యేనాడో కలలుగన్నాడు. ఇప్పుడాకల నిజము కాజొచ్చిందంటే అత డెంత ఆనందమగ్నుడయ్యాడో వేరుగా చెప్పబనిలేదు. కాని, ఆమెను దక్కించుకొనేందుకు ముందు, నారాయణరావనే రాక్షసుని కోపాగ్నినుండి తన్ను, తన భార్యను కాపాడుకోవాలి — అంటే, బలవద్విరోధం సంపా దించాలి ! రామమోహనుడు — నారాయణరావు కొడుకే - తన కిందులో వీలైనంతవరకు సాయపడగలడు. ఇంకా తన మిత్రులు నిరంజనరెడ్డి, చంద్రశేఖరంలాంటివా రున్నారు. కాబట్టి నారాయణరావుకు భయపడ నవసరములేదు. అంతేకాక, తానిప్పుడు పిరికితనం చూపితే ప్రసన్న తన

విషయమై చులకనగా ఆలోచించడమేకాక, గత్యంతరములేక ఏరీతిగానైన ప్రాణత్యాగం చెయ్యొచ్చు, లేదా ఎందైన పారిపోవచ్చును. అప్పుడు తన అశక్తతవల్లనే ఆమె కట్టి దుర్గతి సంభవించినట్టగును. అది సహించడానికి వీలులేదు. తన కారణంగా ముద్దయిన గులాబీపూవు మంటలో పడిపో డానికి వీల్లేదు. ఏమైనాసరే, ఆమెను తాను దక్కించుకోవాలి. ఆమె సాహసించి, పెండ్లికి ముందు, పిన తండ్రిని ధిక్కరించి - తన యింటికి వస్తుందంటే ఆ ప్రేమ ఎంత గాఢమైనదిగా ఉండాలి.

విజయకుమార్ తనలో తానిన్ని విషయాలు చర్చించుకొన్నాడు. తండ్రితోను, రామమోహన్‌తోను ఆలోచించాడు. తుదకు తన నిశ్చయాన్ని యీవిధంగా వెలిబుచ్చాడు.

"రామమోహన్, ధైర్యే సాహసే లక్ష్మీ' అన్నారు పెద్దలు. కాబట్టి నీ చెల్లిని పరిగ్రహించడానికి నేను సంసిద్ధుడను. తదనంతర కార్యక్రమ మేమో నీవు చూచుకొవలసిందే సుమా."

మాధవరావు నసిగాడు "చూడు, అబ్బాయ్, రాంమోహన్, మా వాడికి మిత్రులబలముంది. భయము లేదులే. ప్రసన్న కోడలగా మాయింటి కొస్తుందంటే మా కంతకంటే కావలసిం దేముంది. అబ్బాయి అదృష్ట వంతుడు" అన్నాడు.

"మీకు రాగల ప్రబలమైన తొందర లేవి వుండవు. పోతే మా తండ్రి యింటికివచ్చి మరల ప్రసన్నను పిలుచుకొని పొయ్యేందుకు కొంత దౌర్జన్యానికి పూనుకోవచ్చు. నేను ముందుగానే మీకు యివ్వవలసిన హెచ్చరిక నిచ్చిఉంటాను. మీరు తగిన కట్టుదిట్టంతో ఉండవచ్చు. నేను తెరవెనుకనుండి ఎప్పటికప్పుడు చేయవలసిన సహాయం చేస్తూనేవుంటాను."

విషయం నిర్ణయించబడింది - తనకు అవసరమని తోచినప్పుడు

ప్రసన్నను రహస్యంగా వారి యింటికి రామమోహన్ పంపవచ్చు. ఆమెను పరిగ్రహించి, దక్కించుకొనే ప్రయత్నం వారు చేయగలరు.

ఇంత అయ్యాక మాధవరావు లోపలినుండి భార్యను పిలిచాడు— కాంతమ్మ, ఆమెవెంట బిడ్డ రాధ వచ్చారు. రామమోహన్ వచ్చాడంటే కాంతమ్మ కెంతో సంతోష సంభ్రమాలు కలిగాయి. తలిదండ్రుల కుశల వార్త లడిగిం దతనిని. తరువాత మాధవరావు మెల్లగా సంగతులన్నీ చెప్పేశాడు. ఆమె సంతోషంతోపాటు, ఆశ్చర్యంకూడ మిన్నుముట్టిపోతూ వుంది ప్రసన్న తన కొడుకును ప్రేమించి, ఏలాటి పరిస్థితుల్లో సాహసించి తమ యింటికి రహస్యంగా రాబోతూవుందంటే. "అబ్బాయి ఉన్నాడు, పెద్దవారు మీరున్నారు. రామమోహన్ అన్నాడు. అన్నీ మీరే నిశ్చయించు కున్నారు. ఇంక వచ్చిన భయ మేముంది. అమ్మాయిని కోడలిగాపొందే భాగ్యానికంటే వేరేమి కావాలి?" అని కాంతమ్మ తన అంగీకారాన్ని వెల్లడించింది.

రామమోహనుడు యింకా కొంతసేపు ముఖ్యాంశాలన్నీ మాట్లాడు కొని, వారిచ్చిన కాఫీ ఫలహారాలు పుచ్చుకొని వెళ్ళిపోయాడప్పటికి. అతని రాక రహస్యంగా ఉంచబడింది.

దురాశచే కన్నులు మూసికొనిపోయిన నారాయణరావు మూర్ఖ్యం తలకెక్కి చెట్టునుకొట్టి మీద వేసుకొనేంత పనికి పూనుకొన్నాడు. భార్యను, కుమారుని శత్రువులుగా పరిగణింపసాగా డతడు. పరంధామయ్య ఒక్కడే అతని కిప్పు డాప్తవర్గములోనివాడు. రామమోహనునితో చీవాట్లు తిన్నపిదప అతడు మరల వారియింటికి రాలేదు. ఎన్నటికి లేనట్లు నారా యణరావే, ఆలోచనలకొరకు అప్పుడు పౌరోహితుని యింటికి పోయి రాసాగాడు. పరంధామయ్య ఏదో దురాలోచనలోకి, స్వార్థంకొరకు ఆబా ణాన్ని నారాయణరావుమీద ప్రయోగించాడు. కాని, దానిని ఉపసంహ రించేందు కతనికికూడ యిప్పుడు సాధ్యంకాకుంది. నారాయణరావు ఆ

విషయమై యిప్పుడంత పట్టుదలతో వున్నాడు. బలవంతముగా నైన, ప్రస న్నను శంభుదాసుకిచ్చి పెండ్లిచేయాలని కృతసంకల్పుడై, శంభుదాసుకు కూడ ధైర్యంచెప్పి, పెండ్లికి సిద్ధంగాఉండమన్నాడు. తుదకు 'మాఘశుద్ధ తదియ సోమవారం' ముహూర్తమని నిశ్చయించి, భార్యకాసంగతితెలిపి. నౌకర్ల సహాయముతో పెండ్లిపనులను సిద్ధం చేయించ బూనుకొన్నాడు. తల్లికొడు లిద్దరు ఆపని తమది కానట్టు సంచరిస్తూ, తమ ఆలోచనల్లో తా మున్నారు.

నారాయణరావు ముహూర్త మింక పదిహేనురోజు లుండనగా లగ్నపత్రికలనుకూడ ప్రింటుచేయించి, పంపవలసిన బంధుమిత్రుల కందరికి పంపివేశాడు. సత్యమెరిగినవారంతా 'ఈ పెండ్లి జరిగేది కాదులె'మ్మను కొన్నారు. శంభుదాసును చూచినవారు "ఈ ముసలివానికా ఈ పడుచు పిల్ల నిస్తారు!" అని ముక్కుమీద వేలుంచుకొన్నారు. ఏదియు తెలియని వారు వివాహ భోజనాని కెదురు చూడసాగారు.

ఆశ బెద్దది—శంభుదాసు పెండ్లికొడుకై సంబర పడుతున్నాడు. ఇచ్చేవాణ్ణి చూస్తే చచ్చేవాడు లేచి వస్తాడంట. పరంధామయ్యా "ఈ పెండ్లి కానియ్యండా—తరవాత అందరు ఒకటైపోతారు. ఎన్నాళ్ళు యీ శతింపు లుంటాయి? తరువాత కొన్నాళ్ళలో నీకు రామమోహానునికి ఆ మూడుముళ్ళు పడితీరుతాయి" అని అరుంధతి నొకవంక ఆశా ప్రవాహ ములో ముంచెత్తుచున్నాడు.

"పరమేశ్వరా! ఈనగాచి నక్కలపాల్జేసినట్టు నన్నిన్నాళ్ళుపెంచి, కడకీ పినతండ్రి నా సుఖానికే కుఠారమెత్తాడే, నా గతేమికాను! అందరు అదృష్టవంతులవలె కోరినవానిని సంతోషంగా, పెద్దల ఆశీర్వాదముతో, పెండ్లాడే భాగ్యంలేక, ఏవేవో అడ్డదారులు త్రొక్కవలసివస్తుందే" అని ప్రసన్న ఒకవంక లోలోన దుఃఖపడుతుంటే, అన్న, పినతల్లి ఆమె నోదార్చి "ధైర్యంగా ఉండు" మని హెచ్చరిస్తున్నారు.

# 24

నారాయణరావు నిర్ణయించిన ముహూర్తం ఒక వారం తక్కు సమీపించింది. ఈలోగా రామమోహన్ తల్లితో ఏకాంతంగా యిట్ల ఆలోచించాడు. వారి ఆలోచనల్లో మాణిక్యం ఎప్పుడు పాల్గొంటూవుంది. ఇక ప్రసన్న సరేసరి....

"అమ్మా, నాకొక ఆలోచన తోస్తూవుంది"

"ఏమి, నాయనా, చెప్పు నీ ధైర్యమే మాధైర్య మిప్పుడు."

"తెలిసి తెలియని నరు దెల్ప బ్రహ్మదేవుని వశమే" అన్నా కవి. కాబట్టి నాన్నగారికింక ఎంత వినయముగా చెప్పినా, శరించి చెప్పినా ప్రయోజనం లేదు. మనమిప్పుడు అతన్ని అనుసరించి నట్లు నటించి, మభ్యపెట్టి, ప్రసన్నను రహస్యంగా విజయకుమారు వద్దకు పంపివేసి. తరువాత ఏమి తెలియనట్టు ఒక నాటక మాడకపోతే మనము అపకీర్తిపాలు కావచ్చు. ఈ గృహచిద్ర మట్లయితే కాని అంతము కాదు. ఇందుకు నీవేమంటావ్?"

"అంటే, ఇప్పుడు మీనాన్నగారు కోరినట్టు శంభుదాసును చేసి కొనేందుకు ప్రసన్న యిష్టపడిందని చెప్పమంటావా?"

"అవును, అదే నేను చెప్పేది. ఆ పని వెంటనే జరిగితే అప్పు డతడీ రుసరుసలు మాని కొంత మెత్తపడుతాడు. మనకు కొంత మనశ్శాంతి లభిస్తుంది. తరువాత జరుగవలసిన కార్యక్రమాన్ని నేను నిశ్చయిస్తా."

అందరికి నచ్చింది రామమోహన్ సలహా. కడకు మాణిక్యం ఈలా గనింది

"అమ్మా, చినబాబు ఆలోచన భలేవుందమ్మా. మీరు ఈవేళ పెదబాబు

...ట్టు నటించండి. పెండ్లి యింక రెండు మూడు దినా
...ు ప్రసన్న సినిమాకు వెళ్ళివస్తామనే నెపంతో యిల్లువదలి
...జయకుమారుని ఆశ్రయంలో చేరుకొంటాము. అమ్మాయిని
...రెప్పవలె నేను చూచుకొంటాను. తరువాత రామమోహన్ బాబు
...ుువలసిన పనులన్ని చూచుకొంటాడు."

ముందు ప్రసన్న నేరీతిగా విజయకుమార్ ఇంటికి పంపవలెనా అని ఆలోచిస్తున్న రామమోహన్‌కు మాణిక్యం చెప్పిన ఉపాయం అమోఘంగా తోచింది. ఆమె తెలివిని ప్రశంసించి, 'అదే తగిన మార్గ' మని నిశ్చ ...ంచినాడు.

శ్యామసుందరికి కూడ యిదంతా సమయోచితమనిపించి, ఆ దినమే ప్రారంభించింది తన కపటనాటకాన్ని.

ఈలోగా ఎప్పుడో ఒంటరిగా నారాయణరావు భోజనాల కొస్తే మాణిక్యం మాట్లాడకుండ వడ్డిస్తూ వుంటుంది. ఆ దినం రాత్రి అతడు ఒంటరిగా భోంచేసే సమయానికి శ్యామసుందరి మెల్లగా వచ్చి దగ్గర కూర్చొని, యీ నెల నుండి లేని తనతోటి పరామర్శను కనపరుస్తూ మాణిక్యాన్ని 'అది వడ్డించూ, ఇది వడ్డించూ" అని పురమాయించ సాగింది. నారాయణరావు లోలోన ఆశ్చర్యపడ్డాడు భార్య చర్యకు....ఏదో దారికొచ్చినట్టుందే అని కూడ అనుకొని మనసులోనే కొంత సంతో షించాడు. అయిన అతడు మాట్లాడకుండ, తలెత్తి ఆమెవైపు చూడ కుండ భోంచేస్తున్నాడు.

"ఏమండీ, అయితే ప్రసన్నను శంభుదాసుకిచ్చి తీరాలంటారా?" అని సాంత్వవంగా అడిగింది శ్యామసుందరి.

ఆమెవైపు గ్రుడ్లురిమి చూస్తూ నారాయణరావు "కాకపోతే మరే మనుకొన్నావు? లగ్నపత్రికలు కూడ ప్రింటయిందనేసంగతి తెలీదూ?

తూర్పున పుట్టే సూర్యుడు పడమట పుట్టినా సరే.... నా మాట చెల్లితీరాలి" అని గద్దించినట్టు సమాధానం చెప్పాడు.

"సరేలెండి. మీ యిష్టప్రకారమే కాని, మిమ్మెదిరించి మేమేమి సుఖమనుభవిస్తాము?"

"అయితే ప్రసన్న దారికొచ్చిందన్నమాట?"

"ఎట్లోలెండి" పెంచి పెద్ద చేసిన మనమే ;యీ పట్టుపడితే పసిపిల్ల అదేం చేస్తుంది. 'మీ చిత్తం – నా భాగ్యం' అని సమాధానపడింది.

నారాయణరావు ముఖములోని కోపమంతా తృటిలో మాయమైంది. అతడు మనసారా ఒక్కమారు నవ్వి "చూడు, శ్యామా, కడకు మీరందరు నాదారికి రాక తప్పలేదు. అబ్బాయి యేమంటాడు?" అని అడిగాడు మరల.

"ఏమనడాని కేముంది? ఇదంతా వాని ఆలోచనమీదనే జరుగుతుంది. చెల్లెలికి బాగా నచ్చచెప్పి ఒప్పించాడు. ఉన్న ఒక్క కొడుకు దూరమౌతాడా?"

"అదే నేచెప్పేది. ఇదంతా వాని భవిష్యత్తుకానికి కాకపోతే నాకా? నీకా? ఆ మాత్రం దూరదృష్టి ఉండవద్దూ? నేనేమి ప్రసన్నను నూరేండ్ల ముసలి వాడి కంటగడుతున్నానా? మీరంతా చూచారుగా శంభుదాసును? అతడంత ముసలాడా?"

"కాదులెండి. ఏదో ఋణానుబంధ మేలాగుంటే ఆలాగు కానియ్యండి. ప్రసన్న చాల తెలివిగల అమ్మాయి. యింట్లో యీ అలజడిని చూచి ఆమె చాల బాధపడిపోయింది."

ఆనాటినుండి నారాయణరావు ఇంట్లో అందరితో సమాధాన పడినట్లు సంతోషిస్తూ పెండ్లి సంగతులని ఏవేవో అడుగుతున్నాడు భార్యను.

కొడుకును. వారు సహకరించినట్లే మాట్లాడుతు అతనిని మభ్యపెట్ట సాగారు.

ఇక పరంధామయ్య విషయంలో కూడ శ్యామసుందరి, రామమోహన్ ఇదే పద్ధతి ననుసరింప మొదలెట్టారు. "నిజంగా పరంధామయ్యా నీ ఆలోచన బ్రహ్మాండమైనది. నీ బుఱ్ఱకు వెలకడితే ఎన్ని లక్షలైనా చేస్తుంది. నీ ఆలోచన ఎంత అమోఘంగా వుంటే కాని మాతండ్రి నమ్మితిస్తాడా? నీవు మాకు మహోపకారివి. నీ సహాయం మేమెన్నటికి మరువలేము. ఈ పెండ్లిండ్లయ్యాక నిన్ను తగిన రీతి సత్కరిస్తాం బాబూ" అని అతన్ని నారాయణరావు ఎదుటనే పొగడాడు రామమోహన్. అది విని పరంధామయ్య వాతావరణం మారిందని ఉబ్బితబ్బిబ్బయ్యాడు నారాయణరావు కూడ మనసార నవ్వుతు "ఇంత మాత్రం గ్రహించలేక పొరబడ్డావురా, నాయనా, మొదట. ఇదంతా నీకు కాకపోతే మరెవ్వరి కనుకొంటావు?" అని కొడుకును పరామర్శించాడు.

ఆ దినమే పరంధామయ్య ద్వారా నారాయణరావు ఇంటి పరిస్థితులు చక్కబడినాయని శంభుదాసు విని పరమానంద మొందాడు. తిమ్మిని బ్రహ్మని, బ్రహ్మని తిమ్మని చేయగలవాడ వని పరంధామయ్య నతడు చాల మెచ్చుకొన్నాడు.

ఈ రీతిగా రామమోహనుడు సాహసించి, పర్యవసాన మెట్టిదైనా సరే ఎదుర్కొనేందుకు సిద్ధపడి యీ విచిత్ర నాటకాన్ని ఆరభించాడు. దీని రహస్యమతనికి, శ్యామసుందరికి, ప్రసన్నకు మాణిక్యానికి మాత్రమే తెలుసు. విజయకుమార్‌కు కూడ రామమోహను ఇదంతా నటనయని. ముందు తాను చేయదలచిందేదో అది అంతా సవిస్తరంగానే చెప్పివచ్చాడు. తక్కినవారంతా నిజంగా రెండు పెండ్లిండ్లు జరుగుతాయనే నమ్మినారు. అటు శంభుదాసు, ఇటు నారాయణరావు తగు సన్నాహాలు చేయిస్తూ ఆయా కార్యాల్లో నిమగ్నులై పోయారు.

పెండ్లి యింక మూడు దినాలు మాత్రం మిగిలింది. మాపి హెచ్చుకాలం ప్రసన్నతో ఆమె గదిలోనే వుంటూ వచ్చింది. అప్పు డప్పుడు శ్యామసుందరి, రామమోహనుడు ప్రసన్నకు ధైర్యం చెప్పి వస్తున్నారు. "నా తలిదండ్రులే వుంటే నాకీలాంటి కష్టం వచ్చేదా? తండ్రి కేమి విషంపోతినో నన్నీ పినతండ్రి పాలుచేసి పోవడానికి. అందరు పిల్లలవలె కోరిన భర్తను వైభవంగా సంతోషంగా పెండ్లాడే యోగం లేక యీ విచిత్ర సాహసానికి పూనుకోవలసిన పాడువ్రాత నా నొసటన వ్రాయ బడింది" అని ప్రసన్న దుఃఖించినప్పుడంతా మాణిక్యం ఆమె నూరడిస్తూ "ప్రసన్నా, యీ భయంకర సంకాటములో మీపిన్ని, అన్న నిన్ను దుఃఖం పాలు చేయరాదని ఎంతటి సాహసానికి పూనుకొన్నారో గమనించావా? ఇదంతా బయల్పడినాక వారిని మీ చిన్నాన్న ఎంత కఠినంగా చూస్తాడో! అయినా వారన్నిటికి సిద్ధపడి నిలిచినారు. వారి త్యాగాన్ని నీవు కి... పరచవద్దు. తల్లిదండ్రులు లేని నీకేలాంటి అన్యాయము జరగకుండా వారు వేయి కండ్లతో కాపాడు తున్నారు. చదువుకొన్న దానవు, అలనాడు రుక్మిణీదేవి శ్రీకృష్ణుని ఎట్లు వరించింది? అంతవారికే ఆ దుర్ఘటన తప్పక పోతే యింక సామాన్యుల మాట చెప్పనేమి?" అని సమయోచితంగా ఆ చిన్నారి హృదయవేదనను తగ్గిస్తూంది.

రామమోహన్ ఈలోగా విజయకుమార్‌తో కలియకం మొదలైన విషయాలన్ని చాల రహస్యంగా జరిగిపోతున్నాయి. ఎప్పటికప్పుడు, సంగతులన్నీ తల్లికి, ప్రసన్నకు మాత్రం తెలుపుతున్నా డతడు.

ఒకప్రక్క నారాయణరావు, యింకొక ప్రక్క శంభుదాసు పెండ్లి హడావుడిలో మునిగిపోయారు. ఊరంతా పాకిపోయింది శంభుదాసుకు సోమసుందరం కూతురు ప్రసన్నను, నారాయణరావు కుమారునికి శంభుదాసు బిడ్డను యిచ్చి పెండ్లిచేస్తారని, అరుంధతి రామమోహన్‌ల

ల్లని గురించి విన్నవారంతా సంతోషిస్తున్నారు కాని, రెండవ వివాహ మును గురించి ఊళ్ళో ఎన్నో వ్యాఖ్యలు బయలుదేరాయిప్పుడే. ఎవరేమను కొన్నా సరే పెండ్లి పెద్దలిష్టపడినారు.... ఇతరుల అభిప్రాయాలను వారు ఖాతరు చేసే పరిస్థితిలో లేరు.

ఉదయం రామమోహనుడు విజయకుమార్ ఇంటికి వెళ్ళి మాధవ రావుతో, కాంతమ్మతో, విజయకుమార్‌తో ఒక గంట సేపు మాట్లాడి వచ్చాడు. తరువాత శ్యామసుందరిని, ప్రసన్నను, మాణిక్యాన్ని ఒక గదిలో కూర్చుండబెట్టుకొని చాలసేపు గుసగుసలాడినాడు. నారాయణరావు దీని నేమి గమనించలేదు. ఇంటిముందు గొప్పగా పెండ్లిపందిలి వేయించి దానికి అలంకారాలు చేయిస్తున్నాడతడు.

సాయంకాలము ఆరు గంటలవేళ మోహనుడు తండ్రినిచూచి "ప్రసన్న, నేను సినిమాకు వెళ్ళివస్తాము" అని అతని అనుమతి పొంది, కారును తెమ్మని డ్రైవరు రసూలుతో చెప్పాడు.

"మీ అమ్మకూడా వస్తుందా ?" అని అడిగాడు నారాయణరావు.

"లేదు. నేను, చెల్లాయి వెడుతున్నాము."

కారులో కూర్చొనేటప్పుడు వా రిద్దరితోబాటు మాణిక్యంకూడ కూర్చొనింది. "మాణిక్య మెందు"కని నారాయణరావు అడగాలని అను కొన్నాడు. కాని, అంతలో 'ప్రసన్నకు జతగా వుంటుంది లెమ్మ'ను కొన్నాడు. కారు వెళ్ళిపోయింది. వారానికి రెండుమూడుసార్లు యీ సినిమా కార్యక్రమా లుండడం మామూలే కాబట్టి నారాయణరావు కంటలో విశేషమేమి కనబడలేదు.

కారు 'సరస్వతీ పిక్చర్ ప్యాలెస్'' వద్ద ఆగింది. ఆవేళ కప్పటి కచ్చట విజయకుమార్ హాజరయ్యాడు. అతని ప్రక్కనే చంద్రశేఖరం, నిలబడి వున్నాడు. రామమోహన్ మాణిక్యం, ప్రసన్నల కేదో చెప్పి

వా. రెండు కుర్చీ టికెట్లు తీసియిచ్చి వారిని ఆడవారి గేటుగుండా లోపలికి పోనిచ్చి, కారును తొమ్మిదింటికి మరల తెమ్మని రసూలును యింటికి పంపించివేశాడు. తరువాత అతడు విజయకుమార్ ప్రభృతులను కలిసికొని నమస్కరించేప్పటికి వారు ముప్పురు ప్రతి నమస్కారం చేశారతనికి.

నిరంజనరెడ్డి, చంద్రశేఖరం, రామమోహన్ విషయములో చాల సదభిప్రాయం చూపించారు సంభాషణలో – అందుకు కారణం, అతని సంగతంతా వారికి విజయకుమార్‌వల్ల తెలియవచ్చింది. నారాయణరావెంతటి అహంకార పూరితుడో, కొడుకంత వినయవంతుడు – అతడెంత సంకుచితాభిప్రాయములు కలవాడో, యితడంత ఉదారమగు ఆశయములు కలవాడు. రామమోహనుని కలుపుకోలు తనానికి వారెంతో సంతోషించారు. రెడ్డి, చంద్రశేఖరం, మోహనునితో కరచాలన మొనర్చి విజయకుమార్‌నుచూచి "వెళ్ళివస్తాం. ఎనిమిది కావొస్తుంది" అని నవ్వి, రామమోహనునివైపు సాభిప్రాయంగా చూస్తూ సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయారు.

తరువాత వారిద్దరిట్లు మాట్లాడుకొన్నారు.

"విజయా, అంతా కుదుర్చుకొని వచ్చేశాము."

"చాల సంతోషం. సంగతంతా చంద్రశేఖరం, నిరంజనరెడ్డికి తెలిపాను. ఇద్దరు నాకు సహాయంగా వుండడానికి సమ్మతించారు. విన్నావుగా, కారును ఎనిమిదికంతా పంపుతామన్నారు."

"మా కారు తొమ్మింటికి వస్తుంది. ఆలోగా నీవు మీకారులో ప్రసన్నను, మాణిక్యాన్ని పిలుచుకొని మీయింటికి వెళ్ళవచ్చు.

"మోహన్, నీవు, నీచెల్లెలు చూపే సాహసానికి మిమ్మెంత అభినందించినా తీరదు. ఎత్తునకు బహుమంచి ఎత్తును వేశారు.

"చేయకపోతే విధిలేదు. అంతా నీకు తెలిపానుగా?"

"సరే, రమ్మ, మనము లోపలికివెళ్ళి కూర్చుందాం."

అని ఇద్దరు సినిమాహాలులోకి వెళ్ళి రెండు రిజ్వర్డు సీట్లల్ గాచు న్నారు. అది ఒక తెలుగు పిక్చర్ – పేరు 'రాజయోగి' ఆ సినిమా హాలులో ఎప్పటికిని హైక్లాస్ పిక్చర్సే వస్తుంటాయి. నూతనంగా కట్ట బడిం దౌటచేత నవీన పద్ధతిలో అంతా ఆకర్షణీయంగా వుంటుందా హాలు. పదిమంది – ఒక్కొక్క లక్ష రూపాయలవంతున – పది లక్షలు ఖర్చుపెట్టి కట్టించారట దాన్ని.

ఆ రంగులమధ్య కూర్చున్న మాణిక్యం, ప్రసన్నలకుగాని, ఇటు పురుషులమధ్య వున్న విజయకుమార్, రామమోహనులకు కాని – పిక్చరు మీద మనసులేదు. అక్కడ వారు – ఇక్కడ వీరు – తాము చేయ సాహ సించిన భవిష్యత్కార్యక్రమాన్ని గురించి, అందువలన కలుగబోయ్యే ఫలితాన్నిగురించి, గుసగుస లాడుకొంటూ అందులో తన్మయులై పొయ్యారు.

ఎనిమిదిగంటలయ్యింది. మోహన్, విజయకుమారు లిద్దరు లేచి వెలుపలికి వచ్చారు. అప్పుడే నిరంజనరెడ్డి పంపిన కారుబండి వచ్చి పోర్టికోలో నిలిచింది. రామమోహనుడు స్త్రీల గేటులోకి వెళ్ళి బయటకి రమ్మని ప్రసన్నకు, మాణిక్యానికి చేసైగ చేశారు. ఇద్దరు లేచివచ్చారు.

ప్రసన్న హృదయం దడదడ లాడిపోతూంది. విజయకుమారు నామె సుమారు మూడు నెలలక్రింద అతడు తమ యింటి కా సాయం కాలము. మరుసటిదినం ఉదయం వచ్చినప్పుడు చూచిందే. అయినా, ఆ స్వల్పకాల వీక్షణమే ఆమె జీవితాని కొక స్వరూపం తీర్చిదిద్దింది. ఇప్పుడు తన ప్రియునివెంట – పెండ్లి కాకముందే – పినతండ్రిని వంచించి – వెళ్ళిపోవలసిన పరిస్థితి యేర్పడింది. లేకున్న తన జీవితమంతా దుఃఖమయ మైపోతుంది. పినతల్లి, అన్న – యిద్దరు తన కాధారభూతులై తన జీవిత

మును సౌఖ్యమయము చేయడానికై యింత సాహసముతో తన పనికి మద్దతుగా నిలిచాడు. దీని పరిణామ మెంత భయంకరమో తలచుకొని ప్రసన్న లోలోన చాల తత్తరపడుతూంది.

మాణిక్యం ఆమెను శైశవమునుండి పెంచినది. ఆమె హృదయంలో ఒకరీతి మాతృప్రేమ విజృంభించిపోతూవుంది. ప్రసన్నను ఒంటరిగా పంపేందు కిష్టములేక– ఆమె జీవిత భాగస్వామివెంట తాను వెళ్ళిపోవడానికి సిద్ధపడింది. అందువల్ల ప్రసన్నకు కొంత ఊరటగాను, ధైర్యంగానువుంది– ఇదంతా రామమోహన్ తల్లితో ఆలోచించి చేసినపని.

ప్రసన్న రామమోహన్ భుజానికి తల ఆనించి వెక్కి– వెక్కి– ఏడ్వసాగింది. "అమ్మాయ్, ఇది సంతోషింపవలసిన సమయము. ఏడ్వవద్దు. నేను ఎప్పుడు నిన్ను చూపెట్టుకొనే ఉంటాను. నాన్నవల్ల నీ కేలాటి తొందర కలుగదు. ఒకవేళ అతడు మీయింటికివస్తే ఎట్లు మాట్లాడాలో చెప్పించానుగా? ధైర్యం విడువవద్దు. నీవు చేసిన తప్పేమిలేదు. పైగా నిన్ను రేపు లోకం తప్పక హర్షిస్తుంది" అని రామమోహనుడు విజయకుమార్‌తో "విజయా, ఇదిగో యీ క్షణంనుండి యీ భూమ్యాకాశాలు సాక్షిగా మీ రాలుమగలు. అన్నగా – తండ్రిగా – యీమెను నీ కప్పగిస్తున్నాను. ఇది ఒక అసాధారణ పద్ధతే అయినా విధి వ్రాత ఇలాగుంది. అయినా, నా చెల్లెలి సమాగమంవల్లనే విత:పరము అదృష్టవంతులలో అదృష్టవంతుడవని నమ్ముకొని ఉండుము. మీరు హాయిగ - నిశ్చింతగ – మాణిక్యంతో వెళ్ళిరండి. నే నెల్లప్పుడు మిమ్ముల కంటికిరెప్పవలె చూపెట్టుకొని వుంటా" నని ప్రసన్న కుడిచేతిని, విజయకుమార్ చేతిలోవుంచి "భగవంతుడు నూరేండ్లపాటు మీదాంపత్యాని పరస్పర సుఖసంతోషమయం చేయుగాక!" అని. ఆశీర్వదించాడు. అదొక అపూర్వాదృశ్యము. అందరి కళ్ళల్లో ఆనందబాష్పాలు రాలాయి. ప్రసన్న తల వాల్చి కన్నీరు తుడుచు కొంది.

రామమోహన్ అవెంటనే మాణిక్యానికి చెప్పవలసిన మాటలుచెప్పి సుగ్గుతిని నిరంజనరెడ్డి పంపిన కారులో కూర్చోబెట్టి "రేపు కలుసు కొంటా"నని పంపివేశాడు. కారు వెళ్ళిపోయాక అతను మరల లోపలికి వెళ్ళి యథాస్థానంలో కూర్చున్నాడు.

# 25

స్క్రీను వదిలేశారు. రామమోహన్ బయటికివచ్చి చూచేసరికి రసూల్ కారుతో వచ్చి సిద్ధంగా వున్నాడు. "రసూల్ — ఆడవాళ్ళ గేటు దగ్గర వుండి అమ్మగారి నిద్దరిని పిలుచుకొని రా" అని చెప్పి అతడు కారులో ముందుప్రక్క కూర్చున్నాడు.

రసూల్ గేటువద్ద ఎంతసేపు కాచిన ప్రసన్న, మాణిక్యం రాలేదు— వారక్కడ ఉంటేగా వచ్చేది? అతని కేమితెలుసు జరిగిన సంగతంతా?

లోపలినుండి రావలసినవారంతా వచ్చిపోయారు. కాని, వా రిద్దరు రాకపొయ్యేప్పటికి రసూల్ లోపలికివెళ్ళి చూచాడు. ఎవ్వరు లేరక్కడ. రెండవ 'షో' ప్రారంభానికి ముందు పనివాండ్రు కసువు చిమ్ముతున్నారు లోపల. రసూలు గుండె గతుక్కుమనింది. "అయ్యా, అమ్మగారిద్దరు బయటికి రాలేదు. లోపలకూడ లేరు. బాబూ" అని కొంత గాభరా పడుతూ వచ్చి రామమోహన్‌తో చెప్పాడు. ఏమి తెలియని వానివలె మోహన్ కణఘాతం తిన్నట్లు తటాలున కారునుండి దుమికి, రసూల్‌తో బాటు లోపల వెలుపల వారికై వెతకసాగాడు. అచ్చట నిలబడివున్న గేటుకీపర్ల నడిగాడు. కాని వారికేమి తెలుసు ప్రసన్న ఎవరో? మాణిక్య మెవరో!

"రసూల్, ఏదో మోసం జరిగిందని తోచుతూవుంది. ఎక్కడికి పోయివుంటారంటావు ప్రసన్న, మాణిక్యం ?"

"నాకేమితెల్సుబాబు ? నేను సినిమా వదలకముందే వచ్చా నిక్కడికి. అప్పటినుండి గేటువద్దనే వున్నాను. ముందుగా వారు పొయ్యేందు కవకాశ మెక్కడుంది ?"

"నే నింకా యిక్కడే వున్నాను - మన కారు కాదని - యింకెవరి కారులోనైన - లేదా జట్కాలోనైన యింటికి వెళ్ళివుంటారా ? నీవు తక్షణం కారులో ఇంటికివెళ్ళి యింటికేమైన వచ్చారేమో నాన్నగారిని, అమ్మను విచారించుకొని వెంటనే తిరిగిరా, మళ్ళా కారు తీసుకొనిరా."

రామమోహన్ చెప్పిందే తడవుగా రసూల్ శరవేగంతో కారును నారాయణరావు యింటివైపు నడిపించుకొని వెళ్ళిపోయాడు.

పైకి తా నెంత ధైర్యంగా యీ నాటకమాడిన, మోహన్‌కు లోలోపల తండ్రివల్ల ముందింకేమేమి అనర్థకం కలుగుతుందో అనే భయం ముంచుకొస్తూంది. అయిన ఆ యువకుడు ధైర్యాన్ని చిక్కబట్టి - తెలివిని సరియైన మార్గంలోనే ఉపయోగిస్తున్నాడు.

కాంతమ్మకు, మాధవరావుకు తెలుసు నా ర్త్రాత్రి విజయకుమార్ ప్రసన్న నింటికి పిలుచుకొని వస్తాడని. రాధతోకూడ వారిద్దరు కాచుకొని ఉన్నారు వారి రాకకు. ఎదురు చూచినట్టు ఎనిమిదిన్నరకల్లా కారు వచ్చి కాంపౌండులో ప్రవేశించింది. విజయకుమార్ దిగి లోపలికి వెళ్ళి చెప్పాడు తల్లితో ప్రసన్న, మాణిక్యం వచ్చారని. కాంతమ్మ బిడ్డతోవచ్చి ఆడవారి నిద్దరిని ప్రేమ పురస్సరంగా లోపలికి గొంపోయింది. ప్రసన్న మొదట కుడికాలు గడపలోవుంచి లోపలికివెళ్ళి అత్తకు, మామకు పాదాభివందనం చేసింది. కోడలనిచూచి వా రిద్దరు ఆనందబాష్పాలు రాల్చారు. కన్ను లొత్తుకుంటూ నిలచిన ప్రసన్నను, మాణిక్యాని

ఊరడిస్తూ కాంతమ్మ యిద్దరిని లోపలి గదిలోకి కొంపోయి ఊరటమాటలు చెప్పింది. మాధవరావుకూడవచ్చి సమాధానంచెబుతూ 'మీ రేమి విచారించకండమ్మా. మాయింటి కీదినం శుక్రవారంపూట మహాలక్ష్మివలె వచ్చావు. ప్రసన్నా! ఏదో అంతా సహజంగా జరిగివుంటే బాగుండేది కాని, ఇప్పుడుమాత్రం అయిందేది లేదు. నీకు మీ పినతండ్రివల్ల ఏలాటి యిబ్బంది కలుగకుండ చూచుకొనే భారం మాది. మీ అన్న, పిన్ని యిద్దరు నీ పరంగా వున్నారు. ఇంక నిన్ను చిన్ననాటినుండి ఎత్తి పెంచిన మాణిక్యంకూడ నీవెంట వుంది" అని ప్రసన్న నోదార్చాడు.

కాంతమ్మ మనసారా కోడలిని దీవించి కౌగిలించుకొని "రాత్రివేళ వచ్చావు. ఆగర్భ శ్రీమంతురాలవు. దృష్టిదోషం తగలకుండా దిగదీతునుండమా" అని ఎర్రనీళ్ళు కలిపి దిగదుడిచి బయట పారవేసివచ్చింది.

మాణిక్యం ప్రసన్న చేతులను కాంతమ్మ చేతుల్లోపెట్టి "అమ్మా, ప్రసన్న సాహసాన్ని వేరు విధంగా తలంచవద్దండి. ఉత్తమకన్యా లక్షణాల ననుసరించి తా నొక్కమారు మనసులో నిశ్చయించుకొన్న మగవానినే పతిగా స్వీకరించి, పరమదైవంగా సేవింపవచ్చింది. అమ్మాయిని గురించి హెచ్చుగా చెప్పితే పొగడ్త అవుతుంది. విద్య, వినయములతోబాటు మేలుజాతి స్త్రీకుండవలసిన సుగుణాలన్ని యీమె సొత్తు. అంతటి బలవంతుడైన పినతండ్రినికూడ కాదని తాను వలచినవాడే తన దైవమని, మీ పంచ చేరింది" అని సాభిప్రాయంగా మాధవరావు, విజయకుమారులవంక చూచింది. మాధవరావు మాణిక్యానికి ధైర్యంచెప్పి "ఈమె మాకు కోడలు కావడానికి మే మెంత పుణ్యం చేశామో" అని ఆనందబాష్పాలు రాల్చాడు.

ప్రసన్న కండ్లలో యింకా నీరు తిరుగుతూవుంది. తానప్పుడు చేసిన సాహసకృత్యాన్ని తలచుకొంటే తనకే ఒళ్ళు జలదరిస్తూంది. ఇక తెల్లవారుచే తడవుగ పినతండ్రి తన సంగతిని తెలిసికొని ఏమి గలటా

చేస్తాడో అని లోలోన భయపడుతూంది. ఏమైన అగుగాక—తాను చేసినది ధర్మబద్ధమైనదని ఆమె అంతరాత్మ ఘోషించింది.

కోడలిని చూచిన క్షణంనుండి అప్రయత్నంగా హృదయములో ఉబికివచ్చిన ప్రేమానురాగ ప్రవాహములో ఆమెను ముంచి ఎత్తుతూ కాంతమ్మ అమృతోపమానములైన మాటలతో ఊరడించింది ప్రసన్నను.

మాధవరావు కొడుకుతో వెలపలికివచ్చి యిలాగన్నాడు.

"ఇంతవరకు సవ్యంగానే జరిగింది. ఇట్టి భార్య లభించడం నీ అదృష్టం. తెల్లవారితే నారాయణరావు వల్ల యేమి తొందర కలుగుతుందో తగిన జాగ్రత్తలో ఉండాలి."

"ఆ సంగతంతా ముందుగానే నిర్ణయించబడింది. సముద్ర ముప్పొంగి మీదపడినట్లు రేపే నారాయణరావు దాడి మనపై జరుగవచ్చు. నిరంజనరెడ్డి, చంద్రశేఖరం అన్ని బందోబస్తులు చేయించేందుకు మాట యిచ్చారు. వారిద్దరు తెల్లవారేందుకు ముందే వస్తారిక్కడికి.

"నారాయణరావు మనల నేరీతిగా తొందర పెట్టగలడని మీ అభిప్రాయం?"

"బలవంతంగా బిడ్డను వాపసు పిలుచుకొని పోయేందుకు రావచ్చు. ఆ సందర్భములో కొంత ఘర్షణ తప్పదు.

మాధవరావు మరల లోపలికి వెళ్ళి "అమ్మా, మాణిక్యం మీరీ గదిలో నిశింతతో వుండండి, నారాయణరావుగారు మీకు కాని, మాకు కాని ఏలాంటి తొందర కలిగించేందుకు వీలు లేకుండా మా అబ్బాయి అన్ని యేర్పాట్లు చేశాడు. ఏనాటి ఋణానుబంధమోకాని మా వంటి సామాన్యులకు ప్రసన్న వంటి కోడలు లభిసుందా తల్లీ?"

వారిద్దరిని ఒక ప్రత్యేక గదిలో వుంచాను. దానికి వెలుపలికొక ద్వారం, లోపలికొక ద్వారం కలవు. వెలుపలి వాకిలికి తాళం వేసు

బడింది. ఎవరయిన యికమీద బయిటి వారు వచ్చి మాట్లాడవలసివస్తే కిటికీల గుండా మాట్లాడవచ్చు. అంటే, నారాయణరావు కాని, అతని తాలూకు మనుషులు కాని దౌర్జన్యంగా లోపలికి వెళ్ళడానికి వీలు లేదు.

ఇద్దరికి రెండు మంచాలమీద ప్రక్కలు తయారుచేసి ఉంచబడ్డాయి. కాంతమ్మ, రాధ వారితోనే ఆ గదిలో పండుకొన్నారు. అత్త చెప్పే ధైర్యం మాటలతో ప్రసన్న మనసు తేలికపడింది. మాణిక్యానికి చాల సంతోషం తలిగింది.

అనుకొన్నట్టు తెల్లవారక ముందే చంద్రశేఖరం, నిరంజనరెడ్డి వచ్చారు కారులో. వారు తమ వెంట యిద్దరు పైలాపచ్చీసులను పిలుచుకొని వచ్చారు. విజయకుమార్‌ను చూచి "వీరిద్దరు కొన్నాళ్ళు పాటు రాత్రింబవళ్ళు మీ యింటివద్ద కాపలాకాస్తుంటారు. అవసరమైనప్పుడు నీవు చెప్పకముందే అదనంగా సిబ్బందిని పంపుతాము." అని ధైర్యం చెప్పి వెళ్ళిపోయారు.

* * *

రసూలు హడావుడిగా వచ్చి "చిన్నమ్మ, మాణిక్యంగార్లు సినిమా హాలులో లేరండి. ఇంటికేమైన వచ్చారా?" అని సంగతంతా చెప్పి అడిగేటప్పటికి శ్యామసుందరి ఏదో మిన్నువిరిగి మీదపడ్డట్టు ఆందోళన పడసాగింది, అదంతానటన, ఆమెకు తెలుసు ఏమి జరిగివుండేది. అట్లా జరగాలనే ఆ దినం సినిమా ప్రోగ్రాము నుంచింది కొడుకుతో ఆలోచించి.

నారాయణరావు కాళ్ళు కాలిన పిల్లిలాగా ఎగురులాడుతూ భార్యను వెయ్యి ప్రశ్నలడిగాడు. ఆమె జారి జాగ్రత్తగా తత్కాలోచితమైన వేషం వేసింది. వెంటనే నారాయణరావు కారులో సినిమాహాలు వద్దకు వచ్చి కొడుకును కలిసికొని విచారించాడన్ని సంగతులు, తల్లివలెనే నాటక

మాడుతూవుండే రామమోహన్ తన పాత్రాభినయనాన్ని అద్భుతంగా ప్రదర్శిస్తూ, తండ్రితోబాటు ఆశ్చర్యాన్ని, విషాదాన్ని, కోపాన్ని కావలసినంత వెలిబుచ్చాడు. కింకర్తవ్యతా మూఢులై యిద్దరు తిరిగి ఖింటికి వచ్చారు.

లోపలినుండి ఎంతో కంగారుపడుతున్న దానివలె శ్యామసుందరి పరుగు పరుగున వచ్చి "ఏమండీ, ప్రసన్నగదిలో నాకీ జాబు దొరికింది చూడండి" అని ఒక జాబును నారాయణరావు చేతిలో బెట్టింది. అది కూడ మున్ముందుగా ఆమె, రామమోహనుడు చేయించిన ఏర్పాటే.

నారాయణరావు జాబును చదువుకొన్నాడు. అందిట్లుంది,

"ప్రియమైన పినతండ్రి గారికి,

నా కన్న తలిదండ్రులెవ్వరో నాకు కనబడకపోయినా మీరేనాకు అమ్మా – నాన్నా –అని మనసార నమ్మి ఉంటిని. అలాగే మీరింతవరకు నన్ను గారాబంగా పెంచి పెద్దచేశారు. నా మీద మీకున్న ప్రేమను నేనెన్నడు సంశయించలేదు. కాని, యిప్పుడు నావివాహ విషయములో నా కోర్కెను కాదని, నాకిష్టము లేని వానికి నన్నంటగట్టి నా జీవితాన్ని దుఃఖమయం చేయ సమకట్టినారు. ఇది నా దురదృష్టం, ఈ పనిని వలదని ఎవరెంత చెప్పిన వినక, మిమ్ము ఆవేశించిన దురాశా పిశాచము యొక్క ప్రభావం వల్ల పూర్తి పిచ్చివాడై పోయారు. నిర్మలమైన ప్రేమ యొక్క విలువను మీరు గుర్తించలేదు. ఇంతకు నేకోరినవాడు అన్ని విధాలా అనుగుణ్యుడై నందుచేత, నా విషయములో నేనే పెద్దనై పట్టుదల చూపవలసివచ్చింది. మీరంతా తల్లిపిల్లలు ఏకమై, మీ స్వార్థానికోసరం నా సుఖాన్ని బలియీయడానికి సిద్ధపడినప్పుడు, నాకింక సలహాయిచ్చే వారెవ్వరు యీ యింట్లో లేనప్పుడు, నాకు నేనే పెద్దనై ఆచరించడం తప్పనిసరి అయింది. మీ మూర్ఖగుణమే నాకీలాంటి పనిచేయడానికి

ప్రోత్సాహ మిచ్చింది. ఇందులో నా తప్పేమి లేదు. పరిస్థితులకు జంకి పిరికిపందనై ఆత్మహత్య కావించుకొనేందుకంటే, సాహసించి పురాణ కాలము నాటి రుక్మిణీదేవి ఆదర్శాన్ననుసరించి, నాకుత్తమమని తోచిన దారిని నేను వెళ్ళిపోతున్నాను. చిన్ననాటినుండి కన్నతల్లివలె పెంచిన మాణిక్యం మాతృభావంతో నా వెంట వుంటుంది. తరువాతనైన మీరు మీ పొరబాటును గుర్తించి సవ్యంగా వర్తించగలిగితే మనమందరము ఒకటిగా ఉండగలము. లేకున్న నేటితో నాకును, మీకును ఋణము తీరింది.

ఇట్లు,

ప్రసన్న...."

శ్యామసుందరి అంతా విని "హా—అమ్మా, ప్రసన్నా! ఏమిపని చేసిపోయావే, తల్లీ" అని ఏడ్వసాగింది. "అబ్బా, యీ ఆడపిల్ల కింత సాహసమా!" అని రామమోహనుడు ఆశ్చర్యపడసాగాడు. నౌకర్లంతా ఎక్కడి వారక్కడ బిక్క మొగాలతో నిలబడిపోయారు.

నారాయణరావు మనస్సంతా సంక్షుభిత మహాసాగరంవలె ఝుర్రిల్లపోతూంది. కోపంతో కండ్లు జేవురించాయి. భార్య, కొడుకు కలిసి ఈ నాటకమాడారని అతనికేమాత్రం తోచలేదు. ప్రసన్న మీద నిప్పులు గ్రక్కాడు. నానావిధాల ఆమెను దూషించాడు. ఇప్పుడింకేమి చేయవలెను? సోమవారం పెండ్లి ముహూర్తము ముంచుకొని సర్వసన్నాహాలు యిరుపక్కాల చేయబడుతూవుంటే, శుక్రవారం రాత్రి ప్రసన్న యీ పని చేసి ఎక్కడికో పరారయింది. "ఎక్కడికి పోయి ఉంటుందా?" అని అతడు అంత దీర్ఘంగా ఆలోచించక ముందే అతనికి లేఖలోని విషయాన్ని బట్టి వెంటనే స్ఫురించింది. "విజయకుమార్ ఇంటికి వెళ్ళి వుంటుందని".

భార్య, కొడుకు అతని అనుమానాన్ని బలపరిచారు. నారాయణరావు కొడుకుతో యిట్లన్నాడు, "నీవు వెంటనే పోలీసు స్టేషనుకు ఫోను

చేసి వారేమి చెబుతారో కనుక్కో" మన్నాడు. రామమోహనుడు తండ్రి ఎదుటనే ఆ పనిచేసి "ఈరాత్రిపూట వారు రారట. తెల్లవారి ఎనిమిదింటికి వస్తారట." అన్నాడు.

"సరే, ఆ ఢాకిని ఆ డాక్టరు ఇంటికే వెళ్ళి ఉంటుంది. తెల్లవారే లోగా నీవు వెళ్ళి మనకు కావలసిన వారికి సంగతి చెప్పి పిలుచుకొనిరా" అని ఎవరెవరి వద్దకెళ్ళాలో. ఏమేమి చేయాలో వివరంగా చెప్పి కారులో కొడుకును పంపివేశాడు. తరువాత నారాయణరావు బోనులోని పులివలె గదిలో తారాడుతు దీర్ఘాలోచనలో పడిపోయాడు. ఆ రాత్రంతా వారెవ్వరికి నిద్రలేదు.

ఇల్లు వదలిపోయాక రామమోహనుడు చేసినపని యిది....

కారు డ్రైవర్ రసూల్ను తమవానిగా చేసుకొని వానితో జరిగిన సంగతంతా చెప్పివేశాడు. అదంతా విని రసూలు బలేపని చేశారు బాబూ. అమ్మాయిని కాపాడారు. పెదబాబుగారెందుకింత మూర్ఖంగా వున్నారో తెలియటం లేదు. మీరేమి చెప్పితే అదంతా చేస్తాను. అంత రహస్యంగా ఉంచుతాను" అని ప్రసన్న విషయములో అధికంగా సాను భూతిని కనబరచాడు. వెంటనే రామమోహనుడు తనకు తెలిసిన ఒక సాహుకారు వద్దకు వెళ్ళి ఐదువేల రూపాయలు బదులిప్పించుకొని విజయకుమార్ యింటికి వెళ్ళాడు.

అప్పటికప్పుడే ఒంటిగంట కావచ్చింది. ఇంటికి తలుపులు మూయ బడినాయి. బయట వరాండాలో రామన్న, రంగన్న అనే యిద్దరు వస్తాదులు పడుకొని వున్నారు. కారు శబ్దం విని విజయకుమార్ కిటికీ గుండా చూచాడు వచ్చిన రామమోహనుని, అతన్ని లోపలికి పిలుచుకొని వెళ్ళి కూచున్నాడు. ప్రసన్న వచ్చి అన్నదగ్గర నిలబడి "అన్నా" అని కన్నీరు కార్చింది మరల. అతడామె నూరడిస్తూ తండ్రికొడుకుతో తమ

యింట జరిగిన సంగతంతా చెప్పి "విజయా, నేనిప్పుడివ్వదలచిన సలహా యేమిటంటే తెల్లవారేలోగా మీరందరు ప్రసన్నను పిలుచుకొని, మీ స్నేహితులు చంద్రశేఖరం, నిరంజనరెడ్డితోబాటు కారులో తిరుపతికి వెళ్ళిపోవాలి. అక్కడ శ్రీ స్వామివారి ఎదుట మీ యిద్దరి వివాహం సోమవారం జరగాలి. ఇది నాయొక్క, మాతల్లియొక్క కోరిక. ఉదయం మా తండ్రితోబాటు మేమంతా యిక్కడికి వచ్చేలోగా మీ యింటికి తాళంవేసి ఉండాలి? మీ ఖర్చులకు ప్రస్తుతం యీ ఐదు వేలిస్తున్నాను." అని డబ్బును విజయకుమార్ చేతిలో పెట్టాడు.

విజయకుమార్ అతని సలహాతో ఏకీభవించాడు. కాంతమ్మ, మాధవరావు "బాగున్న" దన్నారు. మాణిక్యం అబ్బాయి సలహాను ఎంతో మెచ్చుకొంది, ప్రసన్నను మనసారా అన్నయొక్క ప్రేమకు సంతోషించి తన్ను తానభినందించుకొనింది. రామమోహనుని సాహసానికి, ధైర్యానికి చెల్లెలిమీద కల ప్రేమకు అందరు చాల సంతోషించారు.

"విజయా, మనమింక ఆలస్యం చేయకుండ నిరంజనరెడ్డిని, చంద్రశేఖరాన్ని కలుసుకొని మాట్లాడాలి. రమ్మ" అని మాధవరావును చూచి "మీరు మేము వచ్చేలోగా ప్రయాణానికి సిద్ధపడండి" అని తెలిపి విజయకుమార్‌తో అప్పుడే నిరంజనరెడ్డిని, చంద్రశేఖరాన్ని చూడ్డానికి వెళ్ళిపోయాడు.

మిత్రులు నలుగురు ఒకచోట చేరి మాట్లాడుకొన్నారు పరిస్థితులను గురించి. మోహనుని సాహసౌదార్యాలకు నిరంజనరెడ్డి, చంద్రశేఖరం అమితానందం పొంది, అతడు తెలిపినట్టు సోమవారం నారాయణరావుచే నిశ్చయమయిన ముహూర్తానికే తిరుపతిలో ప్రసన్నతో విజయకుమార్‌కు వివాహం జరగటం చాలా సమంజసంగా ఉంటుందని, తామిద్దరు దగ్గర వుండి ఆ పనిని జరిపిస్తామని రామమోహనునికి నచ్చ చెప్పారు.

వెంటనే ఆలస్యం చేయకుండ నిరంజనరెడ్డి రెండు టాక్సీ కారుల నాయాకాలములో మాట్లాడిచెప్పించాడు. సరిగ నాల్గు గంటలకు టాక్సీః రెండు వచ్చి మాధవరావు యింటి ముందు నిలిచాయి. ఆడవారు నలుగురు మగవారు నలుగురు వేర్వేరు టాక్సీలలో కూర్చున్నారు అవసరమైన వస్తువులతో.

రామమోహనుడు చెల్లెలికి తన శుభాకాంక్షలు తెలిపి, మాణిక్యంతో చెప్పవలసిన సంగతులు చెప్పి, అందరివద్ద శెలవు తీసికొని – యిక తండ్రి చెప్పిన పనిని చూడడానికని తన కారులో వెళ్ళిపోయాడు. తిరుపతికి వెళ్ళవలసిన టాక్సీలు రెండు కదలి పోయాయి.



## 26

వరదరాజును, కలందర్ సాబును, మాదన్న పంతులు మొదలగు వారిని పిలుచుకొని వచ్చునట్లు నారాయణరావు కుమారునికి చెప్పినాడు. రామమోహనుడేదో ఆలోచించుకొని, నేరుగా యింటికి వెళ్ళి తండ్రితో యీలాగన్నాడు. "నాన్నా, మీరు చెప్పిన వారిదగ్గరకు నేను వెళ్ళలేదు. ఇప్పుడప్పుడే మన యింటి గుట్టును ఊరంతా చాటివచ్చుటెందుకు? నేను రాత్రంతా భోగట్టాచేసి ప్రసన్న మానిక్యం ఎక్కడికి వెళ్ళింది కనుక్కొని వచ్చాను."

ఆమాట వింటూనే నారాయణరావుకు ఆతురత అధికమైంది. తాను చెప్పినవారిని సమీపించకుండ కొడుకు ఏదోచేశావని చెప్పిన సమాధానికి తృప్తి పడ్డాడు. "ఏమి కనుక్కొన్నావు? వారెక్కడున్నారు? చెప్పు" అని ఆతురత పెట్టాడు కొడుకును.

"ఎక్కడికెళ్ళాలో అక్కడికే వెళ్ళారు."

"అంటే విశదంగా చెప్పు."

ఉద్విగ్నుడైన తండ్రితో రామమోహన్ "వారిద్దరు విజయకుమార్ పంచచేరారని నాకు రూఢిగా తెలిసింది, నాన్నా" అన్నాడు.

నారాయణరావు నిప్పుత్రొక్కిన వాడిలాగ ఎగిరిపడి "అరే బడవా, ఎంతపనిచేసిందిరా ఈ ప్రసన్న! మాణిక్యం దానికి తోడైంది కదూ? ఇద్దరు ఇంత సాహసాని కొడికట్టారు తుదకు?"

"అవును అంతా అట్లే జరిగింది."

"ఎవరుచెప్పారు నీకా సంగతి?"

"వాళ్ళిద్దరిని ఆడవారు కూర్చునే గేటులో పంపి, నేను బాల్కానీ కుర్చీలో పోయి కూర్చున్నాను. ఎనిమిదింటికి విజయకుమార్ ఒక కారులో వచ్చాడట. ఏమేమి ఏర్పాటు చేసుకొన్నాడో ప్రసన్నను మాణిక్యాన్ని రహస్యంగా బయటికి పిలచి కారులో ఎక్కించుకొని వెళ్ళిపోయాడట. గేటుకీపర్‌కు విజయకుమార్ బాగా తెలుసునట, నాన్నా! అతడే చెప్పాడీ సంగతంతా."

నిర్ఘాంతపడిపోయాడు నారాయణరావు. ఇంకొకవైపు కొడుకు చెప్పుతుండేదంతా విని తాను విపరీతమైన ఆశ్చర్యవిషాదాలను నటిస్తూంది శ్యామసుందరి. కారు డ్రైవరు రసూల్ ఏమి తెలియనివాడివలె యీ నాటకమంతా చూస్తూ ఒకచోట ఒదిగి నిలబడినాడు. కొంతసేపు నారాయణరావు తోకత్రొక్కిన త్రాచువలె చిందులు త్రొక్కి యిట్లన్నాడు "ఓరే, మోహన్, ఇప్పుడే మనవారినందరిని పిలుచుకొని వెళ్ళి విజయకుమార్ ఇంటిని ముట్టడించి, ఆ ఢాకినీ దయ్యాన్ని యీడ్చుకొని వచ్చేది బాగురా?"

"వద్దునాన్నా, తెల్లవారినాక పోలీసువారితో వెళ్ళడం బాగు నాన్నా, [illegible]లో పోవడం నాకంత సమంజసంగా తోచదు."

కొడుకు తనకింకా ఏసంగతి చెప్పకపోయినా, ఏదో చేయవలసిన పనే చేసివచ్చి, భర్తను మభ్యపెడుతున్నాడని శ్యామసుందరి గ్రహించి, ప్రసన్నను, మాణిక్యాన్ని దూషించినట్లు మాట్లాడి, కొడుకు చెప్పినమాటనే సమర్థించింది.

"పోలీసువారే రావలెనా ఈ సంగతికి? మనపిల్ల దొంగతనంగా ఆ డాక్టరు యిల్లు చేరిందంటే, దాన్ని చీవాట్లు పెట్టి మన యింటికి తెచ్చుకొనే అధికారం లేదా మనకు? మనకు తోడయ్యేవారు లేరనుకొన్నారా యీవూళ్ళో? తరువాత ఆ విజయకుమార్ మీద కేసు పెట్టి జైలుకు పంపిద్దాం."

"మీరు చెప్పేదంతా చేయాల్సిందే నాన్నా! మనకెందుకు కేసు, గీసు అని బాధపడాలి? పోలీసువారే అంతా తెల్లవారితే కన్నారా చూచి ప్రసన్నను మాణిక్యాన్ని మన స్వాధీనంచేసి, విజయకుమార్ మీద వారే కేసు పెట్టుతారు. మనము చేయవలసినదంతా వారే చేస్తారుగా?"

"సరే, అదీ మంచి ఆలోచనే. నీవు సరిగ ఎనిమిదింటికి పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి, రిపోర్టు నిచ్చి, సబ్ ఇన్‌స్పెక్టర్‌ను, ఇద్దరు కాన్‌స్టేబుల్సుతో వచ్చేట్టు నామాటగా చెప్పు. సబ్ ఇన్‌స్పెక్టర్ రంగరాజుకు నేనంటే చాల గౌరవం. వెంటనే వచ్చేస్తాడు."

"అలాగే, నాన్నా."

నారాయణరావున కణుమాత్రము కొడుకు మీద, భార్యమీద అనుమానం కలుగలేదు. వారిద్దరు అంత చాకచక్యంగా తమ పాత్రల నభినయిస్తున్నారు. శివమెత్తినవాని వలె ఎగురులాడినంతసేపు ఎగురులాడి అతడు తన గదిలోకి పోతే, శ్యామసుందరి "మోహన్, రాత్రంతా నీకు నిద్రలేకపోయింది, కాఫీ తీసికొందువు రా" అని కొడుకును లోపలికి

పిలుచుకొని వెళ్ళింది. ఆమెతో రహస్యంగా, జరిగిన సంగతంతా చెప్పి వేశాడు. రామమోహనుడు. అదంతా విని "హమ్మయ్యా. ఇప్పటికి మన సింత కుదుటపడిందిరా, బాబూ" అని ఆమె దీర్ఘంగా విశ్వసించింది.

అంతలో మరల నారాయణరావక్కడికి వచ్చి "ఒరే, మోహన్, విజయకుమార్ వాళ్ళనిద్దరిని సినిమాహాలుల్లో నుండి బయటికి పిలిచింది నీవు చూడలేదంటావా?" అని అడిగాడు.

"ఏమినాన్నా, అలా అడుగుతావు? చూచివుంటే నేనూరకే ఉండే వాడినా వాణ్ణక్కడే హతంచేసి ఉండను? ఏదో పిక్చర్ కాస్త బాగుంటే చూడడంలో నిమగ్నుడై పోయాను. అంతలో యింత హడావుడి జరిగి పోయింది.

"అయితే వాడే వాళ్ళను తమ యింటికి పిలుచుకొని పోయా డంటావా?"

"ఇంకా అనుమాన మెందుకు, నాన్నా? అలాగే జరిగి వుంటుంది. గేటుకీపర్ నాతో చెప్పాడంతా."

"మరి మన మిప్పుడే ఎందుకుపోరాదు?"

"చెప్పానుగా దానికి సమాధానం. ఇంక ఒక గంట తాళితే పోలీ సులే వస్తారు, నాన్నా! అంతా వారి ద్వారా జరుగడమే మనకు గౌరవము కాదా? ఇంతలో వారెక్కడికిపోతారు?"

"అంతేలే, ఇంకెక్కడికి పోతారు. వెంటనే చిక్కిపోతారు. శ్యామా, ఇదంతా ప్రసన్న మానిక్యంముందుగా తంతు పన్నినట్టుంది కదూ?"

"అలాగే వుందండి. మొన్న మాణిక్యం రెండుమాట్లు ఎవరితోనో మాట్లాడాలి అని ఎక్కడికో పోయివచ్చింది. ఇప్పుడంతా నాకర్థమౌతూంది.

ప్రసన్న అది యీరీతిగా ఆ విజయకుమార్‌తో లోలోపల ఏదో పథకం పని వుంటారు. అందుకే సాయంకాలం సినిమాకని బయలుదేరింది."

"అవును. కాని, ముందుగా నాకు మాణిక్యం సంగతి చెప్ప కావు?" అని గద్దించి అడిగాడు భార్యను నారాయణరావు.

"నాకేమి తెలుసునండి ఆ మాయలాడి యీ నాటకమాడుతుందని ఎప్పుడైన ఊళ్ళోకి పోయివచ్చినట్లే పోతుంది కదా అని అనుకొన్నాను."

"ఇప్పుడు శంభుదాసు కేమని చెప్పేది? ఈ పాడు ఘటాలవల్ల నా వంశ మర్యాద మంట కలిసిపోయింది.

అని నారాయణరావు చాల విచారధీనుడై అటుయిటూ తిరుగాడుతూ వుండగానే భళ్ళున తెల్లవారింది.

రామమోహన్‌కు బాగా తెలుసు విజయకుమార్ ఇంటికి తాళంవేసి ఉంటుందని – ఇంటివారెక్కడికి వెళ్ళింది ఎవ్వరికి తెలియదని అందుకే తండ్రికంటే తానే ముందుగా "పోలీసువారిని పిలుచుకొనివస్తా నాన్నా" అని ఏడుగంటలకే కారులోకూర్చొని స్టేషన్‌కు వెళ్ళాడు.

సబ్ఇన్‌స్పెక్టర్ రంగరాజుతో తన చెల్లెలు, వంటమనిషి మాణిక్యం ఇంటినుండి పరారయ్యారని చెప్పి తక్కిన వివరాలన్ని తన తండ్రికి చెప్పి నట్టే చెప్పాడు. రంగరాజు అతన్ని ఎన్నో ప్రశ్నలడిగాడు. వాటికంతా కూడ సమాధానాలిచ్చాడు. వెంటనే యస్. ఐ. ఇద్దరు కాన్‌స్టేబిల్స్‌తో కారులో కూర్చొని నారాయణరావు యింటికివచ్చి. అక్కడ మరల నారాయణరావు నడుగవలసిన సంగతులడిగి అతనితోను, రామమోహన్‌తోను, విజయకుమార్ ఇంటికి వెళ్ళి చూచేసరికి అక్కడ తాళంవేయబడింది. అక్కడ ఎవ్వరు లేరు.

వచ్చిన వారంతా అయోమయ స్థితిలో పడిపోయారు. వారెక్కడికి వెళ్ళిందేది చెప్పేవారు లేరు. ఇరుగు పొరుగున ఉన్నవారిని విచారిస్తే

"మాకేమి తెలియదండి. తెల్లవారి మూడు, నాల్గు గంటలప్పుడేవో కార్లు వ్నట్టు శబ్దం వినవచ్చింది. అదేమని మేమెవ్వరము బయటికి వచ్చి లేదు. తెల్లవారేసరికి ఇంటికి తాళం వేయడం చూచి మాకూ ఆశ్చ కలిగింది." అని సమాధానం చెప్పారు వారంతా.

"నేను అప్పుడే వత్తామురా అంటే ఏమేమో వాగితివి. ఇప్పుడు చూడు ఏమి జరిగిందో. వారా ఢాకినిల నిద్దరిని ఎక్కడికో పిలుచుకొని పొయ్యారు." అని నారాయణరావు కొడుకుమీద్ధ మండిపడినాడు. "నాకేమి తెలుసు నాన్నా. వీరింతపని చేస్తారని?" అని చెప్పిన రామమోహనుని సమర్ధించి, యస్. ఐ. నారాయణరావును సమాధానపరుస్తూ, మరల వారి యింటికి వచ్చేశాడందరితో.

# 27

టాక్సీలు రెండును కడప చేరేసరికి పంద్రెండు కొట్టింది. నిరంజన రెడ్డి వాటిని తన మిత్రుడైన వకీలు వెంకట్రామరెడ్డి యింటికి నేరుగ నడి పించినాడు. వారా దినమంతా తమ యింటిలో హాయిగా మకాంచేసే విష యములో వెంకట్రామరెడ్డి చాల ఉత్సాహము కనబరచుటే కాక, మిత్రుడు చెప్పినదంతా విన్నాక తానుకూడ తిరుపతికి వెళ్ళేందుకు సిద్ధపడ్డాడు. కాంతమ్మ, మాధవరావు హోటల్ తిండి తినేవారుకారు. అందువల్ల అక్కడే వంట ప్రయత్నం చేయబడింది. వారితోబాటు వేంకట్రామరెడ్డి కూడ భోజనం చేశాడు.

అప్పుడప్పుడు ఎట్టి పరిస్థితుల్లో తానీరీతిగ పెండ్లికూతురు కావలసి వచ్చినది తలచుకొని ప్రసన్న – ఆమెకొరకు మాణిక్యం – విచారపడు

చుండటంచూచి మాధవరావు మొదలైనవారు చాలవరకు ఊరడించి, వారా విషయాన్నే యించుమించుగా మరచేట్టు చేయగలిగారు.

ప్రసన్నకు, విజయకుమార్‌కు మనసిచ్చి మాట్లాడుకొనేందుకు తగిన అవకాశమంతా లభింపలేదు, అయినా, సమయం దొరికినప్పుడల్లా తమ సంతోషాన్ని, ప్రేమభావాన్ని, చూపులతో, చేష్టలతో వ్యక్తపరచుకొంటూ ఆనందింప సాగారు. ఆజంటనుచూచి అందరు చాల సంతృప్తిపడ్డారనడంలో విశేషమేమీ లేదు.

ఆదివారం సాయంకాలమే అందరు తిరుపతి చేరారు. ఒక వారానికి నలభై రూపాయల అద్దెనిచ్చి శ్రీ రామాలయానికి సమీపంలో ఒక పెద్ద యింటిని యేర్పాటుచేసుకొని అందులో మకాంచేశారు. తిరుమలమీద శ్రీ వేంకటేశ్వరస్వామి సమీపములో వివాహము జరిగేందుకు కావలసిన ఏర్పాట్ల నన్నిటిని నిరంజనరెడ్డి మున్నగువారు చేయించారు.

తలపెట్టిన కార్యక్రమానికేలాటి లోటు కలుగలేదు. ఏకార్యము నెర వేరవలసినా భగవదనుగ్రహము ముఖ్యముగ ఉండి తీరవలెను. అది వారి యెడ యేమాత్రం కొరవడలేదు. వారు సంకల్పించినట్టి, ఎగువ తిరుపతిలో శ్రీ స్వామివారి అనుగ్రహముతో — నారాయణరావు అచ్చువేయించిన ముహూర్తానికే — ప్రసన్నా విజయకుమారులకు శాస్త్రోక్తముగ పెండ్లి జరిగింది.

అందుకు బంధు మిత్రులెంతో ఆనందించారు. రామమోహన్ యిచ్చిన డబ్బులో వెయ్యి రూపాయలు పెండ్లికై ఖర్చుపెట్టబడింది. విజయ కుమార్ ప్రక్కన అపర లక్ష్మివలె ప్రకాశిస్తున్న ప్రసన్నను చూచి మాధవ రావు, కాంతమ్మ ఒకవంక అమితానంద మొందుతుంటే, మిత్రులాతనిని మరొకవంక అభినందించారు.

పెండ్లినాటి రాత్రి అచ్చటి యాత్రికుల్లు [illegible]

నాని కాహ్వానింపబడ్డారు. మరుసటిదినం కొండమీది సాధువులకు, భిక్షకులకు అన్నదానం చేయబడింది. విజయకుమార్ భార్య కోరికమీద శ్రీ స్వామివారి కొప్పెరలో సుమారు ఐదువందల రూపాయల వెలచేసే ఆమెనగ నొకదాన్ని భక్తిపురస్సరంగా పడవేశాడు.

మూడవదినం రాత్రి దిగువ తిరుపతిలో — తాము తీసికొన్న అద్దెయింట్లో — గర్భాదాన ముహూర్తం జరిగిపొయ్యింది.

ఇంగితజ్ఞులైన చంద్రశేఖరం, నిరంజనరెడ్డి, వేంకట్రామరెడ్డి ఆ మరుదినం మధ్యాహ్నం తమకు మదరాసులో ఏదో పనివుందని, నాలుదినములవరకు రామనిచెప్పి వెళ్ళిపోయారు. నూతన దంపతులు "హనీమూన్" దినాలు హాయిగా గడపాలని వారుచేసిన ఉపాయమది. విజయకుమారుకు అర్థమైందంతా.

ఉన్న నాల్గుదినాలు ప్రతిదినము స్వామివారి సందర్శనముచేస్తూ, పుణ్యతీర్థాల్లో గ్రుంకులిడుతూ ధన్యులు కావలెననే తలంపుతో కొడుకును, కోడలిని ఆయింట్లో ఒంటరిగా వదలి మాధవరావు భార్యతోను, మరొకని వెంటతీసుకొని మరల తిరుమలచేరి ఒక సత్రపు గదిలో బసచేశాడు.

నూతన వధూవరుల నిద్దరిని నాల్గుదినాలపాటు సుఖపడనిమ్మని వదలి పోయారందరు. తామభిలషిస్తూ వుండిన ఏకాంతవాసం లభించింది. ప్రసన్నా విజయకుమారుల కిప్పటికి.

వారి ప్రణయలీలలు వేయివిధాల వెలిశాయి. అంతరాయము లేకుండ ఆ మూడు దినాలు వారు స్వర్గసౌఖ్యాన్నే అనుభవించారు. నిద్రా, భోజనాది కృత్యాలన్ని ఆ సుఖం ముందు లాంఛనమాత్రంగా జరిగిపోయాయి. ప్రేమ ప్రపూర్ణమైన ఆ లేతగుండెల్లో గూడుకట్టుకొన్న మూక భావాలెన్నో యిప్పుడు శృతికలిపి మాట్లాడుకొంటూవుంటే, జంట పక్షుల్లాగా స్వేచ్ఛా విహారం చేసి చేసి, అలసి సొలసి, ప్రేమవాహినిలో మునకలువేస్తూ కాలం [illegible]

"మీ ఏకాంతవాసానికిది నాల్గవరోజు" అని హెచ్చరిస్తూ శుక్ర వారం ఉదయాన సూర్యోదయమైంది. అంతకు ముందే నిద్రలేచిన ప్రసన్నకు మరల రంగపురానికి వెళ్ళవలెననే తలంపుతోచి కొంత అలజడి కలిగింది. ఆమె ప్రశాంతమైన మగని ముఖములో ముఖంకలిపి "ఈ దినం తిరుగు ప్రయాణం కదూ?" అని ప్రశ్నించింది.

అతడామె సుస్నిగ్ధకపోలాలు సవరించి చిబుకం పుడుకుతూ "ఏం, భయమౌతుందా?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

"భయమయ్యేందుకు నేనేమి తప్పుచేశానని? మా పినతండ్రి ఏమి చేస్తాడో అనేదొకటే నాకు దిగులు. అదైన యీ ఏడుకొండలస్వామి దయవల్ల వారైపోతుంది లెండి."

"మరేం ఫరవాలేదులే. ఇంక నన్ను, నిన్ను వేరుచేసే శక్తి ఏ మానవునికి లేదు."

"ఆపని పుట్టించిన దేవునికికూడ సాధ్యము కాదులెండి."

ఇద్దరు పడకనుండి లేచి, స్నానపానాదులు ముగించుకొనే వేళకు యింటిముందు ఒక జట్కాబండివచ్చి ఆగింది. అందుండి దిగిన అత్తచేతి లోని పెద్ద మూటనందుకొని ప్రసన్న ఆమెను లోపలికి పిలుచుకొనివెళ్ళింది. మాణిక్యం సాభిప్రాయంగా ప్రసన్న మొగంవైపుచూచి, సంతృప్తిగా తనలో తాను నవ్వుకొంది.

"మాకు శ్రీ వెంకటేశ్వరులవారి ప్రసాదం తెచ్చారా, నాన్నా?" అని అడిగాడు విజయకుమార్ తండ్రిని.

"అదేమి మాటరా? మీకే ప్రసాదం లేకపోతుందా? అంతా ఆ పర మాత్మ కృప. యాత్ర చాల సుఖంగా సాగింది. నిరంజనరెడ్డి వాళ్ళు రాలేదా? అన్నాడు మాధవరావు, కొడుకుచేతిలో ప్రసాదంమూట పెడుతూ. "వారు

యీ దినం మధ్యాహ్నం బండికికదూ వస్తామన్నారు? రంగపురానికి రేపు బయర్దేరాలని నిరంజనరెడ్డి చెప్పాడు."

"అవును క్రొత్తగా ఛేర్మెన్ అయ్యాడు. అతనికెన్నో పను లుంటాయి."

స్వామివారి ప్రసాదం స్వీకరించి తనకు నమస్కారంచేసిన కోడలిని అనురాగంతో తలదువ్వి కాంతమ్మ "వచ్చే యేడాదికి బంగారంలాంటి కొడుకు నెత్తుకోవమ్మా" అని దీవించింది. దాపున నిలిచిన విజయకుమార్ తనవైపు ఓరగంటితోచూచి చిరునవ్వు నవ్విన ప్రసన్నను చూచి "అమ్మ కప్పుడే ప్రారంభమయ్యాయి కోర్కెలు" అని తానూ నవ్వాడు. మాణిక్యం, రాధ కూడ నవ్వారా మాటకు.

ఎదురు చూచినట్టి మిత్రులు ముగ్గురు మద్రాసునుండి తిరిగివచ్చారు మధ్యాహ్నానికి. భోజనానంతరం విజయకుమార్ వారందరికి స్వామి ప్రసాదాన్ని పంచిపెట్టాడు. చంద్రశేఖరం డాక్టరుతో "ఏమోయ్, విజయా, పరమేశ్వరుని దయవల్ల ధన్యుడయ్యావు. ఇంక ఊరికి వెళ్ళడానికి అభ్యంతర మేదైనా ఉందా? నిరంజనం ఆతురపడుతున్నాడు." అన్నాడు.

"అభ్యంతరమేముంది? ప్రయాణానికి సిద్ధంగా వున్నాము"

ప్రయాణానికి రెండుగంటలు ముందుగా అందరు కార్లలోకూర్చొని తిరుపతిలో యిటీవల స్థాపింపబడిన విశ్వవిద్యాలయాన్ని, పారిశ్రామిక కేంద్రాలను చూచివచ్చారు. కోడలికిష్టమైన వస్తువులను కాంతమ్మ కొనింది. సరిగ నాల్గు గంటలకు టాక్సీలు తిరుపతిని వదలి మరల కడప ముఖమై బయలుదేరాయి.

# 28

ఇక రంగపురములో నారాయణరావు సంగతి ....

తన పథకమంతా భగ్నమై పోయినందువల్ల కలిగిన హతాశ, తన్ను వంచించి ప్రసన్న పారిపోయిందనే కోపం, అందువల్ల తనకింక నలుగురిలో కలుగనై యున్న అవమానం, పరోక్షంగానో ప్రత్యక్షంగానో యీనాటకానికి భార్య పుత్రుడు తోడై వుందురేమో అనే అనుమానం వల్ల వారిపై కలిగిన అసహ్యం – అన్ని అతన్ని కేవలం పిచ్చివానిగా మార్చి వేశాయి.

ప్రసన్న విజయకుమార్ వెంట వెళ్ళిపోయిందని కొడుకే చెబుతున్నాడు కాబట్టి యింక ఆ విషయమై అనుమానమేమి లేదు. ఇప్పుడు వారెక్కడికి వెళ్ళి వుంటారా అనేదే సంశయం. అందులో మాధవరావు కుటుంబమంతా వెళ్ళిపోయింది. ఇంకా విచారించేసరికి ఊళ్ళో చంద్రశేఖరం, నిరంజనరెడ్డికూడ లేరని తెలిసింది. ఇంకా ముంజేతి కంకణానికి అద్దమా? అందరుచేరి ప్రసన్నకు, విజయకుమార్‌కు ఎక్కడో పెండ్లి చేయడానికే వెళ్ళిపోయారని నారాయణరావు నిశ్చయించుకొన్నాడు.

శ్యామసుందరి, రామమోహన్‌ల మీద రెన్నాళ్లుగా ఎందుకో నారాయణరావుకు విశ్వాసం సన్నగిల్లిపోయింది. వారెంత తనతోబాటు తాళం వేస్తున్నా వారి నతడు విశ్వసించలేక పోతున్నాడు. వారి మద్దత్తు లేనిది ప్రసన్న మాణిక్యం పారిపోయేందుకు ఆస్కారం లేదని అతనికి స్ఫురించింది. రహస్యంగా పరంధామయ్య యీ అనుమానాన్ని బలపరచాడు.

ఆ కారణంగా నారాయణరావు భార్యను, కొడుకును నానావిధముల

ప్ప, వారితో మాట్లాడడమే మానుకొన్నాడు. అందరు తన మీద పగ సాధింపబూనినారని అతడు నిశ్చయించుకొన్నాడు. అతడిప్పుడు దినమంతా ఇంటిలో కుబుస మూడ్చిన త్రాసుపాముపలె రోజుచు, భార్యనొక వంక కొడుకు నొకవంక, పరిచారకుల నింకొక వంక కసరికొడుతూ, ఏ మాత్రం మనశ్శాంతి లేకుండ బాధపడుతున్నాడు.

రామమోహనునికి కూడ తండ్రి విషయమై మనస్సు విరిగిపోసాగింది మొదటంతూ తాము చెప్పిన మాట వినలేదు. ఇప్పుడు కలిగిన మనో వైకల్యముతో తన్ను, తల్లిని కూడ శత్రువులుగా చూస్తున్నాడు. గృహ ఛిద్రాలను పెంచుకోరాదని మోహనుడు చిన్నవాడైన చాల నిబ్బరంగానే వర్తిస్తున్నాడు కాని. తండ్రి చర్య లంత కంతకు దుర్భరమై పోతున్నాయి. అయినా అతనితో యిప్పుడు ఘర్షణ పడడం బాగు కాదని తల్లి, కొడుకు ఎట్లో నిబ్బరం వహించి అతని కనుగుణ్యంగానే వర్తిస్తున్నారు. అతడు 'ఔ' నన్న దానిని తాము 'ఔ' నంటున్నారు. 'కా'దన్న దానిని 'కా' దంటున్నారు. పరంధామయ్య విషయంలో మాత్రం, తండ్రి ఎంతదండించినా రామమోహనుడు పౌరోహితుని ఇంటికి రానివ్వడం లేదు.

పరిస్థితుల వల్ల నారాయణరావు బుద్ధి అస్తవ్యస్తమై పోయింది. "మీ మద్దతు లేనిది ప్రసన్న మాణిక్యంతో పారిపోవడానికి వీలు లేదు. మీరు నాకు శత్రువులు. మీకు నేనుకాని, నాకు మీరుకాని లేకపోవడమే మంచిది" అని నిష్ఠురాలాడుతు వారి నసలే దగ్గరికి రానివ్వడం మాను కొన్నాడు.

"హా! పరమేశ్వరా! నిత్యసంతోషం పచ్చతోరణంగా ఉన్న మా కుటుంబములో యిట్టి కష్టాన్ని సృష్టించడానికి యీ పాడు పరంధామయ్యను సృష్టించితివా? ఈ పాడు బ్రాహ్మణుడింతటి కప్పదాత పామని మొదట నుంచి ఎరిగికోలేక మోసపోతిమి." అని శ్యామసుందరి మనసులో దుఃఖ

పెండ్లి ముగించుకొని అందరు కడపకు వచ్చేసరికి రాజగోపాలరావు నుండి ఉత్తరం వచ్చింది. అందులో అతడు నారాయణరావు పోలీసు కంప్లెయింటు నిచ్చిన సంగతిని, పోలీసువారు విజయకుమారుతో బాటు నిరంజనరెడ్డి, చంద్రశేఖరాన్ని కూడ అరెస్టు చేయ సంకల్పించుకొన్న విషయాన్ని, విశదంగా తెలిపాడు. అంతేకాక ఆ ముగ్గురిని ముద్దాయిలుగా చేర్చి కోర్టులో పోలీసులు ఫిర్యాదు నిచ్చుటవలన, అరెస్టు వారెంటును కోర్టువారే యిచ్చినారనికూడ తెలిపినాడు రాజగోపాలరావు.

ఆ జాబును చదువుకొని నిరంజనరెడ్డి మిత్రులతో యీలాగన్నాడు. "ఇంతదూరం నారాయణరావు చేయవచ్చునని నేను మొదట్లో ఊహించాను. ఇందులో భయపడవలసినంత ప్రమాద మేమి లేదు. నేను రహస్యంగా రంగపురానికి వెళ్ళి, మన ముగ్గురికి కావలసిన జామీనులను ఏర్పాటు చేసి వస్తాను. తరువాత మన ముగ్గురం ఏకాయెకి రంగపురం మేజస్ట్రీటు కోర్టులో హాజరై జామీను మీద విడుదల కావచ్చును. ఆ పిదప కేసు జరుగని. నేను తిరిగి వచ్చేంతవరకు విజయకుమార్ తన వారితో చంద్రశేఖరంతో కలిసి మన మిత్రుడు వేంకట్రామరెడ్డి ఇంట్లో వుండగలరు అని తీర్మానించాడు.

అతని నిర్ణయానికి కందరు సమ్మతించారు. నిరంజనరెడ్డి ఆ దినం సాయంకాలమే కడపనుండి బయలుదేరి రాత్రి సుమారు పదకొండు గంటలకు వచ్చి, రాజగోపాలరావు యింటికి వెళ్ళాడు. అక్కడే రహస్యంగా మిత్రుని ద్వారా కొందరు హితుల నచ్చటికి రప్పించుకొని, జామీను సంగతి నంతా కట్టుదిట్టం చేసి, తెల్లవారేలోగా మరల కారులో కడపకు బయలుదేరి పోయాడు. ఇదంతా అచ్చట చేరిన అతని మిత్రులకు తప్ప తదితరుల కెవ్వరికీ తెలీదు.

"ఇంక యీ భడవాలపని పట్టుతా" నని నారాయణరావు మీసం దువ్వుతున్నాడు. సదానందపిళ్లె ముద్దాయీలెచ్చటనైన వున్నట్లు తెలిస్తే చాలు ఎంతదూరమైన వెళ్ళి వారిని అరెస్టుచేయాలని భగీరథ ప్రయత్నం చేస్తున్నాడు.

మూన్నెల్ల క్రిందట సదానంద పిళ్లె మేజస్ట్రేటు కోర్టులో తెచ్చిన ఒక క్రిమినల్ కేసులో డాక్టర్ విజయకుమార్ సాక్ష్యం కావలసి వచ్చింది. అతడిచ్చిన సాక్ష్యం ముద్దాయికి అనుకూలమైనందువల్ల కేసు కొట్టివేయబడుటే కాక, పోలీసు వారు కేసును కల్పించినారని ఋజువై పోయింది. అందుమీద మేజస్ట్రేట్ పోలీసులమీద "స్ట్రిక్చర్లు" ప్యాసు చేశాడు. ఆకారణంగా సదానంద పిళ్ళెకు విజయకుమార్ మీద లోలోన కోపం.

ఒకగంట సేపైనా సరే వారిని అరెస్టుచేసి రిమాండులో వుంచాలని అతని ఉబలాటం. అందుకు తోడుగ నారాయణరావు ఉప్పుతిన్నవారు కొందరతనికి సాయపడుతున్నారు.

# 29

నవంబరు నెల 5వ తేదీ మధ్యాహ్నం రెండున్నర కావచ్చింది. 'లంచ్' టైం తరువాత అప్పుడే కోర్టు దఫేదారు "పబ్లిక్ కోర్టు" అనౌన్సు చేస్తున్నాడు. మేజస్ట్రేటు సీటుమీద కూర్చున్నదే తడవుగా, అప్పుడే పోర్టికోలో వచ్చి నిలిచిన మోతకారులో నుండి డాక్టర్ విజయకుమార్, నిరంజనరెడ్డి, చంద్రశేఖరం దిగి, సరాసరి కోర్టులోకి వెళ్ళి హాజరయ్యారు.

అసుడక్కడే వున్న పోలీసు ఇన్‌స్పెక్టర్ సదానంద పిళ్ళె వారిని

చూచి నిర్ఘాంత పోయాడు. అప్పుడతడింకేమి చేసే స్థితిలో లేనందువల్ల చేతులు పిసికి కొంటూ లోలోన "అరెరె నా ప్లాను చెడిపోయిందే!" అని విచారించసాగాడు. ఆగంతకులను చూచి ప్రేక్షకులంతా ఆశ్చర్య పోయారు.

అంత అడ్వొకేటు రఘునాధరెడ్డి "యువర్ ఆనర్ సి. సి. నెం 375 లో అరెస్టు కావలసిన ముద్దాయీలు ముగ్గురు పబ్లిక్ కోర్టులో తామై తాము హాజరయ్యారు. జామీనుల మీద విడుదల కోరుచున్నారు" అని ఆ ముగ్గురు ఎంతటి ఘరానా మనుషులైంది విశదీకరించాడు.

ఏబది ఏండ్లు వృద్ధుడైన మేజస్ట్రీటు తలఎత్తి ఒకమారు తన ఎదుట నిలబడిన ముద్దాయీల ముగ్గురిని పరికించి చూచి అడ్వొకేటుతో, "యస్, జామీన్‌దారు లేరీ?" అని ప్రశ్నించాడు. అంతకుముందుగా నిర్ణయించు కొన్న రీతిగా ఒక్కొక్కరికి వేయి రూపాయల వంతున పూచీకత్తు నివ్వడానికి ఆరు మంది పూచీదారులు ముందుకొచ్చారు. వారి విషయ మంతా కోర్టువారికి తెలిపి, రఘునాధరెడ్డి జామీనులను ఇప్పించడంతో నిరంజనరెడ్డి ప్రభృతులకు స్వేచ్ఛ లభించింది.

ఇదంతా లోలోపల రహస్యంగా చేసుకొన్న ఏర్పాటని ఇప్పుడంద రికి అర్ధమై పోయింది.

కేసు విచారణ వాయిదా డిశంబరు 10వ తేదీకి వేయబడింది

♦ ♦ ♦

మరల నారాయణరావు పధకాలన్నీ తారుమారై పోయాయి. సదా నంద పిళ్లై తాను తలచినట్టు విజయకుమారును, అతని మిత్రులను అవ మానించ లేకపోయ్యాడు. అకస్మాత్తుగా వారట్లు కోర్టులో హాజరై జామీ నుల నిచ్చి బయట పడుటవల్ల అతని గాలిగోపురాలు కూలిపోయాయి.

అయినా, సదానంద పిళ్ళె సామాన్యుడు కాడు. అఘటనాఘటన సమర్థుడు. అప్పటి నుండి పబ్లిక్ ప్రాసిక్యూటరు విశ్వనాధజోషితో కలిసి కేసుకు కావలసిన బలం చేకూర్చే విషయమై మంతనాలు ప్రారంభించాడు. వారిద్దరిని లంచాలుతో తృప్తి పరచాడు నారాయణరావు.

తిరుపతిలో ప్రసన్నకు విజయకుమార్‌తో పెండ్లయిన సంగతంతా నారాయణరావుకు తెలిసిపోయింది. అదంతావిని అతడు అగ్గిమీద గుగ్గిలమై పోయాడు.

ఆ మరుసటి దినం మధ్యాహ్నం రెండు గంటలప్పుడు నారాయణరావు కొంతమంది నౌకర్లను పిలుచుకొని హడావుడిగా విజయకుమార్ ఇంటికి వెళ్ళాడు. వెంటరమ్మని తన్ను తండ్రి పిలువనందుచేత రామమోహనుడు పోలేదు.

వారచ్చటికి వెళ్ళే వేళకు సరిగ్గా చంద్రశేఖరం, విజయకుమార్ మాట్లాడుకొంటూ బయట గదిలో కూర్చొని వుండినారు. మాధవరావు హాలులో ఒకపడక కుర్చీలో పడుకొని గ్రంధమేదో చదువుకొంటూ వుంటే, వంట యింట్లో కాంతమ్మ, ప్రసన్న, మాణిక్యం, రాధ ఏదో పచన కార్యంలో నిమగ్నులై వున్నారు.

కారునుండి దిగుతూవుండే నారాయణరావును చూచి గేటువద్ద వున్న రంగన్న హడావుడిగా పోయి విజయకుమారుతో చెప్పాడాసంగతి. అది విని డాక్టర్ కొంత తత్తరపాటుకు లోనుకాకుండ వుండలేక పోయాడు. చంద్రశేఖరం అతనికి ధైర్యం చెప్పి, నిరంజనరెడ్డిని తోడ్తెచ్చేట్టు రంగన్నకు సైగ చేశాడు. వాడప్పుడే సైకిల్‌మీద పోవడం గమనించిన నారాయణరావు హుంకరించి చూచి "ఏరా, డాక్టర్! నీ బలగాన్ని రప్పిస్తావా? రానీ, చూద్దాం. ఏదీ ఆ కుల నాశకురాలు?" అని గద్దించి అడిగాడు విజయకుమార్‌ను.

నారాయణరావింత ఉట్టిపాటున రావడంవల్ల విజయకుమారుకు ఇంటిలో చేయవలసిన బందోబస్తు చేయడానికి వీలుపడిందికాదు. వెలుపల జరిగిన సందడిని గమనించి మాధవరావు నారాయణరావును చూచి, తటాలున లోపలికి వెళ్ళి ఆడవారికా సంగతిని చెప్పాడు. ఇంకేమి ప్రమాదం జరుగుతుందో యని ప్రసన్న, మాణిక్యం గడగడలాడి పోయారు. కాంతమ్మ వెంటనే వారినిద్దరిని ఒక గదిలోనికి పంపి తాళం వైచింది. ఆమెకా సమయోచితమైన తెలివి కలుగడం వల్ల ముందు జరుగబోవు అనర్థకానికి అడ్డు పడినట్లయింది. బయట మాటలు తీవ్రంగా జరుగు తూండడం విని ప్రసన్న అత్తను జాగ్రత్తగా వుండమని చెప్పింది.

"ఏమోయ్, పెద్దమనిషీ! తిన్నయింటి వాసాలెంచడమేనా నీ వృత్తి. ఏదో ఆనాడు మా యింటిలో శాస్త్ర వైద్యం చేశావని పిలిపించి గౌరపించి నందుకా యిప్పుడీ నీచత్వానికి పాల్పడితివి? నా బిడ్డకు లేనిపోని వలపులు నేర్పి, అమాయకురాలైన దాన్ని నీ వలలో వైచుకొని, యిప్పుడీరీతిగా పెండ్లి చేసుకొంటివా? నాలాంటి వానికే యీ రీతిగా మొండిచేయి చూపే నీవు యింకెవరిని లక్ష్యపెట్ట గలవు? నీలాంటివారి వల్ల నీ వృత్తికే అగౌరవము. ఉఁళ్ళో నీ వంటి దుర్మార్గులు ప్రబలిపోతే యింక వూరు బాగుపడినట్టే" అని నారాయణరావు నానా విధాల విజయకుమార్‌ను దూషింపసాగాడు.

"యువతీయువకులమైన మీ కూతురు, నేను, పరస్పరం ప్రేమించు కోవడంలో తప్పేమి లేదు. నేనేమి శంభుదాసువలె వయసు మళ్ళిన వాణ్ణి కాదుగదా? కులము గుణము లేని వాణ్ణి మీ కూతురు వరించలేదు. దీనికి హర్షించేందుకు మారుగ కేవలం దురాశాపరులై మీరామె నొక వృద్ధున కంటగట్ట యత్నించుటవల్ల ఆమెయే సాహసించి నా వద్దకు వచ్చింది. నేనామె కేలాంటి దుర్బుద్ధులు నేర్పలేదు. ఇందులో మా

తప్పేమి లేదు. మీరే యుక్తాయుక్తములు తెలియక, హితులెవరో, అహితులెవరో తెలుసుకో లేకున్నారు."

అతని మాటలకు నారాయణరావు అజ్యాహుతిచే భగ్గున మండెడి అగ్గివలె మండిపడినాడు. మాధవరావు వంక చూసి అతనిని కూడ నానా విధముల నిందించినాడు.

"యౌవ్వన మదము కన్నులు కనబడకుండ చరించే నీ సుపుత్రుణ్ణి కాస్త దారిలో ఉంచలేకపోయావటయ్యా నీవు? గౌరవ కుటుంబాల నీరతిగా రచ్చకెక్కించాలని ఎన్నాళ్ళుగ తలంచితివి?" అని ఉద్రేకావస్థలో నానా దుర్భాషలాడి "ఏదీ ఆ చండాలురాలు నీ కోడలు?" అని గద్దించి అడిగాడు.

అంత లోపల నుండి ప్రసన్న మాట లీరీతి వినవచ్చాయి "ఇక్కడే ఉన్నాను మరెక్కడికి పారిపోలేదు."

నారాయణరావు త్రోక త్రొక్కిన నాగులాగై బుసలు కొడుతూ "ఆహా! ఉన్నావా ఇక్కడ్ణే! ఎక్కడికి పారిపోలేదా? కులనాపకురాలా! ఇంకా సిగ్గులేదా మాట్లాడడానికి?" అని లోపలికి జొరపడి, ప్రసన్న ఉన్న గది తలుపుమీద రెండు గుద్దులు గుద్ది చూచాడు. కాని, అది లోపల గ్గొళ్ళెము పెట్టబడింది. బయట తాళం వేయబడింది. కిటికీనుండి లోపలి వారిద్దరు స్పష్టంగా కనబడుతూనే వున్నారు.

"తలిదండ్రు లెవరో తెలియని నన్ను చిన్ననాటినుండి కన్నవారివలె పెంచి పెద్దదానిని చేశారు...."

"ఆహాహా, ఎంత కృతజ్ఞత! ఎంత కృతజ్ఞత! అందుకే కాబోలు ఇంత విధేయురాలవై పోయావు?"

"కడకు బొగ్గుల కొరకు కల్పవృక్షాన్ని నరుక తలచినట్లు, మీ

స్వార్థానికి నన్నొక ముసలివాని కంటగట్ట యత్నించినారు. అమ్మ ఎంత వదన్నా విన్నారా? అన్నయ్య యిది కూడదంటే విన్నారా?...."

"ఆ చండాలురిద్దరు నీ కిందులో తోడయ్యారు కదూ?"

"ఎవరితోడేమిటి, భగవంతుడే తోడయ్యాడు. వివాహమంటే డబ్బులు మూటలు మార్చుకోవడమనుకొన్నారు మీరు. ప్రేమయొక్క పవిత్రత మీ కర్థము కాలేదు...."

"అహాహాహా – ప్రేమట – ప్రేమ! దీనివల్లకాటి ప్రేమ! కన్ను మిన్ను కానని గర్విష్ఠురాలు. నాకే బుద్ధులు చెప్పవచ్చావా కడకు?"

"నేనెవరికి బుద్ధులు చెప్పలేదు. నాకు నేనే బుద్ధులు చెప్పుకొన్నాను,"

"ఈ చంఢాలురాలుకు మాణిక్యం తోడైంది కాబోలు."

మాణిక్య మిట్లనింది.

"నేను ఈ బిడ్డను కనిపెంచినాను. తలిదండ్రులు లేనిదాన్ని యింత చేసిన అభిమానం నాలో సహజంగా ఉండితీరుతుంది. నేనుతోడు కాకపోతే యీపాటికి అమ్మాయి గతి ఏమై ఉండేదో.

"ఏమో ఐవుంటే ఎంతో బాగుండేది యీ అవమానానికంటే...."

"అవమానమేమిటి, ఇంకా అదే మాటంటున్నావు? నామానము మీ మానము కాపాడగలిగానని తెలిసికోలేకున్నారు. నా కష్టసుఖాలను సరకు చేయలేక పోతిరి, నా మొర వినకపోతిరి. ఇంక నేనెవరితో చెప్పుకొందును? కడకు నా అంతరాత్మయే నన్ను ప్రబోధించింది...."

"కాదు కాదు, మీయన్న, మీ పిన్ని, యీ ఢాకిని మాణిక్యం నిన్ను ప్రబోధించినారు."

"సకుమ వారి నెందుకు నిందించాలి? మీ తప్పేమో మీరు ఇంకా తనుక్కోలేకున్నారు, నాన్నా!...."

"నాన్న!.... ఎవడే నీకు నాన్న? ఇంకా సిగ్గులేదా నన్నలా పిలవడానికి?"

"తప్పు చేసినవారు సిగ్గుపడాలి కాని, నాకెందుకు సిగ్గు?"

అంతలో నిరంజనరెడ్డి కొందరు మనుష్యులతో అక్కడికి వచ్చాడు చుట్టు ప్రక్కలవారు, దారిని పోయేవారు యింటి చుట్టు ప్రోగయ్యారు.

ఇంక తానెంత మాట్లాడిన ప్రయోజనం లేదని గ్రహించి. ప్రసన్నను నోటికి వచ్చి నట్లంతా దూషించి, శపిస్తూ నారాయణరావు. తనవారందరిని పిలుచుకొని అక్కడినుండి వెళ్ళిపోయాడు.

విజయకుమార్ మీద అతనికి చెప్పరానంత ద్వేష ముదయించింది. అతని మీద పగతీర్చుకోవాలని నిశ్చయించుకొన్నాడు. వరదరాజు పరంధామయ్య లాంటి వారితో ఆలోచించసాగాడు నారాయణరావు.

పై సంఘటన జరిగిన నాల్గు దినాల తరువాత ఒకనాటి రాత్రి భోజనాలయ్యాక విజయకుమార్ భార్య అందిస్తూ. వున్న తమలపాకులు నములుతూ గదిలో కూర్చొని సరస సల్లాపాలు జరుపుకొంటూ వున్నారు. కాంతమ్మ, మాణిక్యం వంటగదిలో వున్నారు. రాధ తండ్రికి పడక సిద్ధపరుస్తూ వుంది. మాధవరావు ఏవో చదువుకొంటూ వున్నాడు. రంగన్న కాని, రామన్న కాని భోజనాని కని వెళ్ళిన వారింకా తిరిగి రాలేదు.

తెల్లవారితే అమావాస్య – బయట చీకటి దట్టంగా వ్యాపించింది. ఆకాశం మేఘా వృత్తమై ఉన్నందుచే కాబోలు వీధి దీపాలన్ని ఆరిపోయాయి. చిన్న చినుకులు కూడ ఆరంభమయ్యాయి. రోడ్డుమీద జనసంచారం లేదు. మేఘాల వంక చూచి వీధిలో కుక్కలు ఏడ్చినయి

అపస్తూంటే, ఆరాత్రి యొక్క భయంకర స్వరూప మింకా అధికమయి నట్లుంది.

ప్రసన్న మగని చేతిలో చిక్కి స్పర్శ సుఖాన్ని అనుభవించే సమయంలో ఎవరో ఆడవాయి గేటువద్ద "అయ్యా, అయ్యా, డాక్టరు గారూ, డాక్టరు గారూ" అని గట్టిగా పిలవడం వినవచ్చింది.

విజయకుమార్ గదిలో నుండే "ఎవరు వారు?" అని ప్రశ్నించాడు

"బాబూ, రక్షించండి. రక్షించండి. దిక్కులేని దాన్నై పోతున్నాను. అని దీనంగా కంఠధ్వని వినబడింది. వెంటనే విజయకుమార్ వరండా లైటు వెలిగించి బ పటికి వచ్చాడు. ఇంటిలోని వారంతా వచ్చారక్కడికి.

ఎదుట ఒక ముప్పై ఏండ్ల బీదరాలు.... మాసిన గుడ్డలు ధరించింది. పడుతున్న చినుకుల్లో చీర సగం తడిసిపోయింది. కాతర దృష్టితో చుట్టూ పరికిస్తూ వుంది.

ఆమెను చూచి డాక్టరు "ఎవరు నీవు? ఏమి కావాలి?" అని అడిగాడు. విషయం చెప్పడానికి నోరుగ ఆమె భోరున ఏడుస్తూ వచ్చి అతని పాదాల వద్ద వ్రాలి పోయింది. అందరి హృదయాలు విచలిత మయ్యేట్టు ఆక్రందిస్తూ వుంది.

"ఏమిటి సంగతి? చెప్పమ్మా, ఎందుకలా ఏడుస్తావ్?" అని మరల మరల ప్రశ్నించాడు డాక్టరు.

ఆగంతకురాలు తన్ను తాను కొంత తమాయించుకొని, కన్నులొత్తుకొంటూ "బాబూ, నా మగనిని పాము కరచింది. చావు బ్రతుకుల్లో వున్నాడు. ఇంటిలో చిన్న పిల్లలు, నేను మాత్రమున్నా మండీ. మాకింకెవరు దిక్కులేరు. నా మాంగల్యాన్ని రక్షించండి, బాబూ" అని మరల ఏడుస్తూ ఆమె చేతులెత్తి మ్రొక్కింది.

"ఎవరు మందివ్వలా?"

"నాలాంటి బీదదానికి సహాయ మెవ్వరు చేస్తారు. బాబూ? ఎక్కడికి వెళ్ళినా డబ్బులడుగుతారు. ఎక్కడి నుండి వస్తాయి నాకు డబ్బులు? మరే దిక్కు లేనిదాన్ని నా మగని రక్షించి పతి భిక్ష పెట్టండి. బాబూ."

"ఎంతసేపయింది పాము కరచి?"

"ఒక గంట అయివుంటుందండీ. నోటిలో నురుగు వస్తూంది. శరీరం మీద ప్రజ్ఞ లేకుండ పడిపోయాడు. దగ్గర పిల్లల్ని వుంచి, మీ సంగతి విని యిలా పరుగెత్తి వచ్చానండీ"

"ఎవరు చెప్పారు నా సంగతి?"

మా వీధిలోని వాళ్ళు చెప్పారండి మీరు ధర్మరాజులని, దయామయులని తప్పక మంచి మందిచ్చి కాపాడుతారని...."

డాక్టర్ ఆలోచనలో పడిపోయాడు వెళ్ళడమా – వద్దా – అనేదే అతని ఆలోచన. ఆ దీనురాలి మొరవల్ల అందరి హృదయాలు కరిగిపోయాయి. కాంతమ్మ నోటినుండి అప్రయత్నంగా పాపమెవరో దీనురాయి. కష్టస్థితిలో వుంది, వెంటనే వెళ్ళి కాపాడు నాయనా!" అనే మాటలు వెలువడ్డాయి. తండ్రి కూడ అన్నాడు "ఎవరికేకాలానికి ఏమొస్తుందో ఎవరు చెప్పగలరు?" ఈలాంటి వారికి చేసిందే మానవసేవ" అని,

వచ్చిన స్త్రీ తనగోడు నింకా హృదయవిదారకంగా వర్ణించి చెప్పుకో సాగింది. ప్రసన్నకేమి చెప్పడానికి నోరు రాలేదు. తక్కిన వారి స్థితి కూడ అంతే.

తుదకు పరోపకారమే పరమ ధర్మంగా తలచి తన వృత్తిని నడుపు కొంటూ వున్న విజయకుమార్ మనసులోని అనుమానాలన్నీ అణగిపోయాయి. కనికర మొక్కటి కాలూదు కొని నిలబడింది.

# 30

ముందు వెనుక లాలోచించుకొనేందుకు డాక్టరుకు అవధి లేదు. దీనురాలి మొర హృదయ విదారకంగా వుంది. రంగన్న కాని, రామన్న కాని వచ్చేంతవరకు వేచి ఉండటానికి కూడ అవకాశం లేదు. తుదకా అకాలములో కూడ ఒక జట్కాబండి కూడ దొరకదు.

విధిచోదితుడైన విజయకుమార్ ఇంక ఆలస్యం చేయడాని కిష్టము లేక, కేవల పరోపకార ప్రియుడై తన మందుల సంచిని తీసికొని, తల్లి దండ్రులకు హెచ్చరిక తెలిపి, ఆమెతో గలిసి వీధిలోకి వెళ్ళిపోయాడు.

ఇదంతా జరుగడానికి పదిహేను నిముషాల కంటే ఎక్కువ కాలం పట్టలేదు.

విజయకుమార్ వెళ్ళిపోయాక మాణిక్యం ఇలా అడిగింది కాంతమ్మను "డాక్టరుగారు ఎప్పుడైనా యిట్లాంటరిగా రాత్రిపూట వెళ్ళే వారేనాండి?"

"పని వుంటే వెళుతాడు. కాని, ఇంత అసహాయంగా వెళ్ళం దెప్పుడు లేదు."

"వచ్చిన మనిషి మీకు పరిచయమైందేనా?"

"లేదు. ఎప్పుడు మావాని వద్దకు వచ్చింది కాదు.

మాధవరావు కేవేవో అనుమానాలు ప్రారంభమయ్యాయి. కొడుకు అట్టి వేళలో ఒక ఆడదాని మాట నమ్మి పోవడం ప్రమాదమేమో అని పించిందందరికి. అతడు వెళ్ళక ముందే వారికి అనుమానం కలిగివుంటే బాగుండేది కాని, చేతులు కాలినాక ఆకులు పట్టుకొని లాభమేమి? అందరికి

ఒక్కమారే నారాయణరావేమైన యీకుతంత్రం పన్నినాడా అని సందేహం జనించింది.

ఒక అరగంట దాటిపోయాక రంగన్న, రామన్న వచ్చారు. మాధవ రావు వారితో జరిగిన సంగతంతా చెప్పి "అయ్యో, మీరెందుకీ దినం యింత ఆలస్యం చేశారు. తక్షణం మీరు కూడ వెళ్ళి అబ్బాయి ఎక్కడికి పోయాడో కనుక్కోండి." అని ఆతురత పెట్టాడు.

"మొదట యీ సంగతంతా నిరంజనరెడ్డికి కాని, చంద్రశేఖరానికి కాని తెలిపి మీరు వెళ్ళితే బాగుంటుందండి" అని కాంతమ్మ సలహా చెప్పింది.

"అలాగే చేస్తామమ్మా" అని రంగన్న, రామన్న మొదట చంద్ర శేఖరాన్ని చూడబోయారు.

వచ్చిన స్త్రీ డాక్టరుతో కొంత దూరం నడిచి వెళ్ళేసరికి చీకట్లో ఒక జట్కా ఎదురైంది. ఆమె బండివాని నాపి "బాబూ, దైవసహాయం బండెక్కండి" అని అతన్ని కూర్చోమని జట్కాను ఫలానా చోటికి తోలు మని చెప్పింది. బండి శరవేగంగా వెళ్ళిపోసాగింది.

బండి వేగంతో బాటు డాక్టరు మనసులో కూడ ఏవేవో ఆలోచనలు పరుగెత్తుతున్నాయి. కాని అంతా అయోమయంగా వుంది. ఆమెను అతడు మరల ఎన్నో ప్రశ్న లడిగాడు. తడబడకుండ యివ్వబడిన సమాధానాల కతడు నోరెత్త లేదు.

బండి కొంత సేపటికి వూరికి దక్షిణపు చివరనున్న బీదల గూడెము చేరి, ఆమె చూపిన ఒక పెద్ద పూరింటి ముందు నిలిచింది. బండివానిని కొంత సేపచ్చటనే వుండుమని చెప్పి, డాక్టరు ఆ స్త్రీని అనుసరించి లోపలికి వెళ్ళాడు.

అందులో మూడు నాలుగు అరలున్నట్టతడు గ్రహింప గలిగెను. గూటిలో మినుకు మినుకు మంటూ వుండే ఆముదపు దీపము ఇంటిలోని చీకటిని పారద్రోలేందుకు వృథా ప్రయత్నం చేస్తూంది.

"ఏడీ నీ మగడు?" అని అడిగాడు డాక్టరు.

అతని నామె ఒక గదిలోనికి పిలుచుకొని పోతూండగా, అకస్మికంగా వెనుకనుండి నలుగురు వచ్చి విజయకుమార్ మీదపడి. చేతులతో బలముగ తన్న నారంభించిరి.

విజయకుమార్ క్రిందపడి పోయాడు. చేతిలోని మందుల సంచి ఏమయ్యిందో దేవుడెరుగు. ఎంత పెనగులాడిన అతడు వారి బారి నుండి తప్పించుకో లేకపోయాడు. చూస్తూవుండగానే, అరచేందుకు కూడ వీలు లేనట్టు, ఒకడు నోటి నిండా గుడ్డ క్రుక్కితే, తక్కినవారు డాక్టర్ కాళ్ళు చేతులు విరిచి కట్టారు.

క్షణాలమీద జరిగిన యీ దుస్సంఘటన కాగలేక విజయకుమార్ మూర్ఛపోయాడు. వెంటనే ఆ దుర్మార్గులతన్ని మోసుకొనివచ్చి, బయట నిలిచివున్న జట్కాలో ఎక్కడికో పంపివేశారు బండివానికేమేమో చెప్పి, తరువాత ఆ నలుగురు అక్కడ నిలవకుండా పారిపోయారు.

ఆ స్త్రీ, బండివాడు యీ దుర్మార్గులతో షరీకైనవారని స్పష్టమైంది. బండి తూర్పుదిక్కుగా ఎక్కడికో వెళ్ళిపొయ్యింది.

గంటతరువాత గంటను గోడమీది గడియారం కొడుతూనేవుంది కాని రంగన్న, రామన్న తిరిగిరాలేదు, వీధిలో గాఢాంధకారం అలుము కొని భయంకరంగావుంది, ఇంటివారెవ్వరు నిద్రపోలేదు. ఏ క్షణములో ఏమివార్త వస్తుందోఅని బెదరిబెదరి చూస్తున్నారు, కొడుకింకా రాలేదే అని తహతహపడుతూ మాధవరావు బయట వరండాలో అటుఇటు పచారు చేస్తున్నాడు. "అత్తా! నా కెందుకో భయంగావుందమ్మా. రోగచికిత్సకని

పది గంటలప్పుడు వెళ్ళినవారు ఒంటిగంట దాటినా రాలేదు. ఏదో మోసముంటుంది" అని ప్రసన్న తనభయాన్ని కనబరచింది. అందరికి మనసులో అదేభయముంది. అయినా, బహిరంగపరచుకొని, ఒకరినొకరు భయపెట్టుకొనేందు కిష్టములేక లోలోన విచారపడుతున్నారు.

"నారాయణరావు ఏకుతంత్రానికి పూనుకొన్నాడో" అని మాణిక్యం చాల దిగులుతో మాట్లాడింది. "నా నోట ఏమాడించిందమ్మా శని! కని కరమని ముక్కు మొగముచూడని ఆ ముండవెంటపోయి రమ్మని నా బంగారుతండ్రిని పంపితినే! ఇంకేది గతి!" అని కాంతమ్మ కళ్లల్లో నీరు పెట్టుకోసాగింది.

ఆడంగుల విచారాన్ని చూచాక మాధవరావు తత్తరపాటు మరింత అధికమయ్యింది, తానుమాత్ర మిప్పుడెక్కడికి పోగలడు?

రెండుగంటలు కొట్టేసరికి రంగన్న, రామన్న హడావుడిగా వచ్చి "అయ్యగారు వచ్చారాండీ?" అని అడిగారు. ఆ మాటలో అందరికి హై ప్రాణాలు పైనే పోయినట్లయ్యింది.

విజయకుమార్ ఇంకా యింటికి రాలేదనివిని రంగన్న, రామన్న "అయ్యో, బాబోయ్, ఏదోప్రమాదం జరిగింది. నిరంజనరెడ్డికి, చంద్ర శేఖరం బాబుకు చెప్పివస్తా" మంటూ దౌడు తీశారు.

మొదట వారు చంద్రశేఖరం ఇంటికివెళ్ళి అతనితో సంగతంతా చెప్పారు. అతనికికూడ గుండె దడదడలాడింది. ముగ్గురుచేరి నిరంజన రెడ్డి యింటికి వెళ్ళారు. సంగతంతా విన్నాక అతనికి మాత్రం మనస్సుశాంతి ఉంటుందా? తక్షణమే మిత్రులిద్దఱు రెడ్డి కారులో నౌకర్లను పిలుచుకొని మాధవరావు యింటికి వచ్చారు.

అతడు వారికి జరిగినసంగతంతా చెప్పి "నాయనలారా, త్వరపడండి

ఏదో మోసం జరిగింది" అని వారిని వేగిరపెట్టాడు. ఆడవారొకవైపు తహతహలాడి పోతున్నారు.

"నిరంజనా! నిజముగ నారాయణరావే యీ కుట్రపన్ని విజయ కుమార్‌మీద కసి తీర్చుకోవలెనని ప్రయత్నించినట్టుంది. ఇప్పుడు గతాన్ని గురించి ఆలోచించేందుకు వ్యవధిలేదు. ఎంతమాత్ర మాలస్యం చేయకుండ! వీలైనంతమందిని నలుమూలలకు పంపి ఏమిజరిగిందో భోగట్టా చేయించాలి." అని చంద్రశేఖరం హెచ్చరించాడు మిత్రుని. నిరంజన రెడ్డి మాధవరావుకు ధైర్యం చెబుతూ "మీరు భయపడకండి. త్వరలో మీ కుమారుని పిలుచుకొని వస్తా" మని చెప్పి రంగన్నకు, రామన్నకు చెప్పవలసిన మాటలుచెప్పి చంద్రశేఖరంతో వెళ్లిపోయాడు కారులో.

* * *

రాత్రి సుమారు ఒంటిగంటవేళ శ్యామసుందరికి మెలకువ వచ్చింది. మళ్లీ నిద్దురపట్టలేదు. చల్లనిగాలి కని మేడమీది డాబావద్దకు వస్తుంటే, ఆయాకాలములో మగడింకా మేల్కొని ఎవరితోనో మెల్లిగ మాట్లాడుతూవుండడం గమనించిందామె. మనసుండబట్ట లేక మునివ్రేళ్ళపై మెల్లగ నిశ్శబ్దముగ నడచిపోయి, మూయబడిన తలుపు సందులోనుండి లోపలికి తొంగిచూచింది—,

లోపల నారాయణరావు మంచముమీద కూర్చున్నాడు. ఎదుట కుర్చీలో వరదరాజు—అల్లంతదూరంలో నలుగురు దృఢకాయులైన జెట్టీలు కనబడ్డారు శ్యామసుందరికి! ఆమె వారిమాటలను విన్నది.

"అయితే ఆ పాడువెధవ డాక్టర్ పొగరణగిందన్నమాట?" అని నారాయణరావు జెట్టీలవంకచూచి అడిగాడు.

"ఈ దెబ్బల్తో అతడు రెన్నెల్లు మంచం పట్టాల్సిందే, బాబూ."

"మీరు చేసినపని నెవ్వరు చూడలేదుకదా?"

"లేదండీ. మనుష్యమాత్రులెవ్వరు చూచేందుకు వీలులేకుండా బాగా మర్ధించివచ్చాం, బాబూ"

"ఎక్కడ పడవేసి వచ్చారు?"

"పాతచెఱువు కట్టక్రింద పడవేసివచ్చాడండీ యీ నిజాముద్ధన్. ఆట్కా తోలుకుపొయ్యింది ఇతడే."

"అయితే ఆ డాక్టరింకా అక్కడేపడి వుంటాడంటారా!" అని యీ సారి వరదరాజడిగాడు జెట్టీని.

"పడివుండకపోతే యేలా తప్పించుకు పోతాడండీ? నోట్లో గుడ్డ పెట్టి కాళ్ళుచేతులు కట్టిపారేశాం కాదూ?"

"బలేపని చేశారోయ్. ఇంక తలయెత్తుకొని తిరుగని ఊళ్ళో. నారాయణరావంటే నా తడాకా అర్థమైందో లేదో! నిప్పుతో చెర్లాట అని గ్రహించని వీనికింక దిక్కెవడో చూస్తాం."

నారాయణరావు జెట్టీలచేతులో నోట్లకట్ట నుంచాడు, వారు దానినందుకొని సలాం చేశారు.

ఇంక వారు బయటికి వస్తారని శ్యామసుందరి జాగ్రత్తపడి, తిన్నగ వెనుదిరిగివచ్చి వేరేగదిలో పండుకొనివున్న రామమోహనుని మెల్లిగాతట్టి, లేపి "రామూ, చూడు మీ నాన్న ఎంతపని చేయించాడో" అని తాను విన్న సంగతంతా చెప్పి "నీవు తక్షణం మాధవరావు యింటికి వెళ్ళి యీ సంగతంతా చెప్పి రావాలి. ఎవరైనా వెంటనేవెళ్ళి పాతచెఱువు కట్టదగ్గర పడివుండే విజయకుమార్‌ను సురక్షితంగా యిల్లు చేర్చే ప్రయత్నం చేయాలి."

అని రహస్యంగా రామమోహనుని వెలపలికి పంపివేసి, తానేమిఎఱుగని దానివలె తన పడకగది చేరిందామె.

భార్య, కొడుకు తనచర్యలను గమనించలేదని, వారు లోపలగదుల్లో నిద్రపోతున్నారనే ధీమాతో నారాయణరావు రహస్యంగా జెట్టీలను, వరద రాజును గేటుదాటించి వచ్చి పడుకొన్నాడు.

# 31

తల్లి చెప్పినసంగతంతా వినేసరికి రామమోహనుని గుండెలదరి పోయాయి. తండ్రి యింత కఠినుడయ్యాడంటే ఎంతో యీసడించాడు. చెల్లెలి దుస్థితికి మనసు బాధపడుతూ, మొదట విజయకుమార్‌ను కాపాడ వలెనని అతడు ఎకాయెకి నిరంజనరెడ్డి యింటికి వెళ్ళాడు.

విచారిస్తే అత డింట్లో లేడని తెలిసింది. వెంటనే చంద్రశేఖరం యింటికి వెళ్ళి చూస్తే అతడు కూడ ఇంటలేడు. ఎక్కడి కెళ్ళాడని విచారిస్తే చంద్రశేఖరం తల్లి రుక్మిణమ్మ "నాయనా, డాక్టర్ విజయకుమార్‌ను ఎవరో రాత్రి పది గంటలప్పుడొక అడ మనిషి మొగుణ్ణి పాము కరచిందని ఎక్కడికో పిలుచుకొని వెళ్ళిందట. ఇంతవరకు యింటికే రాలేదట డాక్టరు. ఇంటివారు చాలగాభరాతో రంగన్నను, రామన్నను పంపారు. మాఅబ్బాయిని పిలుచుకొని రమ్మని నిరంజనరెడ్డి, చంద్రశేఖరం కారులో వెళ్ళారు" అని కొన్ని వివరాలు చెప్పింది.

రామమోహన్ ఆలస్యం చేయకుండ అప్పుడు స్టేషన్‌కు వెడుతూ ఉండిన జట్కా నొకదాన్ని మాట్లాడుకొని దానిలో సత్వరంగా వెళ్ళాడు విజయకుమార్ యింటికి.

అన్నను చూచి చూడక ముందే ప్రసన్న దుఃఖాశ్రువులు రాలుస్తూ ఎదురై వచ్చి "అన్నా" అని బావురు మనింది. అతడంత రాత్రివేళ వచ్చినందు కందరు ఆశ్చర్యపోయినారు. మాధవరావు శిష్యుని ఆహ్వానించి జరిగిన సంగతంతా చెప్పాడు. మోహనుడు వారినందరిని ఊరడిస్తూ "నిరంజనరెడ్డి, చంద్రశేఖరం రాలేదా?" అని ప్రశ్నించాడు.

"వచ్చి, విజయుని వెదకాడనికి వెళ్ళినారు" అని మాధవరావు చెబుతూ వుండగానే వారి కారుకూడ వచ్చింది. మిత్రులిద్దరు రంగన్న రామన్నలతో ఖిన్నవదనులై కారు దిగి వచ్చిరి. ఆ మొకాలే చెబుతున్నాయి వారికి విజయకుమార్ జాడ తెలియలేదని. మాధవరావు దంపతులెంతో కంగారు పడుతూ అడిగారా సంగతి గురించి వారిని.

అంత రామమోహనుడు లోలోపల చెల్లెలి మాంగల్యానికి శుభము నాకాంక్షిస్తూ "భయపడకండి, ఇప్పుడే విజయకుమార్‌తో తిరిగి వస్తామని నిరంజనరెడ్డిని, చంద్రశేఖరాన్ని మరల కారెక్కుమని "పాత చెరువు కట్టవద్దకు పోనిమ్మన్నాడు." ముగ్గురు వెళ్ళారక్కడికి శరవేగంతో.

తెల్లవారేందుకిక ఎంతో పొద్దు లేదు. వీధులలో అప్పుడే రైళ్ళకు, బస్సులకు వెళ్ళే, బండ్లు, మనుష్యులు తిరుగాడుచుండుట కనబడుతూంది. రామమోహనుడు కారులో పోతూ మిత్రులిద్దరికి చెప్పాడు తల్లి తనతో చెప్పిన సంగతంతా. వారికి నారాయణరావు మీద అమితమైన అసహ్యం కోపం ఉదయించాయి. మోహనుడు వారిని సమాధాన పరుస్తూ వుండగానే కారు గమ్యస్థానం చేరుకొంది.

వెదకి చూడగా చెరువు తూము వద్ద మూటగా కట్టివేయబడి మూల్గుతూ వున్న విజయకుమార్ వారి కంట పడ్డాడు. అతని దుస్థితిని చూచి అందరూ చాల కట కట పడారు. తటాలున వెళ్ళి నోటిలోని

గుడ్డను తీసి, కట్లను విప్పి అతన్ని కూర్చోబెట్టిరి కాని అతని కింకా సరియైన ప్రపంచ జ్ఞానమే లేదు. సరిగా మాట్లాడేందుకు శక్తిలేదు. ఇంక ఒక గంటవరకు యీ రీతిగా విముక్తి కలుగకపోయి వుంటే అసలు జీవించేవాడే కాదతడు.

ఒడలిమీద గాయాలేవీ లేవు కాని మూక దెబ్బల వల్ల ఒళ్ళంతా హూణమైనట్లుంది. ఎక్కడ ముట్టినా బాధతో 'అబ్బా' అని అరుస్తున్నాడు ఆ క్షణములో తండ్రిచేయించిన ఈ ఘాతక కృత్యాన్ని తలంచుకొన్న రామ మోహనుని మనసులో తండ్రిమీద కల ప్రేమాభిమానాలన్నీ అట్లే యింకి పోయాయంటే విశేషమేమి లేదు. నిరంజనరెడ్డి, చంద్రశేఖరం ఆ దృశ్యానికి చాలా కలతచెంది పోయారు.

విజయకుమార్ తలమీద మాత్రమేదో గాయము తగిలి రక్తం కారి నట్లు కనబడింది. ముగ్గురుచేరి సమయానుకూలమగు ఉపచారముతో కొంత సేద దీర్చి కూర్చోబెట్టారు. ఒక అరగంట నిదానించాక డాక్టరుకు బాగా తెలివి వచ్చింది, తానున్న దుస్థితికి తానే ఆశ్చర్యపోయాడతడు. రాత్రి జరిగిన ఒక్కొక్క సంగతే జ్ఞాపకానికి రాగా అంతా వివరించి చెప్పాడు స్నేహితులకు. అదంతా విని వారు వర్ణనాతీతమైన మనోవేదన ననుభ వించారు.

"ఆలస్యమెందుకు? ఇక్కడ చాల సేపుండరాదు, ఇంటివద్ద వారు చాల బాధపడుతుంటారు," అని రామమోహన్ అంటే అందుకు చంద్ర శేఖరం, "ఇప్పుడింటికి వద్దు, నేరుగా ఆస్పత్రికి తీసుకు వెళ్ళి తక్షణం చికిత్స చేయించాలి" అన్నారు. అదే బాగని ముగ్గురు చేరి డాక్టరును తిన్నగా కారులో పండుకోబెట్టి పెద్ద ఆసుపత్రికి తీసుకొని వెళ్ళారు.

డాక్టరు విజయకుమారును జాగ్రత్తగా పరిశీలించి చూచి "ప్రమాద మేమి లేదు. రెండు వారాలు పాటు ఆస్పత్రిలోనే ఉంచండి. శ్రద్ధగా మందులిచ్చి, కట్లుకట్టి బాగు చేస్తాను." అని ధైర్యం చెప్పాడు.

"సరే" అని చంద్రశేఖరాన్ని రోగివద్ద విడిచి రామమోహన్ నిరంజనరెడ్డి మాధవరావు ఇంటికి వచ్చి సంగతంతా తెలిపి, ఓదార్చారు అందరిని. రామమోహనుడు చెల్లెలికి ధైర్యం చెప్పి "భయపడకమ్మా భగవంతుడు మేలుచేస్తాడు." అని ఊరడిస్తూ మాధవరావుతో "ఆస్పత్రిలో ఒక స్పెషల్ వార్డును ఏర్పాటుచేసి అందులో మీ కుమారుని అడ్మిట్ చేయించినాము. తక్కిన విషయాలన్ని మేము చూచుకొంటాము అచ్చట విజయకుమార్ వద్ద ప్రసన్నను, మాణిక్యాన్ని ఉంచండి. కాంతమ్మగారు, మీరు అప్పుడప్పుడు పోయి చూచి రావచ్చు" నన్నాడు.

అప్పుడందరు ఆస్పత్రికి వెళ్ళి చూచి రావలెననుకొన్నందున వారిని మరల కారులో పిలుచుకొని మిత్రులిద్దరు వెళ్ళారు హాస్పిటల్‌కు. రోగిని చూచి కన్న తల్లిదండ్రులు, ప్రేమించిన భార్య పొందిన మనో వేదన చెప్పతరము కాదు.

వారు విజయకుమార్ ప్రక్కన కూర్చొని ఎన్నో విధముల అతని దేహస్థితిని గూర్చి ప్రశ్నిస్తూ, జరిగిన మోసాని కెంతో విచారించారు. ఆతడు వారినందరిని ఊరడిస్తూ "ఏమి భయపడకండి. కొన్నాళ్ళు తగిన చికిత్స పొందితే మేలౌతుంది" అని ధైర్యం చెప్పాడు. తన ఉపచారార్థము భార్య, మాణిక్యం తన వద్దనే వుంటారని విని అతడు సంతోషించాడు. తక్కినవారెవ రెవరు ఏయే పనులు చేయాలో నిర్ణయించాడు రామమోహన్.

"నాయనా దేవుడిలాటి వాడవు, బాబూ! నీవలన మేము పొందిన మేలుకు కృతజ్ఞత తెలుపుకొనేందుకంటే అధికంగా మేమేమి చేయలేము. మీ తండ్రి మామీద యీ రీతిగా కసి సాధిస్తూ వుంటే, నీవతనికి ఎదురై నిలిచి మమ్ము కాపాడావు".

అని మాధవరావు, కాంతమ్మ తన్నెంతో ప్రశంసిస్తూ వుంటే రామ

మోహనుడు వారిని వారించి "నిరపరాధులగు వారికి అన్యాయం జరుగుతూ వుంటే చూచి ఓర్చేదేలాగ చెప్పండి? ఇంతకు మా ప్రసన్న సుఖానికై నేనేమైన త్యాగం చేయగలను. మా తల్లి యీమెకై ఎంత బాధపడుతూ వుందో చెప్పలేకున్నాను. మా నాన్న యీలాగై పోయాడంటే యిదంతా మా దురదృష్టం" అని ముఖం చిన్న బుచ్చుకొన్నాడు.

"అతడెప్పుడు యింత క్రూరుడుగా వుండేవాడు కాదు. మోహన్ నీకు ట్యూషన్ చెబుతున్నకాలంలో అతడేలాంటి వాడైంది నే చూస్తూ వుంటిని కాదా? చాల పెద్ద మనిషి నారాయణరావు" అని మాధవరా వన్నాడు.

"అది అందరికి తెలుసునండి. ఈలోగా ఆ పాపిష్టి పరంధామయ్య అతనికీ పెండ్లిండ్ల పేర దురాశకల్పించి అతని మనసే పాడు చేశాడు."

"అందువల్ల అతనికేమైన లాభ ముందేమో?"

"శంభుదాసుకు మా ప్రసన్నను యిచ్చి పెండ్లి చేయడానికి మే మెవ్వరైనా సమ్మతించేవారమేనా? అతనికి పురుష సంతతి లేదని, ప్రసన్న నాతనికిస్తే ఆతని ఆస్థి తన కై వశమవుతుందని మాతండ్రి భ్రాంతి పడ్డాడు. ఇదంతా పరంధామయ్య దుర్బోధ. శంభుదాసు ఏమైన యివ్వకుండా ఉంటాడా ఈ ఆశ కల్పించినందుకు?"

"అవును, ఆ మాట నిజమై వుంటుంది. లేకుంటే పరంధామయ్య కెందు కింత శ్రద్ధ?"

"ఇప్పుడు నీవు నాన్నను యింత వ్యతిరేకించి పనిచేస్తున్నావే అతనికి తెలిస్తే ప్రమాదంకాదా?" అని ప్రసన్న ప్రశ్నించింది అన్నను.

"అతడేమైన అననిమ్ము, కొన్నాళ్ళు నేను ఓపికతో ఓర్చుకోవా లమ్మా. ఎదురు చెప్పినంతా అతడు రెచ్చిపోతాడు. ఇప్పటికే యింటి

గుట్టు రచ్చపాలైంది. ఇంకా తండ్రికొడుకులు పోట్లాడుకొన్నారనే వ్యప దేశ మేల? అమ్మా, నేను ఓర్పుతో కొన్నాళ్ళు అంతా సహించు కొంటాము"

అతని గొప్ప గుణాన్ని మాధవరావు, కాంతమ్మ చాల మెచ్చు కొన్నారు. "మొదటినుండి అబ్బాయిగారి మనస్సే యింత" అని మాణిక్యం సమర్థించింది. ప్రసన్న చాల సంతోషించింది అన్న వివేకానికి.

"నీవు రాత్రి మీ తండ్రికి తెలియకుండా యిల్లు విడిచి వచ్చావా, మోహన్?" అని అడిగాడు విజయకుమార్.

"అవును."

"మరి నీ వింతసేపెక్కడి కెళ్ళావని మీ నాన్న అడిగితే ఏమని చెబుతావు?"

"ఏదో బొంకు బొంకుతాలే సమయంచూచి అతను నమ్మేటట్టు."

"నీవు అప్పుడప్పుడు వచ్చి పోతూవుండు. అమ్మను దిగులు పెట్టుకోవద్దని చెప్పు." అని చెప్పింది ప్రసన్న.

"అలాగే నమ్మా. నేనింక వస్తా." అని రామమోహన్ అందరి వద్ద సెలవుతీసికొని వెళ్ళిపోయాడు. నిరంజనరెడ్డి, చంద్రశేఖరంకూడ మధ్యాహ్నం వస్తామని విజయకుమార్‌తో చెప్పి వెళ్ళిపోయారు.

ప్రసన్నను. మాణిక్యాన్ని అక్కడేవుంచి మాధవరావు భార్యతో, బిడ్డతో యింటికిపోయాడు భోజనాలకని. మరల కొడుక్కు భోజనం తీసికొని తల్లి వస్తే, ప్రసన్న మాణిక్యం యింటికి పోయారు. ఈ రీతిగా కొన్నాళ్ళు వంతులు మార్చుకొని తిరగడానికి వారు నిర్ణయించు కొన్నారు.

# 32

నవంబరు మూడవతేదీ మునిసిపల్ ఛేర్మెన్ ఎలక్షన్ జరగాల్సిన దినం. అందుకు నిరంజనరెడ్డి ఒక అభ్యర్థి. కాంగ్రెస్ తరపున వడ్ల మూడి వేదాంతం శెట్టి నిలబెట్టబడ్డాడు. శెట్టి నారాయణరావుకు చాల యిష్టుడు. అందువల్ల వేదాంతం అతన్ని సమీపించి, ఏలాగైనా తనకున్న పలుకుబడిని వినియోగించి తాను గెలిచేట్టు చేయాలని ప్రార్థిస్తూ కొంత డబ్బుకూడ యిచ్చిపోయాడు. డబ్బు ఆశకాకపోయినా, నిరంజనరెడ్డిని ఓడించాలనే యీర్ష్యతో నారాయణరావు – తా నోడిపోయాననే సిగ్గుకూడ విడిచి – తనకు తెలిసిన ఎన్నికైన కౌన్సిలర్ల వద్దకు స్వయంగా వెళ్ళి వేదాంతం పరంగా ప్రచారం ప్రారంభించాడు.

అతనిదంతా హాస్యాస్పదమైన చర్యగా పరిణమించింది ఊళ్లో. ఎక్కడచూచిన అతని యింటిసంగతిని గురించి మాట్లాడుకొనేవారే.

"అయ్యో, పాపం, దిక్కులేక చేజిక్కిన అన్నకూతురు కెంత అన్యాయం తలపెట్టాడీ పాపిష్ఠిమనిషి, ఆమెను కోరినవానికిచ్చి పెండ్లి చేయకుండ దురాశతో, ఆమె వాటాఆస్తిని ఎగ్గొట్టాలనే దుష్బుద్ధితో, ఒక వయసుమళ్ళిన వానికంటగట్టి, ఆ బంగారులాంటి చిన్నదాని జీవితాన్నే పాడుచేయాలని సాహసించాడు. ప్రసన్న బాగా బుద్ధిచెప్పింది. ఒద్దికైన జంటనుచూచి ఓర్వలేక పైగా ఎంతో మంచివాడైన డాక్టర్ను కొట్టించాడట యీ దుర్మార్గుడు" అని చెప్పుకొంటూవున్నా రెక్కడచూచిన.

ఇంకా కాస్త సానుభూతి చూపుతున్నకూడ యిప్పుడు కానివారై పోయారు రంగపురంలో. నారాయణరావు అదంతా పట్టించుకొనేస్థితిలో

లేదు. మానాభిమానాలు కూడ మరచి, యీర్ష్యా, ద్వేషాలకు చిక్కి, పగ సాధింప పూనుకొన్నాడు నిరంజనరెడ్డి, విజయ కుమారులమీద.

తండ్రి చర్యలకు రామమోహను డెంతో సిగ్గుపడిపోతున్నాడు. శ్యామసుందరి ఒకవంక లోలో దుఃఖపడుతూంది.

ఊరంతా నారాయణరావంటే అసహ్యించుకొనే స్థితికి వచ్చిందని విని వారెంతో బాధపడుతున్నారు. ప్రసన్న కన్యాయం తలపెట్టడంవల్ల, విజయ కుమార్‌కు చెడ్డ చేయబూనినందువల్ల అతడు ముఖ్యంగా జనులదృష్టిలో చాలచులకన అయిపోయాడు. దీనినంతగా పట్టించుకోకుండ వేదాంతం శెట్టికొరకు చేసే ప్రచారంవల్ల మరింత హాస్యాస్పదుడై పోయాడతడు.

నారాయణరావు యిప్పుడింటిలో భార్యనుకాని, కొడుకును కానిమాట్లా డించేదే మానుకొన్నాడు. మాణిక్యం వెళ్ళిపోయాక వచ్చిన క్రొత్త వంట మనిషి రామయ్య పిలిచి నప్పుడు భోజనాలకు వెళ్ళడం, మిగతా సమ యాల్లో అతడు తనగదిలోకి తెచ్చి పెట్టే కాఫీ, ఫలాహారాలు ఆరగించడం తప్ప, భార్య నేవిషయంలోను పలుకరించడు. ఆమె, రామమోహనుడు అతని దృష్టిలో విరోధులై పోయారు.

అతని కెవ్వరు ఏలాటి అపకారం చెయ్యకపోయిన అతనిమనసే అతనికి శత్రువై పొయ్యింది, అది పూర్తి చెడిపోయినట్లుంది. తాను చేసేదెంత అక్రమమైనా, దాన్ని పొగడేవారంతా అతనికి హితులు — కూడ దనేవారు శత్రువులు.

విజయకుమార్‌మీద కోర్టులో కేసు వేయించాడు. రంగపురంలో సుప్రసిద్ధ న్యాయవాది అయిన బ్రహ్మయ్య అతని అడ్వొకేటు. అతనికి సహాయంగా వుండడానికి హైదరాబాదునుండి రామకృష్ణపటేల్ అనే మరి

యొక పేరుపొందిన వకీలును వాయిదానాటికి పిలిపించే ప్రయత్నంకూడా చేశాడు నారాయణరావు.

♦ ♦ ♦

విజయకుమార్ హాస్పటల్లో చేర్చబడి వారం దాటింది. ప్రసన్న చేతి చలవవల్ల, డాక్టర్ల శ్రద్ధవల్ల అతడు బాగా కోల్కొన్నాడు. మిత్రులు ప్రతిదినం వచ్చి విచారించుకొని పోతూనే వున్నారు. మాధవరావు, కాంతమ్మ చాల సంతోషించి కుమారునికి ఆరోగ్యమునిచ్చి కాపాడినందుకు ఇంటిదేవునికి అఖండ దీపారాధన చేశారు.

తన కయిష్టులైన విజయకుమార్ ఆస్పత్రిలో చేర్చబడడం, అతని విషయమై ఎవరెవరు ఎంతశ్రద్ధ వహిస్తూవుండడం, అతడిప్పుడు ఆరోగ్య వంతుడై వుండడం నారాయణరావున కెప్పటికప్పుడు తెలిపేవారు లేక పోలేదు. అతనికి భార్యమీద, అందులో అధికంగా కొడుకుమీద, కోపం వచ్చి ఒకనాడు రామమోహన్‌తో యిట్లన్నాడు:

"ఓరే, మోహన్, నాకు కొడుకై వుండికూడ నన్నేఎదిరించి పని చేస్తున్నావుగా! ఊళ్ళో నీవు మంచివాడు కావాలి, నేను చెడ్డవాడు కావలెనా?"

అందుకు రామమోహనుడు తెగించి "నన్నుకూడ మీ వలె డ్డచె కమ్మన్నారా" అని అడిగాడు.

నారాయణరావు తోకత్రొక్కిన పామువలె లేచి, "దుర్మార్గుడా! ఇంతకు వచ్చాక నీవు కొడుకుకాదు — నేను తండ్రినికాను, వెళ్ళిపో నా యింటినుండి" అని గదమాయించాడు.

"నా సంగతిని మీ రంత సులువుగా తేల్చుకోవచ్చును. కాని, మీ సంగతిని నేనట్ల తేల్చుకోలేను. ఎట్లున్నా మీరు నాకు పూజ్యపాదులే."

"అందుకే కాబోలు నాకింత మర్యాదయిచ్చి నలుపురిలో నవ్వుల పాలు చేస్తూన్నావు."

"నేనుకాదు మిమ్ము నవ్వులపాలుచేసేది – మీ పిచ్చిపనులే మిమ్ము స్థితికి తెచ్చాయి."

"నోరుముయ్, పశువా, నా యిల్లువదలి పొమ్మ్మనుగా? నాకు నీకు సరిపడనప్పుడు నీ కిచ్చట ఏమిపని?"

"పోతాను, నా భాగం ఆస్తి పంచిపెట్టండి."

"ఆస్తి – భాగం – చండాలుడా! నీకొక చిల్లి గవ్వకూడ యివ్వను. నీ దిక్కున్నచోట మొత్తుకో పో. ఆ లంజ – నీ చెల్లెలతో యే గంగలో అయినా పడిచావు."

"ప్రసన్న నలా అనడానికి మీకు నోరెట్లావచ్చిందో కదా? ఆ పిల్ల మీ కేమిద్రోహం చేసింది? అంతద్రోహం మీరేగా చేశారు! ఇంకా తన పసపు కాపాడుకొని, మీకు కీర్తి తెచ్చింది ప్రసన్న. ఆమెనా మీరు తిట్టడం?"

"ఏడిశారు నీవు, నీ చెల్లెలు. ఎక్కడైనా పాడై పొండి—"

అని ఆ సంభాషణ నింతటతో చాలించి నారాయణరావు చరాలున గదిలోకి వెళ్ళిపోయాడు. వీరిద్దరి సంభాషణ నాలకిస్తున్న శ్యామసుందరి మగని మూర్ఖానికెంతో దుఃఖించింది.

♦ ♦ ♦

మిత్రులు తనదగ్గరికి వచ్చినప్పుడంతా విజయకుమార్‌ని విచారించు కొంటూ వున్నాడు ఛేర్మెన్‌ఛాన్స్ విషయమై, అది తప్పకుండ నిరంజన రెడ్డిదే అని చంద్రశేఖరం నచ్చచెప్పాడు. తానీస్థితిలో పడి మిత్రుని

కీసారి సహాయము చేయలేకుంటినికదా యని విజయకుమార్ విచారించి నప్పుడంతా వారతనిని ఊరడించి "మొదట నీ ఆరోగ్యం చూచుకో. భాయ్. నీవు వెనుకచేసిన సహాయమేచాలు. అదే చాల కష్టమైనపట్టం. ఇప్పుడేముంది - ఎద్దన్నా ప్రజలు నిరంజనరెడ్డినే మునిపల్ ఛేర్మన్‌నిగా ఎన్నుకొంటారు. ఇందులో మనప్రయత్నమంతగా అవసరములేదులే" అని చంద్రశేఖరం సమాధానం చెబుతున్నాడు.

అనుకొన్నట్టు నిరంజనరెడ్డినే గెలిపించాలని కౌన్సిలర్లలో అనేక మంది ఒక్కటయ్యారు. వేదాంతం శెట్టి ఛాన్సు సన్నగిల్లిపోయింది. అయినా అతడు తన ప్రచారాన్ని మానుకోలేదు. నారాయణరావు తమకు శెట్టి విషయమై చెప్పవచ్చినప్పుడంతా ఎన్నిక అయిన మెంబర్లు మోమా టానికి "సరేలెండి, మీరు చెప్పినట్టే చేస్తా" మంటూ హుళక్కి వాగ్దా నాలు చేస్తున్నారు, అది నమ్మి నారాయణరావు శెట్టికి ధైర్యం చెబు తున్నాడు. వీరిద్దరి ప్రహసనాన్ని చూచి ఊళ్ళో అందరు నవ్వివోతున్నారు.

తండ్రి యొక్క ఈ వైధేయ బుద్ధికి రామమోహనుడు తల వాల్చి కొని తిరుగవలసిన స్థితి యేర్పడింది. అయినా, అతని విషయమై ప్రజల కెట్టి దురభిప్రాయము లేదు. మీదు మిక్కిలి పూజ్యభావం యేర్పడింది అతని యిటీవల నడతవల్ల.

ఎదురు చూచినట్టు నవంబరు మూడవతేదీ జరిగిన ఛేర్మెన్ ఎలెక్షన్ గెలుపు నిరంజనరెడ్డినే వరించింది. మరియొక మారు నారాయణరావుకు శృంగభంగమైంది. అతడు మరింత పిచ్చివాడై పోయాడు దీనివల్ల.

ఒకనాడు రామమోహను డింట లేనప్పుడు తండ్రి, తల్లి మీద చేయి చేసుకొన్నాడనే సంగతి తెలిసిన రామమోహనుడు రాత్రి తండ్రితో చాలా తీవ్రంగా వాదించాడు. శ్యామసుందరి కలుగజేసుకొని కొడుకునకే బుద్ధి చెప్పింది యిప్పటికే రచ్చకెక్కిన యింటి వ్యవహారాలను మరింత రచ్చ

కీడ్వ వద్దని. అనాటి నుండి రామమోహనుడు యింట్లో వుండక ఎక్కడో ఒక మిత్రుని యింట వుంటూ, ఎక్కువకాలం ప్రసన్నా విజయకుమారులతో గడుపుతూ, ఎప్పుడైన ఒక మారు తండ్రి యింట లేనప్పుడు యింటికివచ్చి తల్లినోదార్చి పోతున్నాడు.

ఛేర్మెన్ ఎలెక్షన్ జరిగిన మరునాటి నుండి నారాయణరావు కెందుకో తాను విజయకుమార్ మీద కోర్టులో పెట్టిన కేసు విషయమై కూడ నిరుత్సాహము కలుగసాగింది. వకీలు బ్రహ్మయ్యకే అన్ని సంగతులు వప్పజెప్పి తాను యింటో విడిచిపోకుండ, ఎప్పుడు ఒంటరిగా మేడమీద కూర్చొని ఏదో దిగులు పడినవానివలె విచారిస్తూ కూర్చోవడం మొదలు పెట్టాడు.

రామమోహను డిప్పుడింటికిరాడు. వచ్చినా తండ్రితో మాట్లాడడు శ్యామసుందరి భర్తతో మాట్లాడేందుకే భయపడుతూంది. నౌకర్లు ఎక్కడి వారక్కడ యాంత్రికంగా తమ పనులు చేసుకొని పోతున్నారు.

దీపం అరిపోకుండా చమురు పోసినట్టు వకీలు బ్రహ్మయ్యా వచ్చి పోతూ నారాయణరావుకు కేసు విషయమై లేనిపోని ధైర్యం కల్పించ పోతున్నాడు. నారాయణరావు భవిష్యద్గతి అంతా యీ కేసుయొక్క ఫలితంపైన ఆధారపడినట్లుంది.

రామమోహనుడు చిన్నవాడైన, స్థితిగతులను చక్కగా అవగాహనం చేసుకొని, ముఖాముఖి తండ్రితో మాట్లాడేందుకు వీలులేక, ఒక దీర్ఘమగు ఉత్తరాన్ని వ్రాసాడతనికి అన్ని సంగతులను గూర్చి పునరాలోచన చేసి ప్రసన్నతో రాజీపడుమని. అట్లయిన తాను అరుంధతిని పెండ్లాడగలనని. తానున్న వైకల్య స్థితిలో నారాయణరావు ఆ జాబును చించి ముక్కలు చేసి పారవేసి కొడుకును యిష్టానుసారం దూషించాడు పరోక్షంలోనే. ఆ సంగతికూడ రామమోహన్‌కు తెలిసింది తల్లివలన. అతడు తండ్రి విషయమై పూర్తి నిరుత్సాహ పడి పోయాడు.

తన మాట మేరకు ప్రసన్నను శంభుదాసు కివ్వలేక పోయినప్పు డాతని కూతురును తన కొడుకున కిమ్మని అడగడ మెట్లని నారాయణరావు సంకోచించినట్లుకూడ శ్యామసుందరి గ్రహించి ఆ సంగతి కొడుకుతో చెప్పింది.

## 33

కేసు వాయిదా యింక వారం రోజులు మాత్రముంది.

రంగపురములో అప్పుడే ఈ విషయమై మరియొక మారు గొప్ప సంచలన మేర్పడింది. అలాంటి కేసును గురించి యిదివరకెప్పుడు ఎవ్వరు విని యుండలేదు.

ఎవరో కొందరు పూర్వాచార ప్రియులు తప్ప తక్కిన వారంతా నారాయణరావుదే తప్పని నిందిస్తున్నారు.

డాక్టరు విజయకుమార్ ఆరోగ్యవంతుడై యిల్లు చేరాక, మిత్రులతో కూడి తమపై తేబడిన అభియోగాన్ని గురించి రఘునాథరెడ్డి అనె వకీలుతో సంప్రదింపులు ప్రారంభించాడు. రెడ్డి క్రిమినల్ వ్యవహారాల్లో మంచి బుర్ర కలవాడని ప్రతీతి. అతడు తన కక్షదారులకు కావలసినంత ధైర్యం చెప్పాడు

ఈలోగా నూతనంగా తాను ఛెర్మెన్‌గా ఎన్నుకోబడినందువల్ల ఇతర కార్యకలాపాల్లో మునిగిన నిరంజనరెడ్డి కేసు విషయమంతా మిత్రు లిద్దరికే వదిలేశాడు. రఘునాథరెడ్డి దూరపు బందువే కాక అతనికి సీనియర్ వకీలు కొబట్టి అతనికి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరమేమి లేకపోయింది.

ఈ నడుమ మేజిస్ట్రేటు లంచగొండి యని, నారాయణరావు దగ్గర ఐదువేలు లంచం పుచ్చుకొన్నాడని కర్ణాకర్ణి వార్త వినబడసాగింది. కాని దాని తత్వమెవ్వరికి తెలియదు. లంచ మిచ్చినది - తీసికొన్నది చూచిన వారెవ్వరు లేరు. ఈలాంటి సందర్భాల్లో "అదిగో పులి అంటే - ఇదిగో తోక" అనే వారెందరో వుంటారు. 'నీరు పల్లమెరుగు నిజము దేవుడెరుగు' అన్నట్లుంది పరిస్థితి.

కాలానికి రెక్కలున్నాయి - అప్పుడే వారం రోజులు గిర్రున తిరిగి పోయి వాయిదా తేదీ రానే వచ్చింది.

ఈ విచిత్రమైన కేసు విచారణ ఏలాగుంటుందో చూడాలని అనేక మంది కుతూహలముతో వచ్చి కోర్టులోని ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చు న్నారు. స్థలాభావం వల్ల చాలా మంది కోర్టు వరండాల్లో నిలబడవలసి వచ్చింది. అల్లరులు జరుగకుండ ఆ దినం స్పెషల్ పోలీసు బందోబస్తు యేర్పాటు చేయబడింది.

మరే కేసును ఎత్తుకోకుండ ఆ దినం ఒక్క సి. సి. 375 ను మాత్రం విచారించేట్టు కోర్టులో యేర్పాటైంది. వకీళ్ళందరు తమతమ స్థానాల్లో కూర్చొని కుతూహలముతో ఎవరికి తోచినట్టు వారు మాట్లాడు కొంటున్నారు.

హైదరాబాదునుండి నారాయణరావు పరంగా వాదించేందుకు వచ్చిన వకీలు రామకృష్ణ పటేల్ చాల సమర్థుడని బార్‌లోని వదంతి. వకీలు బ్రహ్మయ్యశాస్త్రి అతని ప్రక్కనే కూర్చొని కేసువిషయాలు పర్యాలో చిస్తున్నాడు.

ఇన్‌స్పెక్టర్ సదానందం పిళ్ళె పబ్లిక్ ప్రాసిక్యూటర్ విశ్వనాథ జ్యోషీకి ఏవేవో కాయితాలు త్రిప్పి త్రిప్పి చూపుతూ, మాట్లాడుతున్నాడు.

రఘునాధరెడ్డి ప్రక్కన బెంచీమీద డాక్టర్ విజయకుమార్, నిరంజన రెడ్డి, చంద్రశేఖరం కూర్చున్నారు. నారాయణరావు తన వకీళ్ళ వెనుక ఒక కుర్చీలో కూర్చొని వారికేమో చెబుతున్నాడు.

సరిగ పదకొండు గంటలకు "పబ్లిక్ కోర్టు" ప్రారంభమయింది.

బెంచి క్లార్కు "సి. సి. 375" అని పిలువగానే రఘునాధరెడ్డి లేచి ముద్దాయీలు ముగ్గురు హాజరైనట్టు మేజస్ట్రీటుకు తెలిపాడు.

రామకృష్ణ పటేల్ నారాయణరావును బోనులో కెక్కించి 'ప్రమాణం' చేయించాడు.

"మీరు రెండు పెర్యాయాలు రంగపురం మునిసిపాలిటీకి ఛేర్మెన్‌గా ఎన్నుకో బడ్డారు కదూ?"

"అవును."

"మీరు ఇన్‌కంటాక్సు ఎంత చెల్లిస్తున్నారు?"

"సుమారు పదివేలు."

"ప్రసన్నకుమారి మీకేమి కావాలి?"

"మా అన్నకూతురు"

"మీ అన్నగారి పేరు?"

"సోమసుందరరావు"

"అతడు సజీవుడేనా?"

"అతను పదహారేళ్ళ క్రితం భార్యను కోల్పోయిన దుఃఖముతో రెండేడ్ల బిడ్డ ప్రసన్నను తన ఆస్థి సర్వస్వాన్ని నా అధీనంచేసి ఎక్కడికో వెళ్ళి పోయాడు. ఇంతవరకు అతని జాడ తెలీదు."

"జీవించే ఉన్నాడంటారా?"

"ఉండవచ్చును — ఉండక పోవచ్చును నేనేలా చెప్పేది?"

"లేక సన్యాసి అయివుంటాడా?"

"నేనే సంగతి చెప్పలేను."

"అతడు వెళ్ళిపోయి నప్పటి నుండి ప్రసన్న కుమారికి మీరే పోషణ కర్తలు, పెద్దలు కదా?"

"అవును"

"పోనీ, వెళ్ళిపోయేటప్పుడు ప్రసన్నకుమారిని మీ కప్పగించినట్టు సోమసుందరరావుగారేమైన వ్రాసి యిచ్చారా?"

"ఆతడెవ్వరికి తెలియకుండ తన తలగడ క్రింద ఉంచి పోయిన జాబును కోర్టువారి ఎదుట హాజరు చేశాను."

రామకృష్ణ పటేల్ "ఎగ్జిబిట్ నెం. 1" బెంచి గుమాస్తా వద్ద నుండి యిప్పించుకొని మేజిస్ట్రీటు ఎదుట బెట్టాడు. అందులో యిట్లుంది.

"చిరంజీవి నారాయణరావుకు – మీ అన్న సోమసుందరరావు యిందుమూలకంగా తెలియజేయడమేమనగ"

నా భార్య సులోచన మరణానంతరము నాకి సంసారముపై విరక్తి కలిగింది. అందువల్ల నేనీదినము సర్వసంగపరిత్యాగినై పోతూవున్నాను, ముందు నాగతి ఎట్లుండునో, నాబుద్ధి ఎప్పటికెట్లు మారునో నేను చెప్ప లేను. నేటినుండి నీ కింక అన్నలేడని మాత్రం నమ్ముకో. నా కూతురు ప్రసన్నకుమారిని నీ కప్పగించి పోతున్నాను. ఆమెకింకమీద మీరే తల్లి దండ్రి. నీకు నచ్చినట్లు ఆమె భవిష్యత్తును తీర్చి దిద్దడానికి నీ కందు మూలకంగా సర్వాధికారమిస్తున్నాను. స్త్రీ స్వాతంత్ర్యములో నమ్మికలేని నేను నిన్నామెకు అన్నివిధాలా పెద్దగ, రక్షణకర్తగా నియమించి పోతున్నాను, ఆమె నేనాటికి స్వతంత్రురాలుగా ఉంచి, విశేషధనానికి అధి కారిణిగా ఉంచవద్దు, ధనమెంతవారినైన దారి తప్పిస్తుంది, డబ్బు చేజిక్కిన

తరువాత ఆమె స్వతంత్రించి పెద్దలను ధిక్కరించవచ్చును. అది నాకు — నీకు — మనవంశానికి కీర్తి ప్రదము కాజాలదు. కాబట్టి, ఆమెకు వయసు వచ్చినాక నీకు నచ్చినవానికిచ్చి వివాహంచేసి, ఆమె పరంగా నా ఆస్తి భాగాన్ని నీ అధీనంలో వుంచుకొని, ఆమె అవసరాన్ని తీర్చుచుండ వలెనని యిందుమూలకంగా నిన్ను కోరుచున్నాను. సెలవు,

ఇట్లు,
"సోమసుందరరావు."

మేజస్ట్రీటు జాబు నొక్కసారి చదువుకొని, "కానివ్వండి" అని వకీలు మొగమువంక చూచాడు.

"ఒకటవ ముద్దాయి డాక్టర్ విజయకుమార్ మీ కెంతకాలమునుండి తెలియును?" అని మరల ప్రారంభించాడు పటేల్.

"సుమారు ఐదు నెలలనుండి."

"ఏవిధంగా తెలుసు?"

"ఒకనాడు నేను కార్యాంతరముమీద బయటికి వెళ్ళినప్పుడు నా భార్యను తేలుకుట్టింది, మా నౌకరు మా యింటి డాక్టర్ రామనాధం దొరక లేదని యితనిని మా యింటికి పిలుచుకొని వచ్చాడు ఇతడు మందేదో యిచ్చి ఆ బాధను పోగొట్టాడట, తరువాత నేనింటికి వచ్చాక నాకీ సంగ తంతా తెలిసింది. ఇతనిని మరల పిలిపించి యివ్వవలసిన ఫీజు ఇచ్చి పంపాను."

"ఆ తరువాత మీ రెప్పుడైన కలుసుకొన్నారా?"

"లేదు."

"మరెప్పుడైనా యీ డాక్టరు మీ యింటికి వచ్చినాడా?"

"లేదు. అంతకుముందుకాని, తరువాతకాని ఎప్పుడు రాలేదు."

"మొదట వచ్చినప్పుడతడు ప్రసన్నకుమారిని చూచినాడంటారా?"

"అవును."

"వీ రిద్దరు ఒకరినొకరు ప్రేమించుకొన్నట్టు తరువాత మీ కేమైన తెలిసిందా?"

"అలాటిది నే నెప్పుడు వినలేదు,"

"అయితే ఆమె మీ యింటినుండి పారిపొయ్యేవరకు మీ కాసంగతే తెలియదంటారు?"

"తెలియదు,"

"ఆమె ఎప్పుడైన ఒంటరిగా యిల్లువిడిచి పోయేదా?"

"లేదు."

"ముద్దాయికి ఆమెకు పరస్పరం ఉత్తర ప్రత్యుత్తరాలేవైన జరుగుతూ వుండేదా?"

"జరుగుచుండినాయని మా నౌకరు వెంకన్న తరువాత నాతో చెప్పాడు."

"తరువాత అంటే?"

"ఆమె యిల్లువిడిచి పారిపోయాక"

"ఆమె ఒంటరిగానే పోయిందా?"

"లేదు - మా యింట్లో వంటమనిషి మాణిక్యంతో వెళ్ళిపొయ్యింది."

"వా రిద్దరు యిప్పుడు ముద్దాయి యింట వున్నారన్నమాట?"

"అవును. ఉన్నారు."

"ప్రసన్నకుమారి ముద్దాయిని వివాహమాడిందా?"

"ముద్దాయి ఆమెను తిరుపతికి పిలుచుకొని వెళ్ళి అక్కడ పెండ్లి చేసుకొన్నాడని నాకు తరువాత తెలిసింది."

"వారిద్దరే వెళ్ళారా తిరుపతికి?"

"లేదు. రెండు, మూడు ముద్దాయిలుకూడ వారితో వెళ్లి యీ పనిని నెరవేర్చినారు."

తరువాత వకీలు కోరికమీద నారాయణరావు నౌకరు వెంకన్న సాక్షిగా వచ్చి "బాక్సు"లో కెక్కాడు.

కోర్టు గుమాస్తా సాక్షి పేరును, తండ్రిపేరును, వయసును నమూదు చేసుకొన్నాడు. పిమ్మట వకీలు మరల ప్రారంభించాడు.

# 34

"నీవు నారాయణరావుగారి యింట్లో ఎన్నేండ్లుగా నౌకరీ చేస్తున్నావు?"

"నాలుగేండ్లయిందండీ."

"నీవు వారింట్లో చేసేపనేమిటి?"

"అమ్మగారు చెప్పినప్పుడు దుకాణానికి వెళ్ళి సరకులుతెచ్చి పెట్టడం, మార్కెట్టుకు ఉదయం సాయంకాలం వెళ్ళి కాయగూరలు తెచ్చి యివ్వడం, ఇంకా ఏమైనచెబితే చెయ్యడం నా పని, బాబు."

"నీవు మీ అయ్యగారి పనులేవి చేయడంలేదా?"

"నాకు అయ్యగారి దగ్గరకంటె అమ్మగారిదగ్గరనే ఎక్కువ పను లుంటాయండి."

"మీ అయ్యగారి కుమార్తె—"

"కాదండి. వారి అన్నకుమార్తె"

"సరే, అలాగే. ఆమె నీ కెప్పుడైన పనులు చెబుతూ వుండేదా?"

"నెలక్రిందటిదాక అలాటిదేమి వుండేదికాదు కాని, ఆ తరువాత ఆమెగారు ఏవో రహస్యమని జాబులు వ్రాసి డాక్టర్ విజయకుమార్‌గారికి యిచ్చి రమ్మని నాతో పంపడం ప్రారంభించింది. అతడు జవాబు రాసిస్తే ఆమెగారికిచ్చేవాణ్ణి."

"మొదట నీకు జాబునిచ్చింది మీ అమ్మగారా? డాక్టరా?"

"డాక్టర్ బాబేనండీ."

"ఎప్పుడిచ్చాడో జ్ఞాపకముందా?"

"ఉందండి. ఒకనాడు రాత్రి నేను గేటుదగ్గర నిలబడివుంటే ఇతడు ఆ దారిని సైకిలుమీదవచ్చి నన్నుచూచి దగ్గరకు రమ్మాన్నాడు. పోయాను. నా చేతికొక జాబిచ్చి "దీనిని మీ చిన్న అమ్మాయికి రహస్యంగా యివ్వు. ఆమె మళ్లీ ఏదైనా వ్రాసియిస్తే దాన్ని నాకు తెచ్చియివ్వు. నీ శ్రమకు బహుమానం పట్టుమని నాకు పదిరూపాయల నోటు ఇచ్చాడండి. అప్పటినుండి బుద్ధి గడ్డితిని రహస్యంగా ఆమె జాబులు ఇతనికి, ఇతని జాబులామెకు యిస్తూవచ్చాను. ఈ సంగతి మరెవ్వరికి తెల్దుబాబు."

"నీకు ఇద్దరివల్ల యేమైన డబ్బు ముట్టేదా?"

"లేకేమిబాబు, అమ్మగారొకవంద, యీయనగారొకవంద యిచ్చింటారు."

"సుమారు ఎన్నిజాబు లీ రీతిగా మూర్చావు."

"జ్ఞాపకం లేదండీ, బాబు, చాలావుంటాయండి."

"ఎన్నాళ్ళుజాబులు మోశావు?"

"అమ్మగారు ఆ రాత్రి యీయనగారి యింటికి వెళ్ళిపోయిన సాయంకాలంవరకు మోశానండి."

"ఆ రాత్రి ఆమె యితనియింటికి రహస్యంగా వెళ్ళిపోతుందని నీకు తెలుసునా?"

"ఆ - తెలుసునండి."

"ఎట్ల తెలిసింది?"

"డాక్టర్ బాబు చెప్పాడండి."

"ఏమని?"

"ఒరే; వెంకన్నా, మీ చిన్నమ్మకు నామీద బాగా మరులు పుట్టించానురా. ఇందుకొక మందుకూడ యిచ్చాను. ఈ దినం మా యింటికి వస్తుంది. చూడరా నా తఢాకా. మీ అయ్య నన్నేమిచేస్తాడో చూస్తానులే." అని ఆ సాయంకాలం జాబునిస్తూ అన్నాడండి.

"అంతకుముందు డాక్టరు అమ్మాయికి త్రాగడానికి కాని, తినడానికి కాని నీతో ఏమైన పంపాడంటావా?"

"పంపాడండీ. చెప్పమరిచాను. ఒకనాడు నా చేతికొక సీసానిచ్చి 'దీన్ని మీ అమ్మగారిని త్రాగమనరా. మంచి టానిక్కు' అన్నాడండి."

"దాన్ని మీ అమ్మగారు త్రాగారా?"

"ఎదుటే తాగారండి."

వెంకయ్య సాక్ష్యం ముగిసింది. మేజిస్ట్రేట్ సాక్షి వాఙ్మూలాన్ని జాగ్రత్తగా నమూదు చేశాడు.

ఎదుటిపక్షం వకీలు రఘునాధరెడ్డి సాక్షులను 'క్రాస్'చేసి, ఎగ్జిబిట్ నెం. 1. డాక్యుమెంటు కల్పితమని, అందులో సోమసుంద రరావు చేవ్రాలు కాని, వ్రాతకాని నమ్మదగినవి కాదని, ఏనాడు వెంకయ్య అనేసాక్షి నారాయణరావుగారి యింట్లో నౌకరీ చేయలేదని, అతడు లంచంతీసికొని కూడ సాక్ష్యం చెప్పాడని కోర్టువారికి మనవిచేశాడు.

తనపక్షం వారిని ప్రశ్నిస్తూ ప్రసన్నకుమారి ఇష్టానికి వ్యతిరేకంగా నారాయణరావు ఆమెను శంభుదాసనే ఒక ధనికునికి రెండవపెండ్లికియ్య నిశ్చయించాడని, ఆమె దుఃఖాన్ని కాని, ఇంట్లో అతనిభార్య, కొడుకు చెప్పిన మాటలనుకాని సరకు చేయకుండ, కేవలం దురాశచేత కఠినుడై శంభుదాసును పెండ్లిచేసికొని తీరవలెనని నిర్భందించి లగ్నపత్రికలను అచ్చు వేయించాడని, ప్రసన్నకుమారి డాక్టర్ విజయకుమార్‌ను ప్రేమించిన దగుటచేత గత్యంతరములేక కడకు తెగించి అతనిపంచ చేరిందని, వా రిద్ద రికి తిరుపతిలో వారి యిష్టముమీద వివాహము జరుపబడిందని, ఆమె కత డెట్టి దుర్బుద్ధిని బోధించలేదని, ఆమె బుద్ధిపూర్వకంగా స్వతంత్రించివచ్చి అతనిని వివాహము చేసికొనిందని వివరాలు రాబట్టాడు.

మొత్తముమీద అయిదుగురు సాక్షులను విచారించుటలో మూడు దినములు జరిగిందా కేసు.

నాల్గవదినము ఇరుప్రక్కల వకీళ్ళ "ఆర్గ్యుమెంట్లు" ముగిశాయి. అసత్యాన్ని సత్యంగా నిరూపిస్తూ రామకృష్ణపటేల్ చేసిన వాదనా చాతు ర్యాన్ని అందరు మెచ్చుకొన్నారు. డాక్టర్ పక్షం వా రతనికి "అన్యాయ

వాడి" అని పేరుపెట్టారు. రఘునాధరెడ్డికూడ చాల సమర్థతతో నడిపాడు కేసునంతా.

చూచేవారికి నారాయణరావు పక్షమే నెగ్గే సూచనలు కనబడినాయి. విచారణ కడవరకు మేజస్ట్రీటు అతనిపైపే ప్రసన్నుడై ఉన్నట్టు తోచిందందటికి. నారాయణ రావప్పుడే మీసం దువ్వుతూ వున్నాడు ఎదుటిపక్షం వారిని చూచి.

సదానందపిళ్లె చాలా ఉల్లాసంగా చూపట్టాడు. చిఱునవ్వుతో మాటి మాటికి నారాయణరావు చెవిలో ఏదో చెప్పుతూవుండీ అతడుకూడ హసన్ముఖుడౌతున్నాడు.

రామమోహనుడు కూడ కోర్టులో వుండినాడు మూడుదినాలు. తండ్రి కల్పించినకూట సాక్ష్యాన్ని కాదందామనిపించింది కాని, అలాచేయడం బాగుండదని "ధర్మమే జయమొందుగాక" అని భగవంతునిమీద భారము వైచి అంతాసహించి వూరకున్నాడు.

కడకు మేజస్ట్రేటు నారాయణరావుకే అనుకూలంగా తీర్మానిస్తాడని, ముద్దాయీలు ముగ్గురు శిక్షింపబడుతారని, అందులో విజయకుమారు శిక్ష కఠినంగా ఉండవచ్చునని, నారాయణరావు ప్రసన్నకుమారిని బలవంతంగా యింటికీడ్చుకొని పోయి, తాళి త్రెంచి, మరో పెండ్లి చేస్తాడని చాలమంది అభిప్రాయపడినారు.

# 35

వకీళ్ళ ఆర్గ్యుమెంట్లు ముగిసేవేళకు సరిగ ఒకసాధువు కోర్టులో ప్రవేశించి, సరాసరి మేజస్ట్రేటు వద్దకువెళ్ళి నమస్కరించి నిలబడ్డాడు.

ఇతడెవరా అని అందఱు ఆశ్చర్యముతో చూడసాగారతనిని' వయస్సు సుమారు ఏబది యేండ్లుండవచ్చు. ముఖకాంతి సహజంగా సుందరమైనదే అయినా, నిరంతరశీతా తపస్పర్శచే కందువారినట్లుంది. సుదీర్ఘములైన శ్మశ్రువులతో, ఆకర్షణీయమైన సాత్త్వికతేజస్సుతో అతని ముఖమందరిని అట్టే ఆకర్షించివేసింది, మెడలో రుద్రాక్షమాలికలు వ్రేలాడుతున్నాయి. త్రిపుండ్రాంకితమైన లలాటము విశాలమై, తేజోవంతమై వుంది. అతడు ధరించిన తెల్లని నిలువుటంగీ పాదాలవరకు జీరాడుతూవుంది.

అందరితోబాటు మేజిస్ట్రేటు కూడ విస్మితుడై "ఎవరుమీరు? ఇక్కడేమిపని?" అని గంభీరంగా ప్రశ్నించాడు.

"నాకు యీ కేసుతో చాలా సంబంధముంది. కోర్టువారు దయచేసి అనుమతిస్తే నా సంగతంతా చెప్పుకుంటాను." అని అన్నాడా సాధువు.

అందఱు తెల్లబోయి చూచారతనివైపు. నారాయణరావు గుండె ఎందుకో ఝల్లుమనింది. వచ్చిన సాధువు నతడు పరీక్షగాచూచి "ఇతడెవడు? ఈ కేసుతో యితనికేమి సంబంధం?" అనుకొన్నాడు. ఉన్నదున్నట్టు అతనికి తన అన్న సోమసుందరరావు సంగతిని జ్ఞప్తికి వచ్చింది.

"అతడేనా యితడు! – అవును, అతడే!" – నారాయణరావు అనుమానం తీరింది.

ఎంతకాలమైతే నేమి – ఎంత మారిపోతేనేమి – అన్నదమ్ము లొకరి నొకరు గుర్తుపట్టలేరా? – సరిగ అదేపని జరిగిందా సమయములో కోర్టు హాలునందు – .

నారాయణరావు శరీరమాద్యంతం ముచ్చెమట గ్రమ్మింది. కన్నులు మసకబారి మూర్ఛ వచ్చినంతపని అయింది. అప్రయత్నంగ అతనినోటి

నుండి "సోమసుందరరావు! - మా అన్న!!" అనేమాటలు బిగ్గఱగ వెలువడినాయి.

అది విని వకీళ్ళందఱు నిర్ఘాంతపోయారు. సాధువు ఆ మాటలు విని, లలాట ముకుంచితపరచి, నారాయణరావును తీక్ష్ణదృష్టితో చూస్తూ "అవును, మీ అన్న సోమసుందరరావుని నేనే. ప్రసన్న నా బిడ్డ కృతఘ్నుడు, నీచుడు, దురాశాపరుడైన నీవు నా తమ్ముడవు" అని వెక్కిరించినట్లు మాట్లాడాడు.

మేజస్ట్రేటు విస్మయ విస్ఫారితుడై "మీరేనా సోమసుందరరావు?" అని అడిగాడు.

"అవును."

"మీ రింతకాల మెక్కడ ఉండినారు?"

"సాధువృత్తితో దేశమంతట తీర్థయాత్రలు చేస్తూ తిరుగుతూ వున్నాను."

"అయితే ప్రసన్నకుమారి మీ కూతురేనంటారా?"

"ఇంకా సందేహమా? ఆమె నా కన్నకూతురు."

"ఆమెకు లేనిపోని వలపులునేర్పి, మందునిచ్చి మనసుమార్చి, రక్షకుడైన పినతండ్రిని వంచించి తనయింటికి పారివచ్చేట్టు చేశాడీ డాక్టర్ విజయకుమార్ అని అతనిమీద యీ అభియోగం తెచ్చాడు మీ తమ్ముడు. ఇందుకు మీ రేమంటారు?"

"ఇదంతా అసత్యమంటాను. నా కూతురు చేసినపని సరియైనదని సమర్థిస్తూ, ఆశీర్వదించి, ఆమెకు విజయకుమార్‌తో జరిగినపెండ్లి శాస్త్రీయమైనదని, నా కిష్టమైనదని ఒప్పుకొనేందుకే నన్ను దేవుడిప్పటికి పంపాడు.

ఆమె వివాహసంబంధమైన హక్కులునావి. నారాయణరావు ఒకవంక నన్ను — మరి ఒకవంక ఆమెను వంచించాడు."

దైవికమైన యీ సంఘటనవల్ల ప్రేక్షకులలో మితిమీరిన సంచలన మేర్పడింది. తెలిసినవారంతా సోమసుందరరావును గుర్తించారు. మేజస్ట్రేటు మూడుమార్లు బల్లగుద్ది "సైలెన్స్ - సైలెన్స్" అని అరిచాడు. కలకల మణగలేదు - కొందరు పోలీసులువచ్చి నెమ్మదిని కలిగించారు.

రామకృష్ణపటేల్, బ్రహ్మశాస్త్రి తమక్లైయింటు కుర్చీవైపు తిరిగి చూచారు - అది ఖాళీ! నారాయణరావు ఎప్పుడో లేచిపోయాడీ గలాభాలో — .

ఉన్నట్టు యీ రీతిగా కేసంతా తారమారై తనకు అవమానం కలిగించేస్థితి కలిగినందుకు అతడింక అక్కడ వుండలేకపోయాడు. కారులో ఎప్పుడు వెళ్ళిపోయాడో ఎవరు గమనించలేదు - అందరి చూపులు సోమ సుందరరావు మీదనే వుండిపోయాయి.

మేజస్ట్రేటు కోరికమీద సోమసుందరరావు తన కథనంతా యీ రీతిగా వెల్లడించాడు. కోర్టుహాలులో సూదిపడినా శబ్దము వినబడేంత ప్రశాంతత యేర్పడింది.

"నారాయణరావు, నేను ఏకోదరులము, అతడు నాకంటె నాలు గేండ్లు చిన్నవాడు. రమారమి పదహారేళ్ళక్రితం నా భార్య ప్రసన్నను కని పరమపదించింది. మా భార్యాభర్తల జీవిత మా రీతిగా శాశ్వతంగా విఛిన్నమై పోవడంచేత నేను విరాగినై ఎవ్వరితోను మీ ఏచెప్పకుండ కాశీకి బయలుదేరి వెళ్ళాను — "

"మీరు ఆ రీతిగా పొయ్యేందుకు ముందు మీ తమ్ముని పేర జాబే దైన వ్రాసివుంచి పోయారా?" అని నడుమ మేజస్ట్రేటు ప్రశ్నించాడు.

"లేదు. నే నేజాబు వ్రాయలేదు."

"అయితే, యీ జాబును మీరు వ్రాయలేదంటారా?"

సోమసుందరరావు మేజిస్ట్రేటు చూపిన ఎక్జిబిట్ నెం. 1 జాబును చూచి" ఇది నా వ్రాతకాదు - కల్పన." అన్నాడు.

"సరే ముందుకానివ్వండి"

"తరువాత నే నెక్కడుండేది ఎవ్వరికి తెలీదు. తనకొడుకు రామమోహనునితోబాటు నా బిడ్డనుకూడ పెంచి, నారాయణరావు పక్షపాతము లేకుండ విద్యాబుద్ధులు చెప్పించాడు. అంతవరకు సంతోషించవలసిందే. కాని, యీ లోగా పుత్రసంతతిలేని శంభుదాసు అనే వృద్ధుని కామెనిచ్చి పెండ్లి చేయాలని, అట్లు చేస్తే నా ఆస్తినంతా తానే దక్కిచుకోవచ్చుననే దురాశతో నారాయణరావు ఆమె కోరికకు వ్యతిరేకంగా వర్తించాడు - "

"ఈ సంగతంతా మీ కేలాతెలిసింది?"

"తీర్థయాత్రను చేస్తూ, ఎక్కడెక్కడో తిరుగుతూ, వున్ననేను ఒక వారం క్రిందట తిరుపతికి వచ్చాను. అక్కడ యాత్రికులలో కొందరు" రంగపురం మునిసిపల్ ఛైర్మెన్ నారాయణరావట - తన అన్నకూతుకెంత అన్యాయంచేశాడో చూచారా? ఆమెయిష్టానికి వ్యతిరేకంగా ధనాశకు లోబడి, చక్కని చుక్కలాంటి ఆ అమ్మాయిని శంభుదాసనే వృద్ధునికి అంటగట్టప్రయత్నిస్తే, ఆమె సాహసించి తాను ప్రేమించిన డాక్టర్ విజయకుమార్ అనే యువకునితో యిక్కడికి వచ్చి అతన్ని పెండ్లి చేసికొనిందట. ఇప్పుడు నారాయణరావు డాక్టర్మీద నేరంమోపి, ఆ పిల్లను మరల వాపసు తీసికెళ్లి మరల ముసలాతనికే అంటగట్టవలెనని ప్రయత్నిస్తున్నాడట. ఎంత కలికాలమైన యింత అన్యాయమా?" అని అనుకొంటూవున్న మాటలు నా చెవినిబడ్డాయి. అదంతా వినేటప్పటికి బిడ్డ

మీద మరల ప్రేమ ఉదయించి ఎకాయెకి నిన్నటిదినం యీ వూరికి వచ్చాను. ఇది మా స్వంతవూరు. అక్కడక్కడ విచారించేటప్పటికి నేను తిరుపతిలో విన్నదంతా సత్యమని తేలింది. నా తమ్ముడీరీతిగా దురాశాగ్రస్తుడై నాకు, నా బిడ్డకు ద్రోహం తలపెట్టాడు. నా బిడ్డ విజయ కుమారుని పెండ్లిచేసుకోవడం నాకు సమ్మతమే. నారాయణరావింత ఘాతకుడైనా అతనిభార్యా, కొడుకు యిద్దరు నా బిడ్డపరమై ఆమె మా నాన్ని, ప్రాణాన్నికూడ కాపాడారనికూడ నిన్ననే యిక్కడ తెలియ వచ్చింది. వారు చిన్నవారైన దేవుళ్ళలాంటివారు. వారికి నేను, నా బిడ్డ ఆజన్మాంతం కృతజ్ఞులము -- "

అని సోమసుందరరావు చెబుతుండగానే ప్రేక్షకుల గ్యాలరీలోనుండి మనసు పట్టలేక రామమోహనుడు దిగివచ్చి "పెదనాన్నా." అని అతన్ని కౌగిలించుకొన్నాడు. సోమసుందర రా వతడెవడైనది గ్రహించి ప్రతి కౌగిలితో ఆనందబాష్పాలు రాల్చాడు. చూచెడి వారి హృదయాలను కరుగించి వేసిందా దృశ్యము.

"అయితే, ఇప్పుడు జరిగిన పెండ్లి మీకు సమ్మతమేనంటారా?" అని అడిగాడు మేజస్ట్రేటు.

సమ్మతమే. కోర్టువారు యీ వివాహాన్ని సక్రమమైనదనే భావించి, నారాయణరావు డాక్టర్ విజయకుమార్ మీద తెచ్చిన ఫిర్యామను త్రోసి వేయాలని ప్రార్థిస్తున్నాను."

సోమసుందరరావు సాక్ష్యం ముగిసింది. కోర్టుహాలులో నిశ్శబ్దత నెలకొల్పబడింది. ప్రేక్షకులంతా యీ దైవికమైన సంఘటనను చూచి విస్తుపోయారు. ఎవరినోటచూచిన "ధర్మమేగెలిచింది. అన్యాయం నాశనమైంది" అనేమాటలే వినబడుతున్నాయి.

నారాయణరావు పరంగా వాదించిన వకీళ్ళు తలలువాల్చుకొని కూచున్నారు. వారిపక్షంలో ఎవరినికూడ గిల్లనా మొగాన రక్తంలేదు.

డాక్టర్ పక్షము వారంతా అమితోత్సాహముతో ఉప్పొంగి పోయారు.

మేజస్ట్రేటు కేసును కొట్టివేసినట్టు ఉత్తరువునిచ్చి లేచి పోయాడు — .

మిత్రులంతా సోమసుందరరావును పరివేష్టించి అభినందిస్తూ వెలుపలికి పిలుచుకొని వచ్చారు. కోర్టుగేటును దాటినవెంటనే అందఱు ఒక్కపెట్టున "డాక్టర్ విజయకుమార్‌కు జై – ప్రసన్నకుమారికీ జై – సోమసుందరరావుకు జై – ధర్మమేజయం" అని కేకలు వేయసాగారు.

# 36

విజయకుమార్ సోమసుందరరావును మిత్రులందరితోబాటు తమ యింటికి పిలుచుకొని వెళ్ళి తండ్రికి కోర్టులో జరిగినసంగతంతా వివరించి చెప్పాడు. మాధవరావు, సోమసుందరరావు పరస్పరం గుర్తించుకొని ఆనందబాష్పాలు రాల్చారు.

ఇంతవరకు తండ్రిమొగముచూచి ఎఱుగని ప్రసన్నకుమారి నేడున్నట్టు తనఎదుట ప్రత్యక్షమై తన్ను కౌగిలించుకొని, దుఃఖాశ్రువులతో బాటు ఆనందబాష్పాలను వాడ రాల్చుచుండే ఆ సాధువేషధారే తనతండ్రియని గ్రహించి సంభ్రమాశ్చర్య సంతోషములతో ఉక్కిరిబిక్కిరై పొయ్యింది. ఆమెకు మాతాపితృలిద్దఱు ఆ వృద్ధునియందే కనబడినారు. ఎన్నడో పోగొట్టుకొన్న పెన్నిధిని మళ్ళీ పొందగలిగిన పేదవలె ఆమె తండ్రి ఎదపై తలనానించి సుఖదుఃఖములు రెండు తన్ను కలిచివేస్తూవుంటే వెక్కివెక్కి ఏడ్వసాగింది.

రామమోహనుడు చెల్లెలిని ఓదారుస్తూ "ఇంకా ఎందుకమ్మా దుఃఖము? నీ వన్నివిధాల అదృష్టశాలివి, కోరినభర్త లభించాడు. పోయినాడనుకొన్న తండ్రి తిరిగివచ్చాడు. నీ భవిష్యత్సుఖాన్ని యినుమడింప జేయడానికి నేనున్నాను. "అని అమృతోపమానమైన మాటలు చెప్పాడు.

సోమసుందరం మరి ఒకచేతితో రామమోహనుని దగ్గరికి లాక్కొని "నాయనా! చిన్నవాడవైనా ఎంత గుణవంతుడవయ్యావు? మా వంశానికి మణివంటివాడవు బాబూ నీవు" అని ఎంతోమెచ్చుకొని మాట్లాడాడు. విజయకుమార్, నిరంజనరెడ్డి, చంద్రశేఖరం, మాధవరావు మొదలైన వారంతా రామమోహనుని సద్గుణాలనుగురించి ఎంతోపొగడి అతనికి చెల్లెలపైగల అనురాగాన్ని శతవిధాల వర్ణించిచెప్పారు సోమసుందరంతో.

రెండేండ్లునిండని తనపసిబిడ్డను ఆనాడట్లు వదలిపోగా, నేడు మరల అదేబిడ్డ యీ అప్సరస రూపముతో లభించిన విధివిధానాన్ని తలచుకొని సోమసుందరరావు పరమేశ్వరునికి ధన్యవాదాలర్పిస్తూ, తనలో ఉప్పొంగివచ్చే భావోద్రిక్తత నడచుకొని, బిడ్డనూరస్తూడి యిట్లన్నాడు "అమ్మా? ఊరడిల్లుము. భగవంతుడు కరుణామయుడు. సకాలములో నీ కష్టాలనన్నిటిని తీర్చి రక్షించినాడు. నీ పినతండ్రి నిన్నింతకాలము ఎంతో ప్రేమతోపెంచి, తుదకీరీతిగ తన స్వార్థానికి నిన్ను బలిచేస్తాడని ఎవ్వరనుకొన్నారు? అయినా అతడు నా తమ్ముడు. క్షంతవ్యుడు, నడుమ ఎవరో వానికీ దుర్బుద్ధిని బోధించి వుంటారు. పశ్చాతాప పడకపోడు నా తమ్ముడు. నేను వెళ్లి వానికి బుద్ధిగరపి ఊరడించి వస్తానమ్మా."

"నాన్నా! మీరింకెక్కడికి పోకూడదు. ఈ సాధువేషము తీసివేసి యథాప్రకారం మాతో కలిసివుండండి. ఇంకమీద నేను మిమ్ముపిడిచి ఉండలేను. పుట్టిననాటినుండి తల్లిదండ్రుల ముఖమేచూడని నా కిప్పటికి

భగవంతుడు మాతాపితృ స్వరూపులైన మిమ్ము నా కిచ్చినాడు. ఇంక మిమ్ము నేను పోగొట్టుకోలేను."

"లేమలే, తల్లీ! నిన్నింక విడచిపోను. నా జీవితాంతము నీ దగ్గరే వుంటాను. నిశ్చింతిగావుండు. మీ పిన్ని ఒకదేవత. మీ అన్న ఒక దేవుడు. వీరి చల్లని కటాక్షంవల్ల ధన్యురాలవయ్యావు. శ్యామసుందరిని చూచి రావలెనమ్మా, ఇంక నీ కొచ్చిన భయమేమిలేదు. నా వెంటరా. రామమోహన్ కూడా వస్తాడు, వెళ్లి ఆమెను పరామర్శించాలి. మీ చిన్నాన్నను ఊరడించాలి. ఈ పాటికే అతడు పశ్చాత్తప్తుడై ఉంటాడు. ఊరడించి, క్షమించి నానంటే అతనికెంతో మనశ్శాంతిగా ఉంటుంది.

సోమసుందరరావు ఉదారబుద్ధి నందఱు శ్లాఘించారు. "ఈ రాత్రి మా యింట ఒక గొప్పవిందు జరుపదలచాను. మీరు ఉదయం వారియింటికి వెళ్ళవచ్చు" నని విజయకుమార్ కోరుటవల్ల మాధవరావు, నిరంజనరెడ్డి ఆ మాటనే సమర్థించారు. సోమసుందరం 'అలాగే' అని సమ్మతించాడు.

ఆ రాత్రి ఒకగొప్పవిందు యేర్పాటు చేయబడింది. నిరంజనరెడ్డి, చంద్రశేఖరం, రాజగోపాలరావు లాంటి మిత్రులనేకమంది ఆహ్వానింప బడ్డారు. ఊళ్ళో కొందరు పెద్దలనుకూడ పిలిచివచ్చారు, నిరంజనరెడ్డి సలహా మీద శంభుదాసును, అతని కూతురునుకూడ ఆహ్వానించడం సమంజస మని అందరికి తోచింది. ఆ పనికి చంద్రశేఖరం, విజయకుమార్ యిద్దరు వెళ్ళారు.

వారు వెళ్ళేటప్పటికి శంభుదాసు యింటిలోనే ఉండినాడు, అతనికి కూడ సోమసుందరరావు వచ్చినసంగతి, కేసు యేవిధమైన పరిణామం చెందింది తెల్సిపోయ్యింది, ఉదారమైన ఆశయములు కలవాడైనందున అతడు తాను యిన్నాళ్ళుగాలేని తన వివాహాన్ని తలపెట్టడమే పొరబాటని

గ్రహించి, జరిగినదానికి చాల పశ్చాత్తాప పడినాడు. అతడాసంగతినే వచ్చిన యువకులిద్దరితో చెప్పి, తాను తన:ాతురు విందునకు వత్తుమని చెప్పి విజయకుమార్‌ను చాల అభినందించాడు.

మాటలసందర్భంలో శంభుదాసు మిత్రులిద్దరితో యిలాగన్నాడు "నాకు మళ్లి పెండ్లిచేసుకోవాలనే తలంపుంటే యేనాడో చేసికొనేవాణ్ణి. ఆ తలంపును మరల నా తలలో ప్రవేశపెట్టినవాడు పరంధామయ్య. పోనీ, చెప్పినవాడు యింకెక్కడనైనా చూచివుంటే బాగుండేది. కాని, అమ్మాయి ప్రసన్నకుమారి మనసు తెలుసుకోలేక, నారాయణరావుగారి మనసులో లేనిపోని ఆశలు కల్పించి యింత నాటకమాడడం చాల గొప్ప తప్పు. అతనినింకమీద మా యింటికే రానివ్వను."

ఆ మాటలనే సమర్థిస్తూ విజయకుమార్ "మీ యింటికి రానియ్యక పోవడమేమిటి, అతడీఊళ్ళోనే ఉండకుండ పంపివేయాలని మే మప్పుడే నిశ్చయించుకొన్నాము" అన్నాడు.

"మిత్రులు మీ రందరు నా కిప్పుడొక మహోపకారం చెయ్యాలి." అని శంభుదాసు అరుంధతిని దగ్గరికిపిలిచి" చూడండి, ఈమె నా యేకైక సంతానం. ఈమెను నారాయణరావు కుమారుడు రామమోహన్ వివాహ మాడేట్టు చేయాలి" అని ప్రార్థన పూర్వకంగా చెప్పాడు.

అరుంధతిని చూచి విజయకుమార్, చంద్రశేఖరం "రామమోహను కీమె తగినజంట" అని మనసులో నిశ్చయించుకొని తాము తప్పకుండ యీ వివాహం నెరవేర్చి తీరుతామని శంభుదాసుకు వాగ్దానం చేస్తూ "ఈ రాత్రి విందు సమయంలో రామమోహన్ ఏలాగు అమ్మాయిని చూస్తాడు కదండీ. ఈమెగారి నొక్కమారు చూచాడా, తరువాత ఎవరు చెప్పకనే అతడిష్టపడతాడు. తరువాత మేమంతా సరిచేస్తాము" అని చెప్పారు.

ఆ మాటలకు అరుంధతి సిగ్గుతో ముసిముసినవ్వు నవ్వుతో వెంటనే లోపలికి వెళ్ళిపొయ్యింది.

విందుభోజనానికి వచ్చేవారి సంఖ్యనుబట్టి డాక్టర్ యిల్లుచాలదని, వారి యింటికి సమీపంలోవుండే లక్ష్మీనారాయణ దేవాలయములో ఏర్పాటు చేయబడింది. ఊళ్ళో పేరొందిన వంటవాళ్ళను పిలిపించారు. కాంతమ్మ, మాణిక్యం వంట యేమేమి చేయవలసింది నిశ్చయించాక, అందుకు కావలసిన సంబారాలన్ని సమకూర్చబడినాయి. సాయంకాలం ఏడుగంటల కెల్ల వంట తయారైంది.

ఎనిమిదికల్లా ఆహ్వానితులంతా వచ్చారు భోజనాలకు. ఈలోగా విజయకుమార్, చంద్రశేఖరం ప్రస్తావించారు రామమోహన్‌తో అరుంధతిని నతడు పెండ్లాడవలసిన విషయమై, శంభుదాసు సంగతినికూడ విశదీకరిస్తూ అతని ఉదారతను చాల పొగిడారు. "సరే చూద్దాం" అని రామమోహను దప్పటికింకేమి చెప్పలేదు.

విందు సమయంలో తండ్రివెంట వచ్చిన అరుంధతిని చూచాడు రామమోహన్. తరువాత మరెవ్వరు చెప్పబని లేకుండానే అతని మనసామె మీద హత్తుకుపొయ్యింది. భర్తవల్ల యీ సంగతంతా విన్న ప్రసన్న చాల సంతోషించి అన్నను బలవంతపరచింది ఆ వివాహానికి సమ్మతించి తీరాలని. ఆమె అప్పుడే అరుంధతి తనకు వదిన అయినట్లు భావించి ఆమె నెంతో ఆదరంగా చూచింది. అరుంధతి కూడ రామమోహనుని చూచింది. ఇద్దరి మనసులు ఏకమై పొయ్యాయి.

భోజనాలయ్యాక అందరు సరససల్లాప గోష్ఠిలో తేలియాడే సమయంలో నిరంజనరెడ్డి లేచి ఆనాటి సంఘటనలనుగురించి, దాని పూర్వాపరములను గూర్చి ఒక అరగంటసేపు ఒకచిన్న ఉపన్యాసం దంచేస్తూ, అభినందించవలసిన వారినందరిని అభినందిస్తూ "ఉదయం సోమసుందర

రావుగారి వెంట మేమంతా నారాయణరావుగారి యింటికివెళ్ళి, వారి మనసును శాంతపరచి, యికమీద అందరము స్నేహితులై ఉండాలని ప్రార్థింపదలచాను" అని చెప్పేసరికి అక్కడ ఉన్నవారంతా చాల సంతోష పడి నిరంజనరెడ్డి ఉదారమనస్కత నెంతో మెచ్చుకొన్నారు.

విజయకుమార్ లేచి మిత్రులు తనకు మొదటినుండి యీ విషయమై చేసిన మహోపకారానికై వారికి తనకృతజ్ఞతను తెలుపుకొంటూ మళ్లీ యీలాగన్నాడు" నారాయణరావు, సోమసుందరరావు, శంభుదాసుగార్లు మా కింక యీ వూళ్ళో పెద్దలు, వారి ఆశీర్వాదబలముతో, అనుభవ జ్ఞానముతో యికముందు మాలాంటి యువకులజట్టు ముందునకు సాగిపో గలదు. ఈ సంతోషసమయములో తన కుమార్తెయగు కుమారి అరుంధతీ దేవిగారిని మా రామమోహనునకిచ్చి పెండ్లిచేయమని శంభు దాసుగారిని కోరుతూవున్నాను." అని లాంఛనపూర్వకంగా ఆ ప్రశంస నెత్తాడు.

శంభుదాసు తాను సిద్ధంగావున్నట్లు చెప్పాడు. అమ్మాయికూడ యిష్టపడిందన్నాడు. రామమోహన్ పరంగా చంద్రశేఖరం "అబ్బాయి కూడా యిష్టపడ్డాడు" అనేటప్పటి కందరుకు సంతోషాతిశయముతో కరతాళ ధ్వనులు చేశారు.

మాధవరావు అదేసందర్భములో కొడుకుతో ఏమో చెప్పగా విజయకుమార్ మరల యిట్లన్నాడు "పనిలోపనిగా నేను మా పెద్దల కోర్కెనుకూడ తెలుపవలసి ఉన్నది. నా చెల్లెలు రాధను చంద్రశేఖ రాని కియ్యాలని మా తలిదండ్రు లుత్సాహపడుతున్నారు."

చంద్రశేఖరం తనమౌనభావముతో తన సమ్మతిని వెల్లడించాడు. తక్కిన వారందరు చాల సంతోషించారామాటకు.

రాత్రి పదిగంటలుదాటినా విందునకు వచ్చినవారెవ్వరు యిండ్లకు పోలేదు. ఎవరిముఖంలో చూచిన ఉత్సాహం, సంతోషం తాండవిస్తున్నాయి. ఆ వాతావరణములో ఎవరు కాలాన్ని గుర్తించనే లేదు. శంభుదాసు, సోమసుందరరావు మొదలైనవారు పొందిన అమితానందాన్ని వర్ణింప బూనుకొంటే ఎంతోవుంది – .

ఇంతలో ఆ మహాసంతోష ప్రవాహం టక్కున ఆగిపొయ్యేంతటి గొప్ప విఘ్నమొకటి యేర్పడింది.

# 37

నారాయణరావు యింటినుండి తోటమాలి సుబ్బన్న లబోదిబో మంటూ పరుగెత్తివచ్చి రామమోహన్‌తో "బాబూ! కొంపమునిగి పొయ్యింది. అయ్యగారు పిస్తోలుతో కాల్చుకొన్నారండీ" అని నెత్తి నోరు మొత్తుకొంటూ అక్కడే కూలబడి పొయ్యాడు – ఆమాట వింటూనే అందరినెత్తిన పిడుగుపడి నట్లయ్యింది

రామమోహన్ ఒక్కక్షణమైనా నిదానించకుండా "ఎంతపని చేశావు నాన్నా." అని అరుస్తూ ఇంటివైపు పరుగెత్తిపోయాడు. అతని వెంటనే సోమసుందరరావు, నిరంజనరెడ్డి, చంద్రశేఖరం, ప్రసన్న, మాణిక్యం అక్కడఉన్న ఏదోకారులో వెళ్ళిపోయారు.

మాధవరావు భార్యను, బిడ్డను ఇంట్లో వుండమని తాను శంభుదాసు కారులో అతనితోకూడ వెళ్ళాడు. కాంతమ్మ, అరుంధతి, రాధ యేమి చేయను తోచక "ఎంతపని జరిగిందమ్మా!" అని విచారిస్తూ అక్కడే వుండిపోయారు.

సుబ్బన్న తెలిపినట్టు నారాయణరావు ఆత్మహత్య చేసుకొన్నమాట నిజము — .

కోర్టులోకూడ పరిస్థితులన్ని తనకు చుక్కెదురయ్యేసరికి అతడింక అక్కడ ఉండలేక ఎప్పుడో యింటికొచ్చేశాడు కారులో. మనసులో అగ్నిపర్వతం బ్రద్దలైనట్టుందతనికి. ఇంటికి వచ్చీరాకనే శ్యామసుందరి తాతరముఖముతో "ఏమండీ, అలాగున్నారు? ఏమయ్యిందండీ కేసు?" అని ప్రశ్నించింది.

అతడామె మాటను వినిపించుకోలేదు. మొగమంతా రక్తరంజితమై పొయ్యింది. ఆమెతో ఏమీ మాట్లాడకుండ తనగదిలోకి వెళ్ళి దభాలున తలుపుమూసుకొని, లోపల గొళ్ళెముంచుకొన్నాడు.

కారుడ్రైవర్ రసూలువల్ల శ్యామసుందరికి తెలిసిపొయ్యింది అకస్మాత్తుగా కోర్టులో సోమసుందరరావు హాజరయ్యాడని — కేసు పరిస్థితి అంతా తారుమారై పొయ్యిందని, ఆమెకొకవంక ఆనందము — మరియొకవంక దుఃఖము ముంచుకొనివచ్చాయి. భర్త యిప్పుడింక మాట్లాడేస్థితిలో లేడు. అత్యంతమైన ఉద్విగ్న భావముతో ఉన్నాడు. కొంత శాంతించిన పిదప తానై తాను వెలుపలికి వచ్చి జరిగినసంగతంతా చెబుతాడని ఆమె ఊరట చెందింది.

ఇంతలో సాయంకాలమై దీపాలుంచేవేళైంది. నారాయణరావు తలుపు తీయలేదు, శ్యామసుందరి సాహసించి పిలువలేదు. ఆమెకు నౌకర్లవల్ల రామమోహనుడు కోర్టునుండి సరాసరి పెదతండ్రితో విజయకుమార్ ఇంటికి వెళ్ళాడని తెలియవచ్చింది. ఇంటి నౌకర్లుకూడ ఉత్సాహహీనులై ఎక్కడివారక్కడ దేవుముఖాలతో కూర్చున్నారు.

ఎనిమిది గంటలప్పుడు ఉన్నదున్నట్టు నారాయణరావు గదిలో "ఢాం" అని తుపాకీపేలిన వెనుచప్పుడు వినవచ్చింది. శ్యామసుందరి

అదరిపడి నౌకర్లనందరిని కేకవేసి పిలిచి గదితలుపులను తీయబోతే అవి తెరువబడ్డాయి. లైటు వెలుగులో భర్త రక్తపుమడుగులో మూల్గుతూ వుండడం చూచి ఆమెకెవ్వున "అమ్మో" అని కేకవేసి మూర్ఛిల్లిపడి పోయ్యింది.

నౌకర్ల కేమిచెయ్యడానికి దిక్కుతోచింది కాదు. యజమానుడు ప్రాణాపాయదశలో తన్నుకొంటున్నాడు. యజమానురాలు అతని మీద పడి మూర్ఛపోయ్యింది. ఆమె శరీరము, గుడ్డలుకూడ రక్తముతో తడిసి పోయాయి, ఆమెను వారు తాకడానికి వీలుకాదు. "అమ్మగారూ అమ్మగారూ" అని ఎంతపిలిచినా పలుకకున్నది. సేవకుడొకడు వాడుకను బట్టి తక్షణమే వారియింటి డాక్టరైన రంగనాధంకొరకు పారిపోయాడు.

అంతలో శ్యామసుందరికి కొంత తెలివివచ్చి ఆ భీభత్సమైన దృశ్యముతో కన్నులు తిరిగిపోవడంవల్ల హాహాకారాలు చేస్తూ మరల మరల మూర్ఛిల్లి లేస్తూవుంది. నౌకర్ల ఓదార్పుతో ఫలితము లేకపోయింది.

నౌకర్లు నైజమైన తెలివితో నారాయణరావు ఎదపై తగిలినగుండు దెబ్బ కేదోచికిత్స చేయబూనుకున్నారు కాని రక్తస్రావ మాగలేదు. ఆలోగా రంగనాధం డాక్టరువచ్చి, జరిగిన ప్రమాదానికి తల్లడిల్లి పోతూ, కొంత సాహసించి, శ్యామసుందరి నీవలకు రమ్మని మరణో నారాయణరావుకు చేయవలసిన చికిత్సచేసినాడు. నానా -దుష్కర్మను గురించి పసిబిడ్డవలె వాపోయ్యే ఆ సా కురపెంచడం డాక్టరుకు అసాధ్యమైంది.

మూర్ఖులలో రెండురకాల వారు మొదట అజ్ఞానంగావర్తించినా, క్ర భవముచేత, తమ పొరబాట్లను

రెండవరకంవారు అలాంటివారుకారు. తుదకు ప్రాణంపోయినా సరే తిమతప్పిదాన్ని గ్రహించే దారికిరారు.

నారాయణరావు యీ రెండవరకానికి చెందినమనిషి. తనకిటీవల యింటాబయట పరంపరగా జరిగిన శృంగభంగానికి తనబుద్ధి హీనతయే కారణమని గ్రహింపలేకపోయాడతడు, తనకైనవారు కాని వారు కలసి తన ప్రతిష్ఠను కాలద్రోసి, తన్నెదిరించి, అవమానపరచినారని అతని దురభిప్రాయము. నైజమునకు తోడు పరంధామయ్య, వరదరాజులాంటి దుష్టుల కుటిలాలోచనలవల్ల అతనిబుద్ధి మరింత పెడలబట్టింది.

కేసులో పడిపోయింది మొదలుకొని ఆ దుష్టులిద్దరు అతన్ని పూర్తి దారి తప్పించి, మొదటికే ఎన్నికల అపజయకారణంగా పిచ్చివాడై పోయిన నారాయణరావుకు మరింత పిచ్చివాణ్ణిచేసి వేశారు.

కట్టకడకు తనపథకం పారకుండ, తనద్రోహాన్ని లోకానికి చాటేందుకు వీలయ్యేట్టు అన్న సోమసుందరరావు పబ్లిక్కు కోర్టులో అకస్మికంగా ప్రత్యక్షమై తన దుష్టబుద్ధిని వ్యక్తపరచేసే టప్పటికి నారాయణ రావు పూర్తి హతాశుడై పోయాడు. తానింక జీవించి ప్రయోజనం లేదనిపించిందతనికి. తన్నిక ఎదిరించి వెక్కిరించే జనాపవాదమనే రాక్షసి ఆ... పీకమీద కుర్చొనింది.

...ించేదారి లేక, మనసులో ఉబికివచ్చేనిరాశను, అవమానాన్ని ...హృదయం పగిలిపొయ్యేస్థితికి వచ్చింది. భూమి తన ...ని, బ్రహ్మాండముగా నోరుతెరచి, తన్ను మ్రింగ ...ను, తన యింటి కుక్కదాద యికముందు తన్ను

...క, నిరంజనరెడ్డి మొదలైనవారు ...షించి, సన్మానించి యుండే

కారు. కాని, కడకు అర్థములేని - మితిమీరిన అహంకారమువల్లనే వుదకీగతి ఆత్మహత్య చేసుకొన్నాడు.

కోర్టులో అన్నయగు సోమసుందరరావును చూచిన తక్షణమే అతడు భగ్నహృదయుడై పోయాడు. అతడింక ఒక్కక్షణమైన అక్కడ వుండ లేక కారులో యింటికివచ్చి - గదిలో ఒంటరిగా కూర్చొని - తన భవిష్యద్గతిని గురించి ఆలోచించి ఆలోచించి - కడకు బ్రతికివుండేమకంటె చనిపోవడమే బాగని నిశ్చయించుకొని - పిస్తోలుతో కాల్చుకొన్నాడు.

శ్యామసుందరి రాత్రి భోజనానికని రెండుమూడుసార్లు తలుపుతట్టి భోజనానికి పిలిస్తే లోపలినుండే ఆమెను కసరికొట్టాడు, పాపమామె చేసేది లేక "ముందేదిగతి, దైవమా!" అని విచారములో మునిగిపొయ్యింది. సరే - తెల్లవారేలోగా తానైతాను కొంత సమాధానపడి బయటికి వస్తాడని ఆమెహాడ కొంత సమాధానపడింది, కాని, ఉన్నదున్నట్టు పిస్తోలుశబ్దం వినేటప్పటికి, లోపల ఏమిజరిగింది ఆమెకు తటాలున స్ఫురించి, పారివచ్చి తలుపుతీసింది, గొళ్ళెమును తీసిఉంచాడు నిశ్శబ్దంగా నారాయణరావు అంతా సిద్ధపరచుకొని.

"నాన్నా - అమ్మా" అంటూ లోపలికి పరుగెత్తివచ్చిన రామ మోహనుడు ఆ భయంకరదృశ్యాన్ని చూచి తెలివితప్పి పడిపోయాడు క్రిందికి.

# 38

కొన్ని క్షణాలకు రామమోహనునకు తెలివి వచ్చి "ఎంతపని చేశావు, నాన్నా, కడకు" అని తండ్రి కళేబరంమీదపడి ఏడ్వసాగాడు.

తల్లిని కొడుకు, కొడుకును తల్లి కావులించుకొని ఒకటేవిధంగా ఏడుస్తుంటే ఏమిచేయను తోచక నౌకర్లంతా దుఃఖపడుతున్నారు. దగ్గర కూర్చున్న డాక్టరు ఊరట మాటలేమి పనిచేయలేకపోయాయి.

సోమసుందరరావు మొదలైనవారు వచ్చేటప్పటికి అంతా ముగిసి పోయింది. శ్యామసుందరి, ప్రసన్న, రామమోహనుల ఆక్రందన ధ్వనిచే అందరి హృదయాలు చలించిపోయాయి. శ్యామసుందరి, ప్రసన్నను ఒడిలో చేర్చుకొని బావురుమని జరిగినదంతా తలచుకొని ఏడుస్తూ, రాకరాక యింటికి వచ్చిన సోమసుందరాన్ని కూడ మరచి పోయింది. అతడు "అయ్యో, కడకీ దుస్థితిని చూడడానికా నేనింతకాలంమీద యింటికి వచ్చాను తమ్ముడూ! నిన్నీ దుస్థితిలో చూడవలసివచ్చెనా, తండ్రీ! నీవెన్ని తప్పులు చేసిన క్షమిస్తానని వచ్చానే. నా హృదయం నీకు తెలియక పోయినా, నారాయణా!" ఎంత ఘోరానికి ఒడిగట్టుకొన్నావు. కోర్టులో నే మొదట నిన్ను ఊరడించి ఉంటేనే బాగుండేదికదా! అవధి దొరకలేదు. ఎవరికి తెలుపకుండ ఇంటికి వచ్చిందిందుకేనా, తమ్ముడూ!" అని దుఃఖిస్తూ, మరదలను చూచి "అమ్మా, శ్యామసుందరీ! నీలాంటి యిల్లాలికి రారాని గతిని పాపిష్టి విధి తెచ్చి పెట్టింది. నేనిప్పుడింటికి రావడమే తప్పైందమ్మా తల్లీ! నేను రాకుండ ఉంటేనే బాగుండేది." అని ఆమెను, రామమోహను బిడ్డను నానావిధముల ఊరడింపసాగాడు.

వచ్చినవారంతా ఊరడించారు వారిని. శ్యామసుందరి దుఃఖసాగరంలో పడి తన్నుకొంటూ వుంది. రామమోహనుని పట్టడానికి వీలు లేకు... ఇద్దరు నారాయణరావు మీద పడి నానావిధాల ప్రలాపిస్తున్నారు. "ఇంక ఎంత యేడ్చి ఏమి ప్రయోజన" మని ఎవరెంత చెప్పిన వారికి దుఃఖోప శమనం కలుగ లేదు.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 106/B 145 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/94 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 219 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | 103 TO 106,167,168 |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |